# పెరిగే పిల్లలకి కావాలి కాంప్లాన్



## కేవలం కాంప్లాన్ లోనే వాళ్ళకు ప్రతి రోజూ అవసరమయ్యే 23 కీలక ఆహార పదార్థాలున్నాయి.

పిల్లల పెరుగుదల సామాన్యం వాళ్ళకి 15, 16 ఏళ్ళొచ్చేసరికి రమారమి పూర్తవుతుంది.

ప్రోటీన్లు, పెరుగుదలకు నేరుగా తోడ్పడే పోషక పదార్థాలు. అందుకే, మీ పిల్లలకు అవసరం, కాంప్లాన్—యిప్పుడు. కాంప్లాన్‌లో అత్యుత్తమమైన ప్రోటీన్లు-పాల ప్రోటీన్లు (20%) ఉన్నాయి. దాంతోబాటే దాన్లో 22 యితర కీలక ఆహారపదార్థాలు ఉన్నాయి.

కాంప్లాన్ రుచికరమైన సువాసనల్లో దొరుకుతుంది.



**23**

కీలక ఆహార పదార్థాలు ఆరోగ్యబద్ధమైన పాళ్ళలో

| | |
|---|---|
| ప్రొటీన్ | రైబోఫ్లావిన్ |
| క్రొవ్వు పదార్థాలు | నికొటినమైడ్ |
| కార్బోహైడ్రేట్ | కాల్షియమ్ |
| కేల్షియమ్ | పాంటొథెనేట్ |
| ఫాస్ఫరస్ | కోలిన్ |
| సోడియం, క్లోరైడ్ | పైరిడాక్సిన్ (బి6) |
| (సెల్ట్ రూపంలో) | విటమిన్ బి12 |
| పొటాషియమ్ | ఫోలిక్ ఏసిడ్ |
| ఐరన్ | విటమిన్ సి |
| అయోడిన్ | విటమిన్ డి |
| విటమిన్ ఎ | విటమిన్ ఇ |
| విటమిన్ బి1 | విటమిన్ కె |

పాలు కలపనవసరం లేదు.



**కాంప్లాన్®** – సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం

GK&E B84 GLC 68 Tel

# మనలో మాట

మా పాఠకులు, రచయితలు, రచయిత్రులు, ఏజంట్లు ప్రకటన కర్తలందరికి ఉగాది శుభాకాంక్షలు.

అంతకుముందు ఆంధ్రపత్రిక దినపత్రికకి అనుబంధంగా,ఉగాది సంవత్సరాది సంచికగా వెలువడుతున్న ఉగాది సంచికని ఆంధ్రసచిత్ర వారపత్రిక చదివేవారికి అందుబాటులోకి తీసుకురావాలన్న సంకల్పంతో గత ఏడాది రక్తాక్షి నామ సంవత్సర ఉగాది సంచికనించిఆంధ్ర సచిత్ర వారపత్రికకి అనుబంధంగా మార్చాము.ఆ సంచికకి పాఠకుల ఆదరణ బాగా లభించిన కారణంగా ఈ ఏడాది కూడా ఉగాది ప్రత్యేక సంచికని మరింత ఆకర్షణీయంగా రూపొందించడానికి ప్రయత్నం చేశాము. అది ఎంత వరకు నెరవేరిందో పాఠకులే నిర్ణయించగలరు.

ఈ సంచికలో ప్రత్యేక ఆకర్షణగా ఒక పూర్తి నవలని ప్రచురించాము. శ్రీ ఆదూరి వెంకట సీతారామమూర్తి రాసిన వైవిధ్యం గల 'చైతన్య దీపాలు' నవల పాఠకులని అలరించగలదని ఆశిస్తున్నాము.

శ్రీమతి 'అరుణ' చారిత్రక కథ 'యమదంష్ట్రిక', శ్రీ 'అంగీరస' రాసిన 'సాహిత్యంలో ప్రగతిసాధన', డాక్టర్ టి.ఆర్. కృష్ణన్ రాసిన 'శ్రీకృష్ణసతి రుక్మిణీదేవి ఆంధ్ర దేశ వాసియా' మొదలైన ప్రత్యేక వ్యాసాలు, శ్రీయుతులు వఝల కాళిదాసు; డా.సి.నారాయణరెడ్డి, వసంతరావు వెంకటరావు, సోమసుందర్, శనగన నరసింహస్వామి, మేకా సుధాకరరావు, డా. మాదిరాజు రంగారావు, పులికంటి కృష్ణారెడ్డి, డా. ఆర్. అనంత పద్మనాభరావు, బులుసు వెంకటేశ్వర్లు, సాంధ్యశ్రీ తదితర ప్రముఖులు క్రోధన ఉగాదికి స్వాగతం పలుకుతూ రాసిన కవిత్వాన్ని ఈ ప్రత్యేక సంచికలో పొందు పరిచాము.

మిగతా మామూలు శీర్షికలన్నిటితోపాటు కధలు,సీరియల్ నవలలూ,1984 సినిమా బాలట్ ఫలితాలు, ప్రత్యేక కార్టూన్‌లు, సినిమా శీర్షికలనేకం ఈ సంచికలో చోటు చేసుకున్నాయి.

మంచి రచనలని చదువరులకి అందించాలనే ధ్యేయంతో వెలువరించిన ఈ ఉగాది ప్రత్యేక సంచిక పాఠకుల ఆదరాభిమానాలని పొందగలదని ఆశిస్తున్నాము...

## బాగుంది

"అరుణ" ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రికలో "ఇదీ ఈ దేశం" కథ చాలా బాగుంది.

కె. ఎన్. వి.రవికుమార్, మైలవరం.

• • • • • •

నా అభిమాన నటి జయసుధ ముఖచిత్రం చాల ఆకర్షణీయంగా వున్నది.

బి. సరోజ, అమ్మపాలెం.

## ఆకర్షణీయం

1–7 ఫిబ్రవరి 85న జయసుధ ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రిక ఆకర్షణీయంగా ఉంది.

"మరుభూమిలో మరబొమ్మ" కథ నాకు నచ్చింది. జి. సాయిరమేష్ (రాఘ) గార్కి నా అభినందనలు.

నల్లూరి విశ్వేశ్వరరావు, అంతలూరు.




## సీరియల్స్

'లంచావతారం'లో రజని ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక రాగ భావ మౌన విపంచిక. 'పసిడి బొమ్మ'కు ప్రాణం పోసి రంగు రంగుల చిత్రాలు దిద్దిన నవ కుంచిక. 'రాగ సంధ్య'లో అనురాగ సుధాకాంతి వెలయించిన సువర్ణ కళాచిక.'కాగితపు పడవలు'తేలి ఆడుతూ ఉత్సాహం రేకెత్తే రసార్ణవ వీచిక.

ఆకెళ్ళ సుబ్బారావు, కందికుప్ప.

(128 వ పేజీ చూడండి)

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

(1938 - 1972)

శుక్రవారం : 15-21 మార్చి. '85

శ్రీ రక్తాక్షినామ సం. ఫాల్గుణ బ॥నవమి

సంపుటము 77 : సంచిక 28

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

విడిప్రతి వెల రు. 4-00

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

ముఖచిత్రం:

నటి 'శోభ'



ఆరోగ్యానికి రాచబాట
నెర్విటోల్®
బాలబాలికల పెరుగుదలకు
విద్యార్థుల వికాసానికి
వృద్ధుల ఆరోగ్య రక్షణకు
కార్మికుల కండపుష్టికి
సుఖ సంసారమునకు
క్రీడాకారుల జవసత్వాలకు
లాయర్ల సమయస్ఫూర్తికి
SILVER JUBILEE
NERVITOL
1955 1980
Regd No 256479
OMH
NERVITOL
AN EFFICACIOUS TONIC
PRINCIPAL INGREDIENTS
GOLD BHASMA
MUTYA BHASMA
SARPA GANDHA
ASWA GANDHA
AMONG OTHERS
INDIAN MEDICINE HOUSE
Prop Dr. D Radhakrishnamurty
సోల్ డిస్ట్రిబ్యూటర్స్
మాన్ ఫార్మా ఏజన్సీస్
ఏలూరు రోడ్, విజయవాడ 520 002
P B.NO.353
SOLE DISTRIBUTORS
M/s. Man Pharma Agencies
P. B. No. 353
ELURU ROAD, VIJAYAWADA - 520 002
Phone : 75696



ఉగాది వినోదం
ARUN
-శేఖర..
సిస్టర్ ఈరోజు ఉగాదికదా - తీపి, పులుపు, చేదు మందులు చూసి వాడు పేషంట్స్‌కి..!!
కాస్త ఉగాది పచ్చడి తీసుకెళ్దాగాని వుండు బాబూ!
రచయిత్రి
POST
వద్దమ్మా! నేనింకా చాలా మందికి లెటర్స్ ఇవ్వాలి!!
ఈరోజు స్పెషల్ సార్! పుల్లమామిడికాయ స్వీటు..!
వీడియో పార్లర్
ఉగాది పచ్చడి సేవించండి ఉచితంగా సినిమా చూడండి!
ఉదయం ఉగాది పచ్చడి తినే వుంటావ్! ఆ పచ్చడి తయారు చేయడానికి ఏమేం కావాలో చెప్ప గలవా?
APR 2
ఇంటర్వ్యూ
బాగా వచ్చిందికదాని వేప్పువ్వు కాస్త ఎక్కువగా వేశాలే!

# ఏమి మార్పులు వస్తాయో...

ఒకప్పుడు తాము వేషాలు వేసిన సినిమాలలో శ్రీ ఎమ్. జి. రామచంద్రన్ సునాయాసంగా– వంటికి దెబ్బ తగలకుండా– ఎందరినో చితకబాదేవారు; మొదటి అంతస్థు మీద నుంచి గుర్రం వీపు మీదికి– ఆ వీపు విరగకుండా– దూకేవారు; ఇంకా ఎన్నో వింత పనులు చేసేవారు. ఇదంతా తెరమీద, చలన చిత్రాలలో ఏదయినా జరగవచ్చునని సరిపెట్టుకుంటారు ప్రేక్షకులు. (సరిపెట్టుకోవటమేమిటి, అలాంటి అద్భుతాలు చూడటానికే సినిమాలకి వెడతారు– అని కొందరు.)

అయితే తెరమీది వింతలని మించే వింత పనిని ఇంతకు ముందే చేశారు. రాజకీయవాదిగా మారిన ఈ



శ్రీ ఎం. జి. రామచంద్రన్

సినిమా హీరో. భూగోళానికి అవతల వయిపు మంచానపడి మృత్యువుతో యుద్ధం చేస్తూ ఇక్కడ ఎన్నికలలో ఘనంగా గెలిచి మళ్ళీ తమిళనాడుకి ముఖ్యమంత్రి కాగలిగారు. (ఈయన తమిళం మాతృ-భాష కలవారుకారు. ఈయన ఆగ్నేయ ఆసియా దేశాలలో ఒకదానికి "చెందిన" మలయాళీ అంటారు. ద్రావిడనాడు వేరుగా విడిపోవాలనే ద్రావిడవాదుల సహచరుడుగా సినిమాలలో "పయికి" వచ్చారు. ఈయన ఒకప్పుడు నిరీశ్వరవాదిగా కూడా పేరు పొందారు. శ్రీమతి ఇందిరాగాంధీ ప్రోత్సాహంతోనే కావచ్చు ద్రావిడ మున్నేట్ర కళగమ్ నుంచి విడిపోయి స్వంత ద్రావిడ కళగమ్ ఒక దానిని పెట్టుకుని అప్పటి నుంచి ఎదురు లేకుండా ఏలుతున్నారు. అంతేకాదు. నిరీశ్వరవాదాన్ని వదులుకుని మొహ-మాటాలు లేకుండా తాము ఒకప్పుడు నిరసించిన బ్రాహ్మణ తతంగాలని గౌరవిస్తున్నారు కాంగ్రెసు (ఐ) వారిలో సయితం ఆయనకన్నా శ్రీమతి గాంధీ పట్ల విశ్వాసం కల ముఖ్య మంత్రి లేరంటే అతి-శయోక్తి కాదనిపిస్తుంది. ఈయన పోట్లాట పెట్టు-కున్న శ్రీ కరుణానిధి బ్రాహ్మణ కులానికి చెందని దక్షిణ ప్రాంతపు వ్యక్తి. శ్రీమతి ఇందిరాగాంధీ ఉత్తర ప్రాంతానికి చెందిన బ్రాహ్మణ వనిత. గొప్పగా చాటబడే కొన్ని రాజకీయ నినాదాలలోను ఎంతో ఈ వాస్తవాలు చెప్పక చెబుతాయి.)

శ్రీ రామచంద్రన్ బతకటమే కష్టమన్నారు. ఆయన బతకటమే కాకుండా మళ్ళీ ముఖ్యమంత్రి కూడా అయ్యారు. అంతటితో ఊరుకోకుండా తమ అను-చరులలో ప్రథమురాలు అన తగిన మాజీ సినిమా-నటి శ్రీమతి జయలలితని స్పష్టంగా తమ అను-గ్రహానికి పాత్రులయిన వ్యక్తిగా నిలబెడుతున్నారు. శ్రీ రామచంద్రన్ జబ్బు పడకముందు ఈమె అద్భుతంగా "వెలిగి పోయే"వారు. రాజ్య సభలో ఆమె అ. ద్రా. ము. క. ఉప నాయకురాలుగా ఉండేవారు. కొత్త ఢిల్లీలోని తమిళనాడు వసతి గృహంలో ఈమెకి ప్రత్యేక మయిన గది ఉండేది. ఆగదిలో ఆమె స్వంత టెలిఫోను ఉండేది. ఆమె కూడా తమని ఇంతగా (రాజకీయాలలో) పయికి తీసుకు వచ్చిన శ్రీ రామ చంద్రన్‌ని మొహమాటాలు లేకుండా స్తుతించే వారు. ఆయనకి నోబెల్ బహుమతి కావాలని అనేవారు. అయితే, ఆయన బాగా జబ్బు పడిన తరువాత శ్రీమతి జయలలిత "వెలుగు" మసక కావటం ప్రారంభించింది. ఆమెని ఆమె పార్టీ వారు కొందరు అవమాన పరచటం మొదలు పెట్టారు. చివరికి ఆమె తమిళనాడు వసతి గృహంలో ఉండ-టానికే వీలు లేదన్నారు. ఈ అవమానా లన్నిటినీ శ్రీమతి జయలలిత శాంతంగా భరించ లేదు. తమ వ్యతిరేకులని తమకి చేతనయినంతగా చివాట్లు వేశారు ఆమె.

చక్రం తిరిగింది. శ్రీమతి జయలలిత మరొకసారి ఉన్నత స్థానంలో ఉన్నారు. శ్రీ రామచంద్రన్ ఆమెని తమ వారసురాలుగా, పట్టం కట్టినా ఆశ్చర్యం లేదు. అప్పుడే తమిళనాడులోని "ప్రముఖులు" కొందరు శ్రీమతి జయలలిత కాబోయే ముఖ్యమంత్రి అన్నట్లు మాటలాడు తున్నారు.

ఉత్తర దేశంలోనూ, ఇతర ప్రాంతాలలోనూ కూడా కొందరు కాంగ్రెసు(ఐ) వారు సినిమా వారిని వాడుకుంటున్నారని హేళన చేస్తున్నారు. (ఇలాగ హేళన చేసే వారు తాము చలనచిత్ర నటులని ఆశ్రయించ టానికి వెనుకాడ్డం లేదు.) కాని, జరుగు తున్నదంతా చూస్తూ ఉంటే భారత దేశం అంతటా చలనచిత్ర వ్యామోహమే రాజకీయాలలో సయితం గెలుస్తుందని పిస్తుంది. 1967 లో ద్రా. ము. క. అధికారంలోకి వచ్చినప్పుడు కొందరు తమిళ ఆంగ్ల మానస పుత్రులు తమ రాష్ట్రంలో బ్రిటన్‌లో వలె "రెండు రాజకీయ పక్షాల పార్లమెంటరీ ప్రజా స్వామ్యం" వచ్చిందని మురిసిపోయారు. వారి సంతోషం ఎక్కువకాలం నిలిచి ఉండటానికి వీలు లేదు– అసలు వారి ఆదర్శ దేశమయిన ఇంగ్లాండు-లోనే లేబర్ పార్టీ చీలిపోయింది. అక్కడ మూడు పెద్ద పార్టీలు ఉన్నాయనీ అనుకోవాలి.

అసలు జస్టిస్ పార్టీ, ద్రావిడ కళగమ్, ద్రావిడ మున్నేట్ర కళగమ్ మొదలయినవి ఈరకం ఆంగ్ల



శ్రీమతి జయలలిత

-మానస పుత్రులని సహించ లేని వారివే. ఎలాగో వీరికీ, ద్రావిడ సిద్ధాంతాలని వల్లించే వారికీ మధ్య (హిందీ వ్యతిరేకత వలననే కావచ్చు) సఖ్యం కుదిరింది. జస్టిస్ పార్టీ, ద్రావిడ కళగమ్ మాయమయి పోయినట్లే ద్రా. ము. క. వారు ఎప్పుడో తమ అపసరణ వాదాన్ని వదులుకున్నారు అ. ద్రా. ము. క. ఏకైక నాయకుడు ప్రస్తుతం కొత్త ఢిల్లీతో చాలా స్నేహంగా ఉంటున్నారు. త్వరలోనే ఆయన నియమించిన తోటి సినిమా వ్యక్తి తమిళనాడు రాజకీయాలలో అద్వితీయంగా అభివృద్ధి చెందటం ఖాయం అనిపిస్తుంది. (అని "రాజకీయ పరిశీలకులు" అంటున్నారు.)

తమిళులని అనుకరించే తెలుగు వారు తమ రాష్ట్రంలో ఏమి పరిణామాలు తీసుకు వస్తారో చూడాలి! అంతే కాదు, భారత దేశం అంతటా ఏమి మార్పులు వస్తాయో

–సూరి

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుభాషి

# కోటలా రూపుదిద్దుకుంటున్న ప్రధానమంత్రి కొత్త నివాసం!

ప్రతి ఉదయం ప్రధానమంత్రి కార్యాలయం మీదుగానే నేను నా పనిమీద వెళ్తూ ఉంటాను. గత పది సంవత్సరాలుగా, అంటే మేము దక్షిణ ఢిల్లీకి మారినప్పటి నించి నా దిన చర్య ఇదే. సుమారు ఓ ఏడాదినించీ ఆ పరిస రాలలో వస్తున్న మార్పుని గమనిస్తున్నాను. ప్రధానమంత్రి నివాసంమీదుగా వెళ్లే ఆ రోడ్డు ఒకప్పుడు ఢిల్లీలోఅన్నిటికన్నా ఎంతో ప్రశాంతంగా ఉండేది. ఎంతో హడావిడిగా ఉండే ఉదయం వేళలలో కూడా రద్దీ చాలా తక్కువ ఉండేది. కానీ ఇప్పుడు అలాకాదు. వాహనాల రద్దీ పెరిగి, వాటి నడక నెమ్మదయింది. ప్రధానమంత్రి నివాసం దగ్గరే ఉన్న చుట్టుదారి తిరగటానికి మధ్యలోఎన్నోచోట్ల అవరోధాలని అధిగమించాల్సి ఉంటుంది. ఆరు నెలల క్రితం అదే రోడ్డులో ఒక్కచోటమాత్రమే వాహనాలు ఆగి, నెమ్మదిగా పోవాల్సి ఉండేది. కానీ ఇప్పుడు కనీసం అయిదారు చోట్ల అలా చేయాల్సి వస్తున్నది అక్కడ ఉన్న ఆయుధ పాణులైన కాపలావారిని జాగ్రత్తగా గమనించి వాహనాలని నడపాల్సి ఉంటుంది. రేస్ కోర్స్‌కీ, ప్రధానమంత్రి నివాసం దగ్గరున్న చుట్టు దారికీ మధ్య తుపాకులు ధరించిన కాపలా వారు దాదాపు ఓ వందమంది వరకూ ఉంటారు. ఇప్పుడు రేస్‌కోర్స్ రోడ్డులో నిర్మాణంలో ఉన్న ప్రధానమంత్రి కొత్త ఇంట్లోకి ఆయన మారిన తర్వాత వారి సంఖ్య మరింతగా పెరుగుతుందని నా నమ్మకం. రోడ్డుమీదనించి చూస్తే ఆ కొత్త నివాసం ఒక కోటలాగా కనిపిస్తున్నది. దానిచుట్టూ ఉన్న పెద్ద ప్రాకారం, పైన ఫ్లడ్ లైట్‌లూ, పహరా వారికోసం నిర్మించిన చిన్న కట్టడాలు చూస్తుంటే లెబనాన్, ఇజ్రాయిల్‌లపై తీసిన సినిమాలలో చూసినట్లుగా ఉంటుంది. పూర్వంలాగా ఇప్పుడు ప్రధాని నివాసం పరిసర ప్రాంతం అంతా కలివిడిగా ఉండటానికి ఏ మాత్రం వీలులేదు. పనిమీద ఆ దారినపోయే మాబోటివాళ్లు ఎందుకైనా మంచిదని మరో మార్గం వెతుక్కోవాల్సిన సమయం ఇక అట్టే దూరంలో లేదనిపిస్తున్నది

రాజీవ్‌గాంధీ అలాంటి ఇంట్లో ఉండబోతున్నందుకు నాకు విచారంగా ఉంది. అంతకన్నా ఈ దేశాన్ని గురించిన చింత మరింతగా ఉంది. భద్రతకోసం ఈ దేశం ప్రధానమంత్రి అలాంటి ఇంట్లో ఉండటం అన్నది సరైన పద్ధతేనా? దానిని నివాసం అనడంకంటే కారాగారం అనడం బాగుటుంటుంది ఒక ప్రజాస్వామ్య దేశాన్ని కారాగారం లేదా కోటలో ఉండి ఎలా పాలించ గలుగుతారు? ఎందరిభవిష్యత్తునో నిర్దేశించవలసిన ఆయనకి బయటి సమాచారం ఎలాఅందుతుంది ? ఆయన తమగదిలో కూర్చుని అక్కడినించే అందరి కష్టసుఖాలని పర్యవేక్షించగలరా? మనం సినిమాలలో చూసే నాజీ జర్మనీ, కమ్యూనిస్టు రష్యాలలోని ఒకప్పటి కాన్‌సన్‌ట్రేషన్ శిబిరాలని పోలిఉంటుంది ఇప్పటి మన ప్రధాన మంత్రికొత్త నివాసం. పాలితులనించి పాలకులని ఎప్పటికీ వేరుచేసే ఈ ముళ్ళతీగె కంచె ఫాసిజం ఆరంభానికి ప్రజాస్వామ్యం అంతానికీ చిహ్నం.

ముప్ఫయికి పైగా సంవత్సరాల క్రితం విద్యార్థిగా నేను లండన్ వెళ్ళగానే మొట్ట మొదట ట్రఫాల్‌గర్ స్క్వేర్, అడ్మిరాలిటీ ఆర్చి, వైట్‌హాల్‌ల మీదుగా 10, డౌనింగ్ స్ట్రీట్‌కి నడిచి వెళ్ళాను. అప్పుడు అట్లీ ప్రధానమంత్రిగా ఉండేవారు. మంచికో చెడుకో మన స్వాతంత్ర్యముతో సంబంధం ఉన్న ఆ ముసలాయన్ని చూడాలని నాకనిపించింది డౌనింగ్ స్ట్రీట్ పెద్ద విశాలమైన వీధేమికాదు. 2( అడుగుల వెడల్పు మాత్రమే ఉన్న ఒక చిన్న సందులో ఉంది. ఆ వీధిలోకి వెళ్ళి ప్రధానమంత్రి నివాసం ముందు నిలబడి చూస్తే కాస్త మెరుగ్గా ఉండే ప్రభుత్వం గృహంలా కనిపిస్తుంది అది. క్లెమెంట్

# శ్రీ చెర్నెంకో కాలధర్మం

సోవియట్ యూనియన్ అధ్యక్షుడు, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి శ్రీ కాన్‌స్టాంటిన్ చెర్నెంకో (74) మార్చి 10వ తేదీ మరణించారు.

శ్రీ చెర్నెంకో నోవోసెలావో జిల్లాలోని బోల్షయాటిస్‌లో 1911 సెప్టెంబర్ 24 న జన్మించారు. బాల్యం అంతా వ్యవసాయంలో గడిపిన తర్వాత విద్యాధికుడై కమ్యూనిస్టు పార్టీకి, సోవియట్ ప్రజలకీ తమ సేవలని అంకితం చేశారు. మాతృదేశానికి ఆయన సేవలకి గుర్తింపుగా రెండుసార్లు సోషలిస్టు శ్రమవీర బిరుదు, మూడుసార్లు ఆర్డర్ ఆఫ్ లెనిన్, మూడు సార్లు శ్రామిక అరుణ పతాక పురస్కారం, మరెన్నో పతకాలు ఆయనకి లభించాయి.



సోవియట్ యూనియన్ అధ్యక్షుడుగా ఉన్న కొద్దికాలంలోనే శ్రీ చెర్నెంకో అగ్రరాజ్యాల మధ్య చర్చలని పునఃప్రారంభించారు. భారతదేశంతో పరస్పర ప్రయోజనకరమైన సహకారానికి కొత్త చర్యలు తీసుకున్నారు. అంతర్జాతీయ రంగంలో శాంతి కోసం, అణ్వాయుధాల నివారణకి ఆయన ఎంతగానో కృషి చేశారు. ఢిల్లీలో జరిగిన ఆరు రాజ్యాల శిఖరాగ్ర సమావేశం చేసిన శాంతి ప్రకటనకి శ్రీ చెర్నెంకో వెంటనే తమ హర్షాన్ని వ్యక్తం చేశారు.

శ్రీ చెర్నెంకో మృతి వల్ల ప్రపంచం శాంతి కాముకుడైన ఒక నాయకుడిని కోల్పోయింది. □

అట్లీ అయినా, విన్‌స్టన్ చర్చిల్ అయినా ఉండేది అందులోనే. ద్వారంవద్ద ఒకేఒక్క రక్షకభటుడు ఉన్నాడు. ఒక చలికాలం సాయంత్రం వేళ నేను మొట్టమొదటసారి ఆ ఇంటి దగ్గరికి వెళ్ళాను. ప్రధానమంత్రిని చూడటానికి అప్పుడు అక్కడికి వచ్చి రోడ్డుకి అవతలి వైపు నిలబడి ఉన్నవారు ఓ అరడజను మంది కన్నా ఎక్కువలేరు. కొంతసేపయిన తర్వాత అట్లీ బయటికివచ్చి అక్కడ తమని చూడటానికి వచ్చినవారిని ఉద్దేశించి చేయిఊపి మేం ఏం జరుగుతుందో అనిచూస్తూ ఉండగానే ఆయన తనకారులో ఎక్కి వెళ్ళిపోయారు. నేను గమనించినంతవరకూ ఆయన వెంట అంగరక్షకులెవరూ లేరు. బహుశః ఆయన కార్యదర్శి అయిఉంటాడు, మరో యువకుడు మాత్రమే ఆయనతో వెళ్ళాడు. ముందువెనుకాల మోటారు శకటాల కాపలా వంటిదేమీ ఆయనకి లేదు. రోడ్డు మీద వెళ్తున్న వేలాది కార్లలో ఆయన కారుకూడా ఒకటి అన్నట్లుగా ఉంది.

తర్వాత ఓ నెల రోజులకి వారాంతపు శలవులు గడిపేందుకు స్నేహితుడితో కలిసి లండన్ బయట ఉన్న ఒక గ్రామానికి వెళ్ళాను. తినడానికి ఏదైనా కొందామని దగ్గరలో ఉన్న చిప్స్, చేపలు అమ్మే ఓ దుకాణానికి మేమువెళ్ళి అక్కడ క్యూలో నిలబడ్డాము. మాకుముందు కొంత దూరంలో ఉన్న వో ముసలాయన ముఖం ఎక్కడో చూసినట్లు అనిపించింది. తీరాచూస్తే ఆయన లార్డ్ పెథిక్ లారెన్స్. రాత్రి భోజనం కోసం చేపలు కొనడానికి ఓ చిన్న పిల్లవాడిని తోడుతీసుకొని వచ్చి ఆ క్యూలో నిలబడ్డాడు. మా లాగే ఆయనకూడా ఓర్పుగా తనవంతు వచ్చే వరకూ ఉండి డబ్బులు ఇచ్చి కావలసినవి కొనుక్కొని వెళ్ళాడు. అప్పుడు ఆయన అట్లీమంత్రివర్గంలో సభ్యుడిగా రాజప్రతినిధుల సభలో అధికార పక్షానికి నాయకుడిగా ఉన్నారు. ఆకుగ్రామంలో ఆయనకూడా మిగతా వారందరూ చేసిన భోజనమే చేసారు. అయినా అదేమీ చిన్నతనంగా ఆయన భావించి ఉండరు.

మన ప్రధానమంత్రి రక్షణ సిబ్బంది మాత్రం వాళ్ళుచేస్తున్న పనిని సమర్ధించుకోడానికి కారణాలెన్నయినా చెప్పవచ్చు. కానీ నాకు కావల్సింది అదికాదు అలాంటి కోటలో నివసించే వ్యక్తి సక్రమమైన ప్రజాస్వామ్య బద్ధమైన పరిపాలనని ఎలా చెయ్యగలరో నేను ఊహించలేకపోతున్నాను. చిన్న రిపబ్లిక్ అయినా అత్యంత భాగ్యవంతమైన స్విట్జర్లాండ్‌లో ఆ దేశం అధ్యక్షుడు తన కార్యాలయానికి ట్రామ్‌లో వెళ్లివస్తాడు. పశ్చిమ జర్మనీ రాజధాని బాన్‌లో ఆ దేశాధ్యక్షుడి నివాసంకన్నా ఇక్కడ మన ఢిల్లీలో ఉండే ఓ సంయుక్త కార్యదర్శి బంగళా ఎంతో బాగుంటుంది. అమెరికన్‌ల పద్ధతి మరోలా ఉంటుంది. కానీ వైట్‌హౌస్ చుట్టూ



అసెంబ్లీ ఎన్నికలలో ఘన విజయాన్ని సాధించి తిరిగి ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఏకగ్రీవంగా ఎన్నికైన శ్రీ నందమూరి తారక రామారావు.

మాత్రం మన ప్రధానమంత్రి కొత్త నివాసంగా చెప్పబడుతున్న రేస్‌కోర్స్ రోడ్డులోని అయిదవ నెంబరు ఇంటిచుట్టూ ఉన్నటువంటి నిషేధపు వాతావరణం మాత్రం ఉండదు.

ఇదంతా రాజీవ్‌గాంధీ తప్పు కాకపోవచ్చు. అయినా మనవాళ్ళు ఇవన్నీ అతిగా చేస్తున్నట్లు కనిపిస్తున్నది. ఇది ఇవాళ ప్రధాన మంత్రికే కావచ్చు. రేపు కాబినెట్ మంత్రులందరికీ, ఆ తర్వాత ఉన్నత స్థాయిలోని సీనియర్ ప్రభుత్వోద్యోగులకీ, న్యాయమూర్తులకీ ఇలాగే చెయ్యవచ్చు. ఈ విధంగా దేశంలోని అత్యున్నత పరిపాలనా వ్యవస్థ అంతా అడ్డంకుల వెనుకకి వెళ్లి, వాళ్ల నివాసాలచుట్టూ ఎత్తయిన గోడలు, వాటి మీద ఫ్లడ్‌లైట్లూ, ఆవరణలో రాత్రిపూట భయంకరంగా మొరుగుతూ ఉండే క్రూరమైన జాగిలాలతో నిండిపోవచ్చు. మనదేశం వంటి దాన్ని పరిపాలించడానికి తగినమార్గం ఇదొక్కటే అయితే మన నాయకులని జాగ్రత్తగా కాపాడటానికి ఇక మనం ప్రపంచంలో ఉన్న ముళ్ళతోనే అంతా శక్తివంచన లేకుండా సేకరించాల్సి ఉంటుంది. దానికి ఇదొక్కటే మార్గంకాదు. ఎటువంటి పరిస్థితులలో కూడా అలా జరగకూడదు. ప్రధానమంత్రి నివాసం చుట్టూ రక్షణ ఏర్పాట్లు పేరిటజరుగుతున్న ఈ విపరీతానికి బాధ్యుడు ఎవరో ఆ వ్యక్తికి తానెటు వెళ్తున్నాము తనకే తెలియనట్లున్నది. తాను ప్రధానమంత్రిని కాపాడుతున్నానని ఆ వ్యక్తి అనుకుంటూ ఉండవచ్చు కానీ చివరికి అది ఆయనని నియంతగా మార్చడంతోగానీ పూర్తికాదు. □

# ఉగాది.....

ప్రకృతి ప్రబంధంలో రమణీయమైన వసంతోదయఘట్టం. కాలచక్ర పరిభ్రమణంలోని మరో ఉగాదికి స్వాగత గీతిక ఆలపిస్తోంది కోయిలమ్మ తీయని కంఠం.

"అచ్యుతుని మీద జల్లె దుగ్ధాబ్ధి కన్య
భారతీదేవి పద్మజునిపై జల్లె
శచి మహేంద్రునిపైని జల్లె
గంధ కర్పూర కస్తూరి కాజలంబు" అంటూ

దేవతల వసంతోత్సవ వేడుకను మనోహరంగా వర్ణించాడు కవి సార్వభౌముడు శ్రీనాథుడు. వసంతాగమనంలో చిగురుమాలి గల గలలతో, సిరిమల్లె ఘుమ ఘుమలతో బంగరు భవితకు బాటలువేసే నవోదయం ఉగాది శుభోదయం.

చైత్రశుద్ధ పాడ్యమి ఆంధ్రులకు ఉగాది పండుగ. ప్రొద్దున్నే తలస్నానం చేసి వచ్చేసరికి పసందైన వేపపూవు పచ్చడి ప్రసాదంగా పెట్టేస్తుంది 'అమ్మ'. కొత్త బెల్లం, కొత్త చింతపండు, మామిడి కాయముక్కలు, వేపపూలు మొదలైన వాటితో రుచికరంగా చేస్తారు ఈ పచ్చడిని. ఈ పచ్చడి చెయ్యటంలో ఒక చక్కని భావం అంతర్లీనమై ఉంది. జీవితంలో ప్రతి మానవుడు తీపి, చేదు అనుభవాలన్నింటినీ రుచి చూడవలసి ఉన్నది. అందులోనూ చేదే ఎక్కువ. అని ఈ పచ్చడి జీవిత రహస్యం విప్పి చెప్తుంది. కష్ట సుఖాలను రెండింటిని అతి ప్రశాంతమైన మనస్సుతో స్వీకరించగల ఆత్మబలం సంపాదిస్తే, మానవుడే దేవుడన్న సత్యాన్ని బోధిస్తుంది ఈ రహస్యం.

పండుగనాడు చుట్ట పక్కాలతో పిల్ల పాపలతో ఇళ్ళన్నీ కళకళలాడుతుంటాయి. రకరకాల పిండివంటలు ఎవరిశక్తికి తగినట్లు వారు చేసుకొని కలిగినంతలో తృప్తి, ఆనందం పొందుతారు.

చాలా దేవాలయాలలో ఉగాదినుండి తొమ్మిది రోజులు అమ్మవారిని రోజుకొక అలంకారంతో పూజిస్తారు. ఉగాది నుండి శ్రీరామ నవమి వరకు శ్రీరాముని పూజించి రామనామ నవరాత్రులు కూడా చేస్తారు. ఉగాదినాడు సాయంత్రం పంచాంగ శ్రవణంలో దేశకాల పరిస్థితులు, గ్రహణ విశేషాలు తెలియజేయబడతాయి.

దేవాలయాలు వేదగానంతో ప్రతిధ్వనిస్తుంటాయి.

ఉగాది కొత్త సంవత్సరానికి మొట్ట మొదటి రోజు. కొత్త ఉత్సాహం, కొత్త ఉత్తేజం సహజంగానే ఉరకలు వేస్తుంటుంది. అందులోనూ ఇది యువజన సంవత్సరం. నేటి యువతకు వారి వారి తెలితేటలు చక్కగా వినియోగించుకోవటానికి ఎన్నో అవకాశాలు ఉన్నాయి. చక్కని శ్రమ శిక్షణతో

## ఉగాదీ! చైతన్య రసనిధీ!

మధురం
మనోహరం
మనోజ్ఞ భరితం
చైత్ర చిత్ర ప్రకృతి గీతం!

పరమ రమణీయం
ముగ్ధ మోహన రాగార్ణవం
భువనైక సుందర రూపం
పునీత పులకిత వసంత గమనం!

నిత్య చైతన్య స్రవంతి
సత్య సనాతన సంస్కృతి
అచలిత అతులిత మానవాభి కృతి
ఉగాది రీతి!
అనంత అగణిత శ్రావ్య సంసార శ్రుతి
యుగాది నాతి!

నవ పల్లవ ధాత్రి సుధా గాయత్రి
సుమకోమల రతి సువిశాల నేత్రి
సమస్త విశ్వ కల్యాణ ప్రీతి
ఉగాది సుదతి!
నిఖిల జనావళి ఆత్మ ద్యుతి
యుగాది ఉద్ధృతి!

నానారుచిర గతి భంగీ భగవతీ ప్రకృతీ
హంత్రీ గంత్రీ విలసతీ వసంతీ శివసతీ
జగజ్జననీ! భూమాతా! భవంతు!
సర్వేజనో సుఖినో భవంతు!

—డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు



కోమలత్వం - కులుకులమ్మ    భగవాన్ - పిఠాపురం

జీవితాన్ని సరిగా అవగాహన చేసుకుని తనవారికి, తన తోటి వారికి సరైన సహకారాన్నందిస్తూ నేటి యువత దేశ ప్రగతికి చక్కని రహదారి వేయాలి. కొత్త సంవత్సరపు కొత్త ఉత్సాహంతో యువతంతా ప్రేమమయమైన ఉత్తేజకరమైన విధానమే కార్యసాధనకు మూలమని గ్రహించాలి. జీవన సమరంలో గెలిచేది 'ప్రేమే'నని అర్థం చేసుకోవాలి. చేయి చేయి కలిపి కార్యరంగంలోకి దూకి వ్యక్తిగాను, సమిష్టిగాను విజయాన్ని సాధించాలి.

పండుగకు కొత్తబట్టలు కట్టుకొని పిండి వంటలు ఆరగించి హాయిగా గడిపేశాం అనుకోవటం కాదు పండుగ పరమార్థం. అందులోనూ ఇది ఉగాది పండుగ. ప్రతివారు తమకు నచ్చిన ఆదర్శాన్ని అమలులో పెట్టటానికి నిర్ణయించుకోవాలి ఈ రోజు.

మానవుని మహనీయునిగా చేయగల శక్తి ఆదర్శానికి ఉంది. "ఆదర్శం ఉన్నవాడు ఒక తప్పుచేస్తే లేనివాడు పది తప్పులు చేస్తాడు. అందువల్ల ప్రతివారికీ ఆదర్శం అనేది ఉండి తీరాలి" అన్నారు స్వామి వివేకానంద.

కాబట్టి "కులమత భేదాలు, అంతస్థుల అంతరాలు మరచి పోయి అర్థరహిత వివాదాలకు స్వస్తి చెప్పి మమతా మాధుర్యాన్ని ప్రతి మనస్సులో పండించుకుంటూ అభేదత్వమనే ద్వారాన్ని తెరచుకొని ఏకత్వమనే రాజ సౌధంలోకి ప్రవేశిద్దాం" అన్న మహత్తర ఆదర్శాన్ని స్వీకరించాలి మనమంతా ఈ ఉగాది ఉషోదయంలో!

—పి. ఆదిలక్ష్మి


మీ పళ్ల మీద
చిగుళ్ల పట్టు
సడలనివ్వకండి!

పూర్తినవల

# చైతన్య దీపాలు

ఆదూరి వెంకట సీతారామమూర్తి

## సమయం సాయంకాలం ఐదుగంటలు కాలేజీ ఆవర ణంతా కళకళ లాడుతూంది-
## వందలకొద్ది విద్యార్థినీ విద్యార్థులు వింతవింత దుస్తుల్లో ఎక్కడచూస్తే అక్కడ కన్పిస్తున్నారు.

**అందరి ముఖంలోనూ ఆనందం, ఉత్సాహం, విజిటర్సూ, పేరెంట్సూ కూడా ఎక్కువ సంఖ్య లోనే వస్తున్నారు.**

**ఎత్తుగా కట్టబడిన స్టేజి కూడ రంగు రంగుల బల్బులతోనూ ఖరీదైన కర్టెన్లతోనూ అందంగా అలంకరింపబడి వుంది. స్టేజి ముందు భాగంలో ఐదారొందల వరకూ కుర్చీలు అమర్చబడి వున్నాయి. ఆ వెనక బల్లలు—**

ఆ హడావుడికీ ఆ సంబరానికీ కారణం ఆ రోజు ఆ కాలేజీ వార్షికోత్సవం !

ఐదున్నర అయ్యేసరికల్లా కుర్చీలు చాలవరకూ నిండిపోయాయి.

స్టూడెంట్స్ యూనియన్ కార్యకర్తలూ, డ్రమెటిక్ అసోసియేషన్ మెంబర్లూ అంతా పువ్వులున్న పెద్ద పెద్ద బ్యాడ్జీలను తగిలించుకుని వచ్చే అతిథుల్ని సాదరంగా లోనికి ఆహ్వానిస్తున్నారు—

ముందు వరుసలోవున్న కుర్చీల్లో ప్రిన్సిపల్ గారూ, డిపార్ట్‌మెంట్ హెడ్సూ, స్థానిక ఎమ్మెల్యేలూ, నగర మేయరూ కొద్దిమంది కార్పొరేటర్లూ కూర్చొని వున్నారు. మిగతా వరుసల్లో లెక్చరర్లూ, స్థానిక ప్రముఖులూ—ఆ వెనక విద్యార్థినులూ—విద్యార్థులూ.

ఆనాటి విశేషమేమిటంటే హడావిడిగా తిరుగుతున్న విద్యార్థి కార్యకర్తలలో ఎక్కువ మంది విద్యార్థినులే ! అందరిలోకి అక్కడున్న అందరినీ అశేషంగా ఆకర్షిస్తున్న ఒకే ఒక విద్యార్థిని...సమీర.

ఆమె ఆ కళాశాలకు మొట్ట మొదటిమహిళా కార్యదర్శి— బియ్యే ఆఖరి సంవత్సరం చదువుతూంది—

అందమూ, అంగసౌష్టవమూ, తెలివి, చురుకు, ధనమూ, చాకచక్యమూ కలబోసిన స్త్రీమూర్తి అయిన ఆమె అందర్నీ ఆకర్షిస్తోందంటే ఆశ్చర్యపోనక్కరలేదు.

బయట జిల్లా కలెక్టరు గారి కారు ఆగడంతో కలకలం మొదలయ్యింది—

ప్రిన్సిపాల్ గారితోపాటు సమీర మరి కొద్ది మంది ప్రముఖులూ లేచివెళ్ళి వారికి స్వాగతం చెప్పారు.

మరి కాస్సేపట్లోనే సభ ప్రారంభమైంది—

అంతవరకూ హడావిడిగా తిరిగిన సమీర వేదికనెక్కి నిశ్చలంగా మైకు ముందు నిలబడి ఆనాటి ముఖ్య అతిథినీ, స్పీకర్‌నీ తదితర ప్రముఖుల్నీ వేదిక పైకి ఆహ్వానించింది—

ముఖ్య అతిథి' జిల్లా కలెక్టరూ అయిన కుమారి అమృతవల్లి వేదిక మీదికి రాగానే విద్యార్థినులు ఆనందోత్సాహాలతో చప్పట్లుకొట్టారు. విద్యార్థుల వైపు నుండి ఈలలు విన్పించాయి—

వేదికమీది ప్రముఖులను పుష్పగుచ్ఛాలతో సత్కరించాక ప్రిన్సిపాల్ తన ప్రారంభోపన్యాసాన్ని మొదలు పెట్టారు.

కాలేజి పుట్టుపూర్వోత్తరాల గురించీ, ఇక్కడి అధ్యాపకుల నిర్విరామ కృషి గురించి చెబుతూ అదే కాలేజీలో తనెలా డెమాన్‌స్ట్రేటర్‌గా చేరిందీ, స్వయం కృషి వల్ల లెక్చరర్, హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్ అయి, చివరికి ప్రిన్సిపాల్ అయ్యిందీ చెప్పారాయన— కాలేజీకి మంచి చరిత్ర వుందనీ ఇక్కడ విద్యనభ్యసించిన ఎందరో ప్రముఖ సైంటిస్టులుగానూ, సాహితీ వేత్తలుగానూ, ఆఫీసర్లుగానూ, కలెక్టర్లుగానూ, రూపొందారని అందుకు కారకులు ఉపాధ్యాయులేనన్నారు. కాలేజీ ఒక పవిత్రమైన ఆలయంగా భావించిననాడే అక్కడి విద్య విద్యార్థుల భావి జీవితానికి వెలుగవుతుందన్న ఆశాభావాన్ని వ్యక్తం చేశారు- అన్నిటికంటే విద్యార్థులలో క్రమశిక్షణ, నీతి నియమాలూ, దీక్ష అవసరం- అని ఆయన చెబుతూంటే ప్రేక్షకుల వెనుకనుంచి ఈలలూ తప్పట్లూ మొదలై [తారకస్థాయి నంటి] ఆయన తన ఉపన్యాసం విరమించేవరకూ ఆగలేదు—

తర్వాత ఒకరిద్దరు మాట్లాడేక కలెక్టరు అమృతవల్లి తన ఉపన్యాసాన్ని ప్రారంభించి విద్యారంగంలో ప్రభుత్వం చేయవలసిన మార్పుల్ని, చేర్పుల్ని క్లుప్తంగా వివరించి ముగించేరు—

ఈ మారు సమీర మైకు ముందు కొచ్చింది- ఆమెను చూడగానే మళ్ళీ మగ పిల్లల గుంపులోంచి హాహాకారాలు మొదలయ్యాయి-

కోపాన్నంతా లోలోపలే అణచి పెట్టుకుని సభలోని వారందరికి ఒక్కమారు రెండు చేతులూ జోడించి నమస్కరించి

'వేదికనలంకరించిన పెద్దలకు, మాన్యులైనఉపాధ్యాయులకు, సోదర సోదరీ మణులకు నా నమస్సుమాంజలులు— ఈ రోజు జరుపుకునే యీ పండుగకు ఒక విశిష్టత వుంది-' అంటూ ఒక్కమారుగా అందరి వంకా చూసింది.

ఆమె ఏం చెబుతుందోనన్నట్టు వాతావరణమంతా ఒక్కసారి నిశ్శబ్దంగా మారిపోయింది—

'నిజానికి మీ అందరిముందూ నిల్చుని యిలా మాట్లాడే హక్కు నాకులేదు—కానీ సోదర విద్యార్థులు నా ఎడల చూపిన ఆదరాభిమానాల వల్ల ఒక బాధ్యతనంటూ చేపట్టడం జరిగింది గనుక మీలోఒకదానిగా మనసు విప్పి నాలుగు ముక్కలు చెప్పాలనుకుంటున్నాను- ఒకప్పుడు ఆడ పిల్లకి చదువెందుకన్నారు— ఒక భర్తచాటున జీవనాన్ని సాగించడమే ఆమె జీవిత లక్ష్యమన్నారు— కాలక్రమేణా సంఘ సంస్కర్తలు స్త్రీకి జరుగుతున్న అన్యాయాలను ఖండిస్తూవచ్చి వారివిలువలను, బాధ్యతలనూ తెలివితేటలనూ వారికి గుర్తుచేసి స్త్రీ జాతికొక 'నూతనమార్గాన్ని లక్ష్యాన్ని చూపారు— ఎందుకు చెబుతున్నానంటే-- కో ఎడ్యుకేషన్ కాలేజీల్లోమగపిల్లలతోపాటుఎంతో అణకువగా చదువుకుని పోవాల్సిన ఆడ పిల్లలు యీనాడు తమ స్వేచ్ఛ కోసం తమ హక్కుల కోసం పోరాడాలనుకున్నారు— అందుకుఫలితమే నేనీ కాలేజీ విద్యార్థి సంఘానికి కార్యదర్శిని కావటం— బహుశంయా కాలేజీ చరిత్రలోనే ఒక ఆడపిల్ల కార్యదర్శిగా ఎన్నికవడం యిదేప్రథమమేమో! అందుకు నాకు చాల గర్వంగానూ సంతోషంగానూవుంది.

ఈనాటి మన ఉత్సవానికి జిల్లాకే అధికారిణి అయిన ఒక స్త్రీ.

క్షమించాలి... గౌరవనీయులైన అమృతవల్లిగారు ముఖ్యఅతిథిగా రావడం, మన ఆనందంలో పాలు పంచుకోవడం, కూడ నాకెంతో ఆనందాన్నీ ధైర్యాన్నీ కలుగజేస్తూంది.'' అంటూ తన ఉపన్యాసాన్ని ముగించి తదుపరి జరిగే కార్యక్రమ వివరాలను గురించి ప్రస్తావించింది.

ఆ తర్వాత ఒక ప్రక్కగా నిలబడి, ''ఇప్పుడు మీఎదుటకు రాబోతున్నది మిస్ మాధురి— బియ్యే మూడోసంవత్సరం చదువుతున్న యీామెకు లలితకళలలో మక్కువ ఎక్కువ— కర్నాటక సంగీతంలో ప్రావీణ్యాన్ని గడించిన యీామెకు హిందూస్థానీ సంగీతమన్నా యిష్టమేనట—

మాధురి రేడియో ఆర్టిస్టుగా కూడా మీకు పరిచయమే — ఇంతవరకూ ఆమె పది లలిత గీతాలను ఆకాశవాణి ద్వారా విన్పించి శ్రోతల మన్ననలను అందుకుంది—

ఇలా సమీర పరిచయం చేస్తుండగానే వేదిక మీదికి నెమ్మదిగా నడచి వచ్చింది మాధురి— ఒక్కసారి ప్రేక్షకుల నుండి చప్పట్లు విన్పించాయి—

మాధురి యిప్పుడు పాట పాడుతుంది— దయచేసిఅవకాశమివ్వండి' అని సమీర అనేసరికి సభ ఒక్కసారి నిశ్శబ్దమైపోయింది—

'ముంగిట్లోగన్నేరా...' అంటూ కృష్ణశాస్త్రిగారిగీతాన్ని మాధురి పాడుతూంటే అంతా మంత్ర ముగ్ధులైపోయారు— ఏ శాస్త్రీయ సంగీత స్వరమో ఎత్తుకుని చితక బాదేస్తుందని అల్లరి చెయ్యడానికి సంసిద్ధమై కూర్చున్న వెనుక బెంచీల్లోని పుణ్యపురుషులు కూడ మాధురి యొక్క గాన మాధుర్యానికి అచేతనంగా వుండిపోయారు— మాధురి గొంతులోని మార్దవం, ఆ పాటలోని భావం—అటువంటివి !

పాట పూర్వవగానే కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయి— ఆ సందడి తగ్గి తిరిగి సమీర మైకులో గొంతు సవరించుకోబోయే సమయంలో ఎవ్వరూ వూహించని సంఘటన జరిగింది— ఆ ఆవరణలోనే ఎవరో మందుగుండు సామాను పేల్చారు—

దాంతో ప్రేక్షకుల్లో కలకల, కలవరం మొదలయ్యాయి. కొందరు భయంతో కుర్చీల్లోంచి లేచారు— కొందరు లెక్చరర్లు ఆ సంఘటన జరిగిన ప్రదేశం వైపు వెళ్ళి మౌనంగానే గమనించసాగారు



## చైతన్యదీపాలు

పరిస్థితిని క్షణంలోనే అర్థం చేసుకుంది సమీర— ఆ అల్లరికి కారకులెవరో ఆమెకు బాగానే తెల్సు— స్టూడెంట్స్ యూనియన్ ఎన్నికల్లో తనకు ప్రత్యర్థిగా నిలిచిన సురేంద్ర ఒక్క చదువులో తప్ప అన్నిటా అందెవేసిన చెయ్యే— దానికి తోడు అతగాడు స్థానిక జిల్లా పరిషత్ చైర్మన్ గారి సుపుత్రుడు కావడంవల్ల అతను చేసే అల్లరికి హద్దూపద్దూ లేకుండా పోతోంది

అంతటి ఆస్తికీ, రాజకీయ చతురతకీ వారసుడైనవాడు ఒక ఆడపిల్ల చేతిలో ఓడిపోవడం అతనికి నామోషీగానే అన్పించింది— సమయమొస్తే తన కచ్చను ప్రదర్శించాలనే అనుకుంటున్నాడు అతను— ఎన్నికల తర్వాత జరిగిన మొదటి ఫంక్షన్ యిదే— అంచేత కార్యక్రమాలు సాఫీగా జరక్కుండా వుండేందుకు తన ముఠాతో సహా యీ గందర గోళాన్ని లేవదీశాడు—

జిల్లా కలెక్టరూ, స్థానిక ఎమ్మెల్యేలూ యితర ప్రముఖులూ వున్న సభలో యీ విధమైన అల్లరి జరగడాన్ని గురించి కాలేజీ ప్రిన్సిపాల్ గారు చాల బాధపడ్డారు— కానీ పూర్వపు రోజుల్లోలా విద్యార్థులను దండించి వారిని క్రమశిక్షణలో పెట్టే పనికి అతను పూనుకుని సాహసించ లేక పోయారు— మైకుముందుకొచ్చి 'మీకిలా చెయ్యడం భావ్యంకాదు' అంటూ నాలుగు మాటలేవో మందలింపు ధోరణిలో అని, చక్కా కూర్చున్నారు.

ఆయనంత క్లుప్తంగా మందలించడం సమీరకేం నచ్చలేదు— విద్యార్థులను తీర్చిదిద్దే ఉపాధ్యాయులే అలా భయపడి, మాకెందు కన్నట్లు తప్పించుకోజూస్తే వచ్చే తరాలుచేసే పిచ్చిపనులను యింకెవ్వ రాపగలరు అనుకుంది—

ఈమారు మళ్ళీ చీమటపాకాయల మోత విన్పించింది.

ఇక సహించలేక మైకుముందుకొచ్చింది సమీర "డియర్ బ్రదర్స్ అండ్ సిస్టర్స్— ఇది మన విద్యాలయం— ఇక్కడ మనం విద్యనర్థించె విద్యార్థులం— విజ్ఞతగల వ్యక్తులుగా వ్యవహరించాలి. పశువుల్లాకాదు" అని యింగ్లీషులో అనేసరికి వెనుక గోలచేసేవారు ఒక్కమారు యీలనేసి ఆగిపోయారు— ఆ అవకాశాన్ని జారవిడుచుకోదల్చుకోలేదామె "మిత్రు లారా— ఇది మన కాలేజీపండగ— మనపండగ— యీ ఆనందసమయంలో మనతోపాటు ఆనందాన్ని పంచుకోడానికి పురప్రముఖులెందర్నో అతిధు లుగా ఆహ్వానించాం వారిముందే మనమిలా ప్రవర్తించటం సిగ్గుచేటైన విషయం— ఇక్కడీ అల్లర్లను రేపేదెవరో చాలమందికి తెల్సు— కానీ మన పరువును మనమే నిలబెట్టుకుందాం— ఈ ఉత్సవం చేసు కోవడం ఏ ఒకరిద్దరికేనా యిష్టం లేకపోతే వారు వెళ్ళిపోవచ్చు దయ చేసి అల్లరి చేయకండి— పోలీసులకు పనికల్పించకండి" అంటూ అందరి వంకాచూసింది—

ఎక్కడో నాలుగైదు గొంతులు అరిచాయి— కానీ ఆ వెంటనేసభ నిశ్శబ్దమైపోయింది—

ప్రిన్సిపాల్ గారి కళ్ళు ఆనందాశ్చర్యాలతో మెరిశాయి—

ఆ తర్వాతి కార్యక్రమాలు వరుసుగా జరిగిపోయాయి—

చివరి అంశం బహుమతి ప్రదానం,

ఆనాటి సాంస్కృతిక కార్యక్రమంలో పాల్గొన్న విద్యార్థులతోపాటు డిబేట్స్‌లోనూ ఎస్సేరైటింగ్‌లోనూ పాల్గొని విజేతలైన విద్యార్థులకూ అంతకు ముందు సంవత్సరంలో కాలేజీ మొత్తం మీద ఎక్కువ మార్కులు స్కోరు చేసిన విద్యార్థినికీ, కూడ బహుమతులను కలెక్టర్ చేతి మీదుగా ప్రదానం చేశారు—

ఆటల పోటీలలో గెలుపొందిన వారికి బహుమతులందజేసేటప్పుడు సభలో మళ్ళీ యీలలు మొదలయ్యాయి - అందుక్కారణం ఎక్కువ బహుమతులను సమీర గెల్చుకోవడమే !

## చైతన్యదీపాలు

సరిగ్గా కలెక్టర్ గారి దగ్గర్నించి సమీర బహుమతినందుకుంటున్న సమయంలో ఎక్కడ్నించో ఓ కాగితపు ఏరో వచ్చి సూటిగా సమీరకు తగిలింది—

ఆ వెంటనే పెద్దగోల!

సమీర వంగి దాన్ని తీసి, అందరి ముందూ నలిపి ఓ ప్రక్కన పడేసింది—

ఆమెకు కోపంవస్తే ఏం చేస్తుందో...మైకందుకుని ఎవరికెన్ని చివాట్లు పెడుతుందోనవి ఆమె స్నేహితురాళ్ళు అమెను పక్కకు తీసుకు వెళ్ళారు—

సభ ముగిశాక కలెక్టర్ అమృతవల్లి సమీరను పిలిచి 'నీలాంటి ధైర్యవంతులుండాలమ్మా కానీ అటువంటి వారి చుట్టూ నిత్యం ఎన్నో చురకత్తులు దూసి వుంటాయన్నది మాత్రం మర్చిపోకూడదు' అంటూ హెచ్చరించింది—

అతిధులందర్నీ సాగనంపి, ప్రిన్సిపాల్ గారికి చెప్పి బయటకొచ్చింది సమీర—

విద్యార్థినీ విద్యార్థులంతా వెళ్ళిపోయినట్లే— సమీరకోసం మాత్రం మాధురి, హైమ, వాసంతి మిగిలిపోయారు—

'నువ్వుమాత్రం మైకుపట్టుకుని చాల విజృంభించేసేవే' అంది మాధురి సమీర నడుంచుట్టూ చేతులేసి—

'ఈ గ్రడ్జి పెట్టుకుని వాళ్ళేం అల్లరిచేసినా చెయ్యొచ్చు జాగ్రత్తగా వుండాలికప్పైన' అంది హైమ—

'పోండే—మీరిలా పిరికి సన్నాసుల్లా వుండబట్టే మగాళ్ళలా బోరలు విరుచుకుని, మీసాలు మెలేసుకుని మనల్ని హడలుగొడ్తున్నారు— ముఖాముఖి పోటీలో నిలబడలేనివాళ్ళేంయీ కారుకూతలూ యీ పిచ్చి చేష్టలూ చేస్తారు. చూస్తూండండి. నేనీ కాలేజీనుండి వెళ్ళేలోగా ఆ అల్లరిమూకలో ఒకరిద్దర్నైనా డిబార్ చేయించందే వెళ్ళను- అంది సమీర ఆవేశంగా—

అప్పటికి రాత్రి పదిగంటలైంది—

అప్పుడు గుర్తొచ్చింది సమీరకు— తన హేండ్‌బాగ్ స్టేజికానుకుని వున్న గదిలో వుండిపోయినట్లు—

'ఒక్క క్షణం ఉండండ్రా' అని వెనక్కు తిరిగివెళ్ళి నాలుగంగల్లో స్టేజిదగ్గరకు చేరుకుంది. సమీర.' స్టేజంతా నిర్మానుష్యంగా వుంది గదిలోకి వెళ్ళి తన హేండ్‌బేగ్‌ను చేతులోకి తీసుకుని వడివడిగా అడుగు లేసింది— సరిగ్గా అక్కడే ఆమె దృష్టినేదో ఆకర్షించింది—

అది...ఎవరో తనను గురిచూసి కొట్టిన కాగితపు ఏరో. దానిపై అక్షరాలు అందంగావుంటే ఆతృతగా మడతలువిప్పి చదివింది—

'ఐ థైంక్‌యూ మిస్ సమీరా— మీలాంటివారి స్నేహం అపూర్వం- ఆ అదృష్టం పూర్వజన్మ సుకృతం.'

ఒక్కక్షణం విస్తుపోయింది—

ఎవరో పేరుతెలియని వ్యక్తి ?

తన స్నేహాన్ని అంత ఉన్నతంగా వూహిస్తున్నాడంటే తనను ఆరాధిస్తున్నాడా...లేక...ప్రే...

తనలో తనే నవ్వుకుంది సమీర—

ఆ కాగితాన్ని సాపుచేస బేగ్‌లో పెట్టుకుని చకచకా నడిచింది—

* * *

''ముందు వాసంతిని వాళ్ళింట్లో దింపేద్దాం— అసలే భయస్తురాలు— వాళ్ళింట్లో అంతా గాభరా మనుషులు కూడ''

సమీర మాటలకు సరేనన్నారంతా—

ఆటో కదలి, కాస్సేపట్లోనే వేగాన్నందుకుని పరుగెత్తింది—







కొద్దిమంది సినిమా జనం తప్పితే రోడ్లన్నీ ఖాళీగానే వున్నాయి- ట్రాఫిక్ రోడ్లన్నీ దాటిపోయాక ఆటో మరింత స్పీడందుకుంది- పగలే ఎక్కువ సంచారముండదా రోడ్లో- రాత్రి కాబట్టి యించుమించు నిర్మానుష్యంగానే వుంది-

ఆటో డ్రైవర్ వైపు చూసింది సమీర- అతనికి సుమారు పాతికేళ్ళుండొచ్చు- చీకట్లో ముఖం సరిగా కన్పించక పోయినా కాలేజీ కుర్రాడిలానే వున్నాడు- అతగాడి ఫ్రెండో, మరో ఆటో డ్రైవరో అతని ప్రక్కనే కూర్చున్నాడు-

ఎందుకో వెనక్కు తిరిగి, ఆటో కేన్వాస్ కన్నంలోంచి చూసింది సమీర- ఆటో చక్రాల క్రిందినించి వెనక్కు పోతున్న రోడ్డు అక్కడక్కడ వెలుగుతూన్న వీధి దీపాల కాంతికి మెరుస్తూ మెటల్ బెల్ట్‌లా వుంది-

సరిగ్గా అదే సమయంలో వెనుక నుండి ఒక మోటార్ సైకిలు తమ ఆటోను ఫాలో అవుతున్నట్లని పించింది- మోటార్ హెడ్ లైట్ ఒక్కసారి ఆమె ముఖం మీద ఫ్లాష్ కొట్టింది-

"ఎవరో లే!" అనుకుంది-

ఆటో లేడీస్ హాస్టల్ వెనుక రోడ్లమ్మట వేగంగాపోతూంది- కాస్త దూరంలో టి. బి. హాస్పిటల్- అక్కడ్నించి చూస్తే దూరంగా గుట్ట మీద కొత్తగా వెలసినకాలనీలోని లైట్లు అందంగా ముత్యాలు పొదిగినట్లు కన్పిస్తున్నాయి-

మళ్ళీ వెనుక్కు చూసింది-

అంతే దూరంలో అదే మోటార్ సైకిలు తమ ఆటో వెనకాల!

ఎవరో తమని వెంటాడటం లేదు కద?

తల తిప్పేసుకొని ఆలోచనలో పడింది-

మాధురి, శ్యామ ఏవేవో మాట్లాడుతూనే వున్నారు-

నేషనల్ హైవే దాటింది ఆటో-

టైం పదీ యిరవై-

మరో రెండు ఫర్లాంగులు దాటితే కొత్తకాలనీ- హైవే నుండి రోడ్డు సరిగా వుండదు- వీధి దీపాలుకూడ లేవు-

చటుక్కున మలుపుతిరిగి, ఆటో ఓ సందులోకి దారి తీయడంతో అందరిలోనూ భయంతోకూడిన ఆందోళన చోటుచేసుకుంది-

'ఏయ్-ఇటెక్కడికి' అడిగింది సమీర డ్రైవర్ని గట్టిగానే-

అది అడిగినట్టులేదు- అరిచినట్టుంది-

ఆ మాటలేం విన్పించుకోనట్టు అదే వేగంతో వంపులు తిప్పుతూ పోనిస్తున్నాడు డ్రైవరు- ఒక్క సమీరతప్ప మిగతాముగ్గురూ భయంతో వణికిపోసాగేరు-

నిత్యం పేపర్లో చదువుతున్న ఆడపిల్లల అపహరణ-మానభంగాలు మొదలైన వార్తలు వారి కళ్ళముందు కదలాడాయి-

సందులోని మలుపులన్నీ తిరిగి ఆటో మరో రోడ్డుమీదికి చేరుకుంది- ఆ ప్రాంతంలోకూడ వీధి దీపాలు అట్టేలేవు- రోడ్డంతా మసగ చీకటిగా వుంది-

'నిన్నే- ఇటెక్కడకంటే మాట్లాడవేం' అంది సమీరే కాస్త గొంతు హెచ్చించి-

డ్రైవర్ మాత్రం మాట్లాడలేదు- తనపనిలో తామున్నాడు- అతని ప్రక్కన కూర్చున్నవాడు మాత్రం వెనక్కుతిరిగి, సమీరవంక చూసి వెకిలిగా నవ్వేడు-

పరిస్థితి పూర్తిగా అర్థమైంది నలుగురికీ-

నిస్సహాయులైన ఆడపిల్లలు-అందులోనూ అర్ధరాత్రి!

'ఆపుతావా లేదా' ఆడపులిలా అరిచింది సమీర.

ఆటోమాత్రం అరుపులకు అతీతంగా పోతూనేవుంది.

రాత్రిపూట కావటాన ఆ దారంతా ఏవిటో కొత్తగా వున్నట్టనిపించింది-

సమీర ఆలోచనలు పరిపరివిధాల పోతున్నాయి-

కాలేజీ ఫంక్షన్ అయ్యేంతవరకూ పోలీసులు వున్నారు. కలెక్టరు అమృతవల్లిగారు వెళ్తూ వెళ్తూకూడ తనకు జాగ్రత్తలు చెప్పారు.

ఫంక్షన్‌కూడ లేటయ్యింది. జవాను నెవరైనా వుంచేదా అంటే తనే ధైర్యంగా వద్దన్నది.

పది గంటలకు బయలుదేరే ఆఖరి సిటీబస్సుకూడా వెళ్ళిపోతుందన్న నమ్మకంతో తాము నలుగురూ ఆటో పిలిచి ఎక్కేశారు. అనుకోని ఆపద యిలా వస్తుందని ఎవరూహించారు?

అంతలోనే మెరుపులాంటి ఓ ఆలోచన ఆమె మెదడులో తళుక్కుమంది. ఒక్కసారిమిగతా ముగ్గురివంకా చూసింది. ప్రాణాల్ని గుప్పెట్లో పెట్టుకుని భయంగా వున్నారు వాళ్ళు.

చటుక్కున తన హేండ్‌బేగ్‌లోంచి ఫోల్డింగ్ అంబరెల్లా తీసి స్టీల్ రాడ్ పెద్దదిచేసి బలంగా ఒకేఒక్కదెబ్బ డ్రైవర్ బుర్రమీద వేసింది.

అంతే! ఆ దిమ్మకు ఆటో నాలుగు తిరుగులు తిరిగింది. ఇంతలో ఎదురుగా వస్తూన్న లారీనిచూసి ఆటోని ప్రక్కకు తీయబోయాడు.

అంతే- క్రింద లోయ?

సడెన్ బ్రేక్‌తో ఆటో ఆగింది.

అదే అదనుగా ఒక్క వురుకున బయటకు గెంతారు నలుగురూ. పెద్ద పెద్ద కేకలతో లారీనాపే ప్రయత్నం చేశారు. కానీ అప్పటికే అది చాలదూరం వారిని దాటి వెళ్ళిపోయింది.

చుట్టూ నిశ్శబ్దం-మసగచీకటి.

ఊరుదాటి ఎంత దూరమొచ్చారో తెలియదు.

వంట్లోని శక్తినంతా కూడదీసుకుని వెనుదిరిగైనా చూడకుండా ఊరివైపు పరుగెత్తడం మొదలుపెట్టారు.

ఎంతసేపలా పరుగెత్తారో...వెనుకనుండి ఏదో వాహనం వస్తున్నట్టయితే ఆత్రంగా చూశారు.

## క్రోధనా! క్రోధనా! శతపత్ర లోచనా

క్రోధనా! క్రోధనా! శతపత్ర లోచనా!
కోపమ్ము విడనాడి, రావమ్మ క్రోధనా!
నరులపై పగలేక, కనులలో సెగలేక,
ధరణిపై దిగిరావె నవబాట నలవోక,
పైరు పచ్చలు పండ, పాల కుండలు నిండ,
భరతావనికి దిగిరావె కై సేసి విరిదండ.
ద్వేషాగ్ని చల్లార, ప్రేమరసధునిపార,
దిగిరావె క్రోధనా! దేశమ్ము పొంగార.
దౌష్ట్యమ్ము తెగటార్చ, మోసమ్ము పరిమార్చ,
ధాత్రిపై దిగిరావె కూర్మి దొంతులు పేర్చ.
"మత పిచ్చి" నుగ్గాడ, "కులపిచ్చి" చక్కాడ,
మహిపైకి దిగిరావె మమత లాస్యమ్మాడ.
నరజాతి మురియంగ, నరునీతి విరియంగ,
ఇరునవ్వుతో రావె! సిరి జల్లు కురియంగ.
మానవుని తలపులో గారమ్ము కై సేయ,
మానవుని పలుకులో పేర్మి వెన్నెల కాయ,
మానవుని సేతలో, నెమ్మి తీవలు పూయ,
మానవుని బ్రతుకులో, వలపు కోయిల కూయ.
మల్లియల బాటపై, ఎలమావి చివురుపై
మము జేరు క్రోధనా! గరుణార్ద్రలోచనా

— కనమలూరు వెంకట శివయ్య

## చైతన్యదీపాలు

అది...ఆటో—

అందరి శరీరాలూ ఒక్కసారి భయంతో వణికిపోయాయి.

సమీర మాత్రం రోడ్డు ప్రక్కకు గెంతి, ముందు జాగ్రత్తగా రెండుచేతుల్లోకీ రెండు రాళ్ళను తీసుకుంది.

హఠాత్తుగా తాము తప్పించుకున్న ఆటోయే వెనుదిరిగి తమ వైపే దూసుకురావడం నలుగురూ చూశారు. వెనుకలోయ ముందు రోడ్డు. తప్పించుకుందికి మార్గంలేదు.

ఆటో బాగా దగ్గరౌతూందనగా చేతిలోని రాళ్ళను గురిచూసి బలంగా విసిరింది సమీర. ఆ వెంటనే నాలుగైదు రాళ్ళను నలుగురూ విసిరారు

అంతే—ఆటో ముందు అద్దం పెళ్ళుమంది.

అయినా రాకెట్‌లా అది దూసుకురావడం కెవ్వున కేక విన్పించడం ఆటో స్పీడందుకోవడం లిప్తలో జరిగిపోయాయి.

ఆ నలుగురిలో ముగ్గురే మిగిలారా రోడ్డుమీద.

వారిమధ్య వాసంతి లేదు!

★ ★ ★

### 2

సమయం రాత్రి పదిన్నర—

ఏదో పుస్తకం చదువుతూ వాలుకుర్చీలో కూర్చున్న రంగారావు గారి దృష్టిమాత్రం పుస్తకంమీద, అందులోని విషయంమీద లగ్నం కావటంలేదు. ఆయన ఆలోచనలన్నీ పరిపరివిధాల పోతున్నాయి.

లోపల గదిలో మంచంమీద పడుకున్న అన్నపూర్ణమ్మగారు కూడ నిద్రపోవటంలేదు. ఆమె మనసంతా దిగులుతోనూ భయంతోనూ నిండి వుంది. ప్రతి ఐదేసి నిముషాలకి ఓమారు లేచి వీధిలోకివెళ్ళి చూసి వస్తున్నారు. ఆవిడగారి ముఖంలో చికాకును, కోపాన్నీ చూసిన రంగారావు గారికి కాస్త భయంగానే వుంది. ఏమంటుందో ఏమోనని—ఎందుకో ...తన మనసులో వున్న ధైర్యాన్ని ఆమెతో చెప్పలేదు. చెప్పి ఆమెను అధైర్యంలోంచి బయటకు లాగలేదు.

'ఆఖరికి నేను చిలక్కి చెప్పినట్టు చెప్పేను. తొమ్మిదింటికల్లా వచ్చెయ్యితల్లీ అని, తండ్రంటే భయంలేని పిల్లలు యిలాగే తయారౌతారు' అంటూ రంగారావుగారి వంక కోపంగా చూసిందావిడ.

'ఇంతకీ యిప్పుడేమైందనీ? నువ్వు చెప్పినట్టు తొమ్మిదిమీదికి ముల్లు వచ్చేసరికి వచ్చెయ్యడానికి దానికి కుదరొద్దూ? పైగా యిది స్టూడెంట్స్ యూనియన్ సెక్రటరీఆయె. ఫంక్షనూ అదీ పూర్తయ్యాక కాలేజీవాళ్ళే ఏదో కార్లూ అదీ అరేంజ్‌చేసి దిగబెడతారు గాని నువ్వేం అనవసరంగా కంగారు పడిపోకు' అన్నారాయన.

''కంగారెందుకు పడతానూ? పడను. నాకూ దేవుడు రాయిలాంటి ఓ మనసూ, బండలాంటి ఓ హృదయమూ యిస్తే, ప్రేమాభిమానాలూ, భయాందోళనలూ చంపుకుని ఎంచక్కా ఓ యంత్రంలానే వుంటాను.''

'ఇంతకీ యిప్పుడేం కొంప మునిగిపోయిందనీ?'

'ఏమైందా? వయసులోవున్న ఆడపిల్ల—ఒంటరిది అర్థరాత్రి కావొస్తున్నా యిల్లు జేరకపోతే పట్టనట్టు ధైర్యంగా ఎలా వూరుకుంటాం? పేపర్లలో తెల్లారితే వెయ్యన్నొక్క సంఘటనలు చదువుతున్నాం—జరక్కూడనిదేదైనా జరిగితే మనల్నాదుకునేదెవరు?'

''అలా జరిగిపోడానికి మనమ్మాయేం అంత అబల తెలివి తక్కువదీ కాదుగానీ తీరి కూర్చుని నువేం బెంగపెట్టుకోకు. నేను అలా కాలేజీవరకూ వెళ్ళొస్తాను. సరా'' అంటూ టార్చిలైటు తీసుకుని, చెప్పులేసుకుని బయల్దేరారు రంగారావుగారు.

అప్పటికే వెన్నెల మసగమసగ్గా వుంది.

★ ★ ★

### 3

సమయం రాత్రి పదీ నలభై—

అసలే మసగ వెన్నెల. అందులోనూ రోడ్డుకిరు ప్రక్కలా గుబురుగా పెరిగిన చెట్లున్నాయేమో అవినీతి రాజ్యంతో ప్రబలిపోయిన అశాంతిలా చీకటి ఆవరించి వుందా ప్రాంతంలో దూరంగా కొండపక్క కొత్తగా వెలసిన కాలనీలోని లైట్లు మిణుగురు పురుగుల్లా అస్పష్టంగా కన్పిస్తున్నాయి.

'ఎంతదూరం వచ్చేశామో?' అంది మాధురి వణికే గొంతుతో. పాటలో గమకాల్ని చొప్పించి రసార్ద్ర హృదయాలను రంజింపచేసే ఆ గొంతు యిప్పుడు భయంతో వణుకుతోంది. దాహంతో తడారి పోతోంది.

'మనం రావడం కాదు. ఆ వెధవ తెచ్చాడు. అప్పటికైనా సమీరకా ఆలోచన కలగబట్టి మనమైనా వాడిబారినుంచి బయటపడ్డాం. ఏమైనా ఆడపిల్లలపై అత్యాచారాలు యింత ఘోరంగా జరుగుతున్న యీ రోజుల్లో స్త్రీలు ఏ ఆయుధాలూ లేకుండా ఎక్కడికీ బయల్దేరకూడదు. ఆత్మ సంరక్షణ కోసమైనా ప్రతి స్త్రీ కరాటేవంటి ఏదో ఒక విద్యనునేర్చుకోవడం అవసరం' అంది హేమ.

సరే ఇక ముందు సంగతి వదిలెయ్. ప్రస్తుతం ఈ గండంనించి ఎలా బయట పడాలో మనంముందు ఆలోచించాలి' అంటూ పట్నం వైపు వెళ్ళే ఏదైనా వాహనం వస్తూందేమోనని ఆత్రంగా వెనుక్కు చూసింది మాధురి. తారురోడ్డు నల్లత్రాచులా కన్పించిందామెకు. ఎక్కడా ఏ వాహనమూ వస్తున్న జాడలేదు.

# రైతు సోదరులకు శుభవార్త




అరుణా వారి ఆధునిక వ్యవసాయ పరికరములతో
మీ భవిష్యత్తును బంగారు బాటగా మలుచు
కోండి. గ్రామీణ నిరుద్యోగ యువకులు
ప్రభుత్వం వారిచే రూపొందించిన
గ్రామోదయ పథకమును వినియోగించు
కోండి. ప్రభుత్వమువారు యిచ్చిన
ఈ సదవకాశాన్ని దేశశ్రేయస్సుకు
వినియోగించండి

## ఇవేగాక మావద్ద

పంట నూర్పిడి యంత్రము
వేరుశనగ నూర్పిడి యంత్రము
మొక్కజొన్నలు వలుచు యంత్రము
బావులనుండి పూడకతీయు యంత్రము
వేరుశనగ వలుచు యంత్రము
మరియు ఎన్నో రకముల మరనాగళ్ళు
మీకు ఏమి కావాలో త్వరగా ఎన్నుకోండి.

## పంట నూర్పిడి యంత్రము

50 మంది కూలీలతోచేయు పని
6 గురు కూలీలతో చేయవచ్చును.
5 హెచ్. పి. మోటారుతోగాని
ఆయిల్ ఇంజనుతోకాని నడపవచ్చును.

# ARUNA INDUSTRIES

119 B, Kattedan Hyderabad 500252
PHONE. 48107

**Manufacturers & Exporters of Agriculture Implements & Machinery**



## చైతన్యదీపాలు

జోరుగా వీచేగాలికి చెట్ల ఆకులు చేసే వింత చప్పుడు భయంకరంగా తోస్తోంది.

సమీర మాత్రం వారితోనే వున్నా వాళ్ళిద్దరి మాటలూ వినటం లేదు. ఆమె మనసంతా ఆందోళనగా వుంది. ఆలోచనలతో బుర్రంతా వేడెక్కిపోతుంది. అంత చల్లటి వాతావరణంలోనూ వంట్లోంచి వేడి సెగలు బయటకొస్తున్నాయి. ఒళ్ళంతా స్వేదంతో తడిసిపోతోంది

అది అధైర్యం వల్ల కాకపోవచ్చు—

ఆ మాటకొస్తే తన మొండిధైర్యం వల్లనే వాసంతి బలైపోయిందేమోనన్న ఆలోచనకూడ వచ్చింది. ఏమైనా జరిగింది జరిగిపోయింది. ఇప్పుడేం చేయడం ? ఊళ్ళోకెలా చేరడం ? ఎవరితో ఎలా చెప్పడం ?

ముగ్గురూ పరుగులాంటి నడకతో నడుస్తున్నారు.

ఎంతలేదన్నా నాలుగైదు పర్లాంగులుంటుంది వూరు

ఇంతలో దూరంగా ఎవరిదో ఓ దగ్గు విన్పించింది.

ముగ్గురూ చెవులు రిక్కించి ఆ వచ్చిన శబ్దం దగ్గేనని నిర్ధారించుకుని అటువైపు చూశారు.

ఆ ప్రక్కనున్న పొలం గట్టుమీంచి ఓ మానవాకారం రోడ్డువైపుకు నడచివస్తోంది. ఆ మసగ వెలుగులో ఆ ఆకారం ఆడా మగో తెలియలేదు వారికి తలవద్ద ఎర్రగా చిన్న నిప్పుకణం అస్పష్టంగా కన్పిస్తోంది.

నడకలోని వేగాన్ని కాస్త తగ్గించి పరిశీలనగా చూస్తున్నారు ముగ్గురూ ఆ వంకే—

ఆ ఆకారం మనిషేనా ? నరరూప దెయ్యంకాదుగదా ?

మనిషే అయితే ఈ సమయంలో ఒంటరిగా యిక్కడేం పని ? ఏ హంతకుడో దోపిడీదారో అయితే తమగతేం కావాలి ? అరిచి గీపెట్టినా రక్షించే నాథుడెవరు ? తాముకూడా ఏదైనా అఘాయిత్యానికి బలైతే ?

ముగ్గురి తలల్లోనూ వెయ్యినొక్క ఆలోచనలు సంశయాలు పదివేల ప్రశ్నలు—భయాలు !

ఏమైతే అవనీ అని నడకజోరు హెచ్చించారు

దేవుడిపైనే భారం వేశారు.

ఏ వాహనమైనా అటొచ్చి! ఏ దైవస్వరూపుడైనా తమనీవిపత్తు నుండి కాపాడగలిగితే బావుండును.

ముగ్గురిలోనూ ఒకే ఆలోచన· ఒకే రకమైన కోరిక!

ఆ ఆకారం రోడ్డుకు దగ్గరగా వచ్చేసింది.

'ఎవరదీ ! గద్దించిందా కంఠం'

మగగొంతే ! ముసలిది.

ఆ గొంతులోని జీర వృద్ధాప్యానికి నిదర్శనంగా విన్పించింది.

సమాధానమివ్వాలా ? పరుగెత్తాలా ?

ఒకవేళ సాయం కోరదగ్గ వ్యక్తయితే ?

సమీర ఆగింది.

హైమ మాధురీ నడకలోని వేగం తగ్గించి కాస్త ముందుకుపోయి, ఆగాలా వద్దా అన్నట్లు చూశారు.

"ఎవరంటే పలకరేం ?" దగ్గరకొచ్చిందా ఆకారం అతనిని చూశాక సమీర కాస్త ధైర్యం తెచ్చుకుంది.

మేం తాతా—ఈ వూరి వాళ్ళమే అంది.

"ఎవరూ ఆడపిల్లలా ఈ యాలప్పుడు ఇటెందుకొచ్చారమ్మా" అన్నాడతను కప్పుకున్న నల్లదుప్పటి మరింత పైకిలాక్కుని కప్పుకుంటూ అప్పుడు చూసింది సమీర అతని చేతిలోని చెంబును.

అతన్ని చూసి అతని మాటలు విన్నాక అతనిపై ఒక విధమైన నమ్మకం కలిగింది; అప్పుడున్న ఆ స్థితిలో తమగోడు విని తోడుగా వచ్చే మనిషి ఎంతైనా అవసరమనిపించిందామెకు.

"మేం కాలేజీలో చదువుకుంటున్నాం తాతా. ఈ రోజు మా కాలేజీలో ఒక ఉత్సవముంది. అక్కడ ఆలశ్యమైపోయింది ఎవడో అటోవెధవ మమ్మల్ని మోసం చేసి ఈ దారి పట్టించాడు. అంటూ జరిగిన సంగతి చెప్పి వాసంతి విషయం చెప్పాలా వద్దా అనే సంశయంలో ఆగింది.

'ఆ మాత్రమైనా ఆలోచనా ధైర్యం వుండబట్టే మీరన్నా బయటపడ్డారమ్మా. మాకాన్రోజులు దాపరించాయి. నీతీజాతీ లేనోళ్ళం దరూ దేశంలో పెరిగిపోతున్నారు పాపంలా. ఆడకూతుళ్ళు పేణ మానాల్తో బతకడం కష్టమైపోతుంది' అని ఒకక్షణమాగి,

'మీలాంటోళ్ళు నడవడానికైతే వూరుదూరమేతల్లీ—ఏ బస్సో లారీయో వూళ్ళోకెళ్ళేదొస్తే ఎక్కిస్తాను. అందాకా ఆగండి అందాకా నేను మీకు సాయముంటాను" అన్నాడు.

బతుకు జీవుడా అంటూ వూపిరి పీల్చుకున్నారు ముగ్గురూ.

"నువ్వుండే దెక్కడ తాతా. వూళ్ళో కాదా" అడిగింది హైమ.

'కాదమ్మా అల్లవేటి అవే మా పాకలు.' అన్నాడు. రోడ్డుకి ఎడంవైపు కాస్త దూరంలో వున్న పాకల్ని చూపిస్తూ.

అటువైపు చూశారు ముగ్గురూ.

ఆ మసగ చీకట్లో గొప్పవాళ్ళు తిని విసిరేసిన పకోడి పొట్లాల ఆకుల్లా చిందరవందరగా కొన్ని పాకలున్నాయక్కడ.

'నీ పేరేంటి తాతా—నువ్విక్కడేం చేస్తుంటావ్' అడిగింది సమీర.

'నన్ను వీరయ్య అంటారమ్మా ఏం చేస్తాను ? ముసిలోడినై పోయాను. పూర్వం రోజుల్లో వ్యవసాయప్పనులున్నప్పుడు కూలి చేసుకునే వోడ్ని. ఒంట్లో బలం సన్నగిల్లిపోయింది, ఏవో నాలుగు కోళ్ళనీ రెండు మేకల్ని పెట్టుకొని బతుకెళ్ళమారుస్తున్నాను. బుట్టలల్లడం వచ్చు. అదే బతుకుదారి అన్నాడు.

అమాయకమైన అతని ముఖంలోకి పరిశీలనగా చూసింది సమీర. రాక్షసత్వం ప్రబలిపోతున్న యీ రోజుల్లో కూడా యింతటి అమాయకులూ, తోటి మనిషిని ఆపదలో ఆదుకునే సాధు స్వభావులు వున్నారా అన్పించింది.

మంచి మానవత్వం వెలివేయబడుతున్నట్లే వీరి యిళ్ళు కూడా పట్నానికి దూరంగా విసిరి వేయబడ్డాయి. దేశానికి స్వతంత్రమొచ్చిన ఇన్నేళ్ళ తర్వాతకూడా దారిద్ర్యరేఖకు అడుగున ఎన్నో జీవితాలింకా వున్నాయంటే అది విచారించదగ్గ విషయమే అన్పించిందామెకు.

★ ★ ★

## 4

సమయం రాత్రి పదకొండు.

మేడమీద వీధివైపునున్న బాల్కానీలో నైట్‌గౌన్లో పచార్లు చేస్తున్నారు వెంకటేశ్వరరావు గారు.

'మాధురితో పాటుతనూకాలేజీ ఫంక్షన్ వెళ్ళి ఉంటే బావుండేది' అనుకున్నాడాయన. యిరవైరెండోసారి తనలో తనే.

"వెధవది క్లబ్బు మీటింగొకటి అడ్డుతగలక పోతే వెళ్ళి ఉండే వాడిని. అయినా ఎంత కాలేజీ ఫంక్షనైనా మరీయింత రాత్రివరకూ వుంటుందా ? అనుకున్నాడు. ఆ వెంటనే హాల్లోకి వెళ్ళి క్రేడిల్‌లోంచి టెలిఫోన్ ఎత్తి కాలేజీ నంబర్‌కి డయల్ చేశాడు. ఇది మొదటిసారి కాదు. నాలుగోసారి. అరగంటలో మూడు మార్లు చేశాడు. అవతల ఫోను రింగవుతున్నా ఎవరూ తీయటం లేదు

ఈ మారూ అంతే అయింది. చికాగ్గా చిందులు వేశాడాయన.

వచ్చిన వెంటనే కాలేజీకి వెళ్ళినా యీ పాటికి మాధురిని తీసుకొచ్చేసేవాడు.

క్లబ్బు నుండి వచ్చేసరికే పదయింది ఎంత రాత్రయినా వచ్చిన వెంటనే స్నానం చేయడం తనకలవాటు. తన స్నానం అయ్యేసర్కి రాక పోతుందా అని అనుకున్నాడు. పోనీ బస్సులుండ వనుకున్నా వెళ్ళేముందు ఖచ్చితంగా చెప్పనే చెప్పాడు. బస్సులు గురించి కూర్చోక ఎవరేనా ఒకరి ద్దరు సాయముంటే ఆటోలో వచ్చెయ్యమ్మా అని.

మాధురి వచ్చాకనే కలిసి భోంచేద్దామనుకున్నాడు. గోడగడియారంలో పదకొండు కొట్టి అప్పుడే మూడు నిముషాలయ్యింది.

రెండు నిముషాలాగి, ఓ నిర్ణయానికొచ్చిన వాడై నైట్ గౌను విప్పి, ఫుల్ స్లీవ్స్ షర్టు, స్వెట్టర్ వేసుకొని స్కూటర్ తాళాలు చేతిలోనికి తీసుకుని బయల్దేరారు

★ ★ ★

## 5

సమయం రాత్రి పదకొండూ పది.

వెనుకనుండి ఏదో వాహనం వస్తున్న శబ్దమైతే వెనుదిరిగి ఆశగా చూశారు నలుగురూ.

దూరంనించి రెండు లైట్లు కాంతివంతమై తమవైపే దూసుకుని వస్తున్నాయి.

సమీరకు తాము ఆటోలో వున్నపుడు తమ వెంటే వచ్చిన మోటార్ సైకిల్ మనసులో మెదిలింది

అనవసరంగా అనుమానించింది. అతనెవరో తమవెంట వచ్చినా యీ పరిస్థితి ఎదురయ్యేది కాదేమో! వాసంతి పరిస్థితి తల్చుకునేసర్కి సమీర మనసంతా దిగులుతో బరువెక్కిపోయింది.

"బస్సో నారీయో వస్తుంది. నేనాపిత్తా వుండండి" అన్నాడు వీరయ్య,

అప్పటికే అది దగ్గరకొచ్చేసింది.

కాస్త రోడ్డుమీదికి వెదురెళ్ళి చేతులూపి ఆపేడు వీరయ్య.

అది బస్సుకాదు ఉప్పుబస్తాలు తీసుకొస్తున్న లారీ.

"ఈ ముగ్గురాడ కూతుళ్ళనీ కాస్త వూళ్ళోకి దిగబెట్టండి బాబ్బాబూ" డ్రైవర్ని బతిమాలేడు వీరయ్య.

వచ్చే సమాధానం విని తర్వాత తను మాట్లాడాలనుకుంది సమీర. రోడ్డు ప్రక్కనే నిలబడి చూస్తున్నారు ముగ్గురూ.



# మేలిముసుగులో సరస్వతి

ఇవాళ నా యింట్లో సరికొత్త దృశ్యం
మేలి ముసుగులో సరస్వతి కూచున్నట్టు ;
నమస్కరిస్తున్న ఆ శిరస్సుపై నేను
నా హృదయాన్ని అక్షింతలుగా చల్లుతున్నట్టు.
సరస్వతికి ఆశీస్సులా ?
ఔను సరస్వతి చిరంజీవి.
అందుకే నా ఆశీస్సులు.
అనవసర స్తుతి చిరంజీవికి మృతి.
వేదంలో పలికిన సరస్వతి
వెర్రిబాగుల్ది ; - కాకుంటే
పసివాళ్ళ బోసి పలుకుల్లో
పల్లెటూళ్ళ యాస చెణుకుల్లో
పక పక నవ్వుతుందా ?
వాగైనా వాకై్కనా
జలమైనా స్వరమైనా
అదృశ్యంగా వున్నా ఆర్భాటంగా వున్నా
ఆకృతికి ఆకృతికి ప్రతీక సరస్వతి.

— డా॥ సి. నారాయణరెడ్డి

## చైతన్యదీపాలు

డ్రైవరూ క్లీనరూ కాక మరొకరెవరో కూడ ముందుసీట్లో కూర్చున్నారు. ముగ్గురాడపిల్లలనే మాట వినపడ్డంతోనే అట్నించి డ్రైవరూ యిట్నించి క్లీనరూ బుర్రలు బయటకుపెట్టి రోడ్డుమీద నిల్చున్న వారివంక చూశారు.

''ఏంటికత?'' అన్నాడు డ్రైవరు. అంత చీకట్లోనూ అతని గారపళ్ళ వెనుకనున్న వెకిలినవ్వు స్పష్టంగానే కన్పించింది సమీరకు.

ఛ నేరకపోయి ఆపేం అనుకుంది. అసలు యీ మగజాతంతా యింతే కాబోలు ! ఆడది ఏ స్థితిలో ఎలా కన్పించినా వారూహించేది మాత్రం ఒక్కటే. వాళ్ళ ఆలోచనా రీతిలో మాత్రం మార్పురాదు కాబోలు !

''కాలేజీలో చదువుతున్న ఆడపిల్లలు ఏదో ఆపదొచ్చి ...'' వీరయ్య ఏదో చెబుతున్నాడు.

''ఆడపిల్లలంటున్నావ్. రోజులసలే బాగోలేవు. ఏ పోలీసాడి కంటన్నా పడితే లేనిపోని చికాకులు'' అంటున్నాడు డ్రైవరు.

తాము చాల అసహ్యకరమైన పరిస్థితులో యిరుక్కుపోయినట్టు యిబ్బందిగా కదిలారు స్నేహితురాళ్ళు ముగ్గురూ. ఈ రోజుల్లో ఇల్లు కదిలిన ఆడపిల్లలెన్ని సమస్యల్ని ఎదుర్కొంటోందో వూహించసాగేరు.

ఇంతజరిగేక, ఒకవేళ వాళ్ళందుకుఅంగీకరించినా తాము ఎక్కాలా వద్దా అన్నదే సమస్యగా నిలిచింది. ప్రభుత్వ బస్సుల్నే ఆపేసి దోచుకుంటూంటే ఏమీ చేయలేని రక్షకదళం అర్ధరాత్రి లారీల్లో వెళ్ళే ఆడపిల్లలపై ఏదైనా అత్యాచారం జరిగితే రక్షిస్తారని నమ్మకమేముంది ?

'ఇంతకీ ఎక్కడకెళ్ళాలండీ' అంటూ డోర్‌తీసుకుని దిగివచ్చాడు క్లీనర్ కుర్రాడు. నిండా పాతికేళ్ళుండవ్ ఆ కుర్రాడికి. అమితాబ్ బచన్ టైపు క్రాపూ, మోహన్‌బాబులాంటి డ్రస్సూ— చేతిలో చార్మినార్ సిగరెట్టూ.

ఎక్కడికెళ్ళాలో చెప్పింది సమీర.

ముగ్గురి ముఖాల్లోకీ పరీక్షగా చూశాడు వాడు.

మాధుర్ని చూడగానే చటుక్కున ముఖంలోని రంగుల్నీ ఫీలింగుల్నీ మార్చి;

'మీరు వెంకటేశ్వర్రావుగారి అమ్మాయిగారు కదండీ'' అన్నాడు. అతడికెలా తెలుసునోనని ఆశ్చర్యంగా చూసింది మాధురి.

''నాన్నగారు నీకుతెల్సా'' అడిగింది.

బలేవోరే తెలీకేం పనిమీద నాలుగైదుసార్లు మీ యింటికాడ వచ్చాను' అన్నాడు.

అతనిముఖంలోకి చూసింది మాధురి. ఎప్పుడో చూసినట్లే అన్పించింది.

'ఇంతకీ యీ యేలప్పుడు...ఇక్కడ...' నసిగేడు—

'అదో పెద్దకథలే' అంది సమీర కల్పించుకుని.

''ఎక్కండమ్మా మీకేటి ఇంటికాడ బద్రంగా దింపుతాం'' అని 'ఓరె అప్పర్రాజా నువ్వు దిగి బేక్‌నెక్కు. అమ్మాయిగోర్లు మనకి తెల్సినాళ్ళే' అంటూ డ్రైవర్ దగ్గరకు వెళ్ళాడు.

సమీరతోపాటు ముగ్గురూ బ్రతుకుజీవుడా అన్నట్లు వూపిరి పీల్చుకున్నారు.

లారీలో ఎక్కడం ముగ్గురికీ అదే ప్రథమం. డ్రైవర్ ప్రక్కన సర్దుకుని కూర్చున్నారు. క్లీనర్ వెనకనెక్కాడు.

'మరి నేనుంటానమ్మా జాగర్తగెళ్ళండి' అన్నాడు వీరయ్య.

ఆతృతలో ఆలోచనలో అతగాడి గురించే మర్చిపోయారు.

'అలాగేతాతా. పాపం నీకు శ్రమకలిగించేం. నువ్వు చేసిన సాయ మాత్రం మర్చిపోలేం. ఎప్పుడేనా మీ యింటికొస్తాంలే' అంది సమీర.

ఈమాటలంటున్నప్పుడు ఆమె కళ్ళలో తడి తళుక్కుమనెరిసింది.

'అలాగేలేమ్మా' అంటూ అడుగు వెనక్కువేశాడు వీరయ్య.

ఆ క్షణంలో ఏ మానవత్వపు మమతానుబంధానికో దూరమౌతున్నట్లనిపించిందామెకు.

లారీ కదిలింది.

★ ★ ★

## 6

సమయం రాత్రి పదకొండూ యిరవై.

ఢామ్మని పెద్దశబ్దం అవడంతో ఉలిక్కిపడి లేచింది వర్ధనమ్మగారు. లైటువేసి చుట్టూ చూసింది. వంటింట్లో ఏదో అలికిడి విన్పించి అటువైపు నడిచి, ద్వారంలోంచే కిటికీవంక చూసింది.

నల్లపిల్లి !

లైటువేసి, మూతలన్నీ సరిచూసి మంచినీళ్ళు తాగి ముందు గదిలోకి వచ్చింది.

హైమ మంచం ఖాళీగావుంది.

వాచీ చేసేశబ్దం తప్ప ఎక్కడా ఏ శబ్దమూ లేదు.

'ఏమైపోయిందీ పిల్ల ?' అనుకుంటూ కిటికీలోంచి వీధిలోకి దృష్టిసారించింది.

ప్రక్కవీదంతా నిర్మానుష్యంగా ఉంది, వీధిలో కాబోలు ఓ కుక్క ఘోరంగా అరుస్తోంది

వర్ధనమ్మగారి గుండెలు భయంతో దడదడ లాడేయి.

ఆమె మనసు పరిపరి విధాల పోవనారంభించింది. కాలేజీ ఫంక్షన్ కాబట్టి కాస్త లేటువుతుందని ముందుగానే చెప్పింది హైమ. నాగురించి నువ్వేం ఆతృత పడకు. హాయిగా భోజనం చేసి పడుకో. అని అభయాస్త మిచ్చింది. అయితే యింత రాత్రయ్యేక ఒక్కతే ధైర్యం చేసి రాదనితెల్సు







## చైతన్యదీపాలు

కానీ యింతవరకూ ఎక్కడ వుండి వుంటుందో ఆమెకు అంతుచిక్కటం లేదు.

లైటార్పి మళ్ళీ మంచం మీద మేను వాల్చిందామె

ఆమెకళ్ళు మూతలు పడ్డం లేదు మనసు చుట్టూ ఏవేవో ఆలోచనలు ముసురుకో సాగాయి.

తన జీవితంలో మిగిలివున్న ఒకేఒక్క ఆశ హైమ. హైమ తప్ప తనకెవ్వరూ లేరు.

ఆ రోజుల్లో ఎనిమిదేళ్లకే తను పెళ్ళి పీటలమీద కూర్చుంది కొత్తబట్టలూ, భాజాభజంత్రీల సంబరమేగాని పెళ్ళంటే ఏమిటో ద్దాని వెనుకనున్న పవిత్రత ఏమిటో, భర్తంటే ఎవరో అతనితోనే తన జీవితాన్నెలా పెనవేయాలో తెలియని అమాయకపు రోజులు! మనసులు వికసించకుండానే, భావాల పరిమళాలు వెదజల్లుకోకుండానే పసిమొగ్గ ప్రాయంలోనే మూర్ఖపు ఆచారాలకూ ఆశయాలకూ మూఢ నమ్మకాలకూ బలైపోయేరోజులు ! పెళ్ళయ్యాక అయిదేళ్ళు చదువులో, పనిపాటలతో యింట్లో ఏం గడిపిందో అంతే— పదమూడో యేటో కాపురానికెళ్ళింది యేడాది తిరక్కుండా సంతానం. జీవితంలో యింకా ఏ మధురానుభూతులూ ప్రోది చేసుకోకుండానే తల్లిగా మారటం, భర్తను పోగొట్టుకోడం...దేనికి సంతోషించాలో, దేనికి విచారించాలో తెలియని వయసుకే జీవితంలోని చరమాంకం ప్రారంభమైంది· స్త్రీ జీవితమెంత వున్నా భర్త ఉన్నంత వరకే ఆమెకు మంచి రోజులు మంగళకరమైన రోజులు. ఇటువంటి ఎన్నో నిజాలు రాన్రాను తెలియవచ్చాయి.

స్త్రీ జాతికి అన్యాయం జరుగుతుందనే ఆలోచన ఎక్కడో ఏ మనసు మారుమూలనో తళుక్కుమందారోజుల్లోనే. స్త్రీ తన సమస్యలకు తానే పరిష్కార మార్గాలను సూచించుకోలేని అమాయక, అసహాయ స్థితిలో ఎందుకుండిపోయిందో అర్థమయ్యేది కాదు.

సహగమనమనే అప్పటికి పూర్వమున్న దురాచారాన్ని ఏ సంఘ సంస్కర్తలో పూనుకుని రూపుమాపే వరకూ ఏ స్త్రీ అందుకు వ్యతిరేకించకపోడం ఆశ్చర్యమనిపిస్తుం దెప్పటికీ.

తండ్రి పోయేనాటికి హైమ మూడేళ్ళ పిల్ల.

మరో అయిదేళ్ళు జీవితం దుర్భరంగానే గడిచిపోయింది.

కాలక్రమేణా అయిన వాళ్ళందరూ అన్నివిధాలా దూరమయ్యారు. అటువంటి స్థితిలో ఆయన ద్వారా సంక్రమించిన ఆ కాసేంత ఆస్తే తన జీవితానికి ఆధారభూతమైంది.

పెరటితోటలో కాసిన్ని కూరగాయలూ, పొలం మీదొచ్చే గింజలూ ఎంత పొదుపుగా జీవితాన్ని వెళ్ళమార్చగలదో అంత పొదుపుగానూ ఖర్చు పెట్టింది. 'పిసినారి' అన్నారంతా. అయినా తను ఖాతరు చెయ్యలేదు. ఒంటరి స్త్రీని చూస్తే ఏదోలా అనేవారేగాని పెట్టేవారెవరు ?

తనకున్న ఆశయాలల్లో ఒక్కగానొక్క కూతుర్ని అపురూపంగా పెంచుకోవాలి. పెద్దచేసి విద్యాబుద్ధులు చెప్పించాలి. తను పొందని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలని జీవితంలో ఆమెకు కల్పించాలి. ఆమె ఇష్టాను సారమే పెళ్ళిచేయాలి.

ఆ దైవం కల్పించిన సృష్టిబాధ్యత, మాతృత్వం విషయాలలో తప్ప స్త్రీ పురుషులిద్దరూ సమానమేననే స్థితికి తెచ్చేలా ఆమెను తయారుచెయ్యాలి.

ఆ ఆశయసిద్ధి కోసం తనెన్నిటినైనా త్యాగం చెయ్యకతప్పదు. ఆ ధ్యేయంతోనే యిన్నాళ్ళూ రోజులు గడువుకుని వచ్చింది.

తన ఆశయాలకు తగ్గట్టుగానే హైమ పెరుగుతోంది. చిన్న వయస్సునుండే ఇంటి పరిస్థితులను ఆకళింపు చేసుకుంది, చదువుపై శ్రద్ధ చూపిస్తూనే వచ్చింది. ఇంతవరకూ అన్నిటా ఫస్టులే. గవర్నమెంటు స్కాలర్‌షిప్‌తోనే కాలేజీ చదువు గడిపేస్తోంది. ఈ సంవత్సరం గడిచిపోతే ఆపైన ఉద్యోగమో, చదువో, పెళ్ళో.

తన భవిష్యత్తును తాను తీర్చిదిద్దుకోలేని తెలివితక్కువదేంకాదు హైమ.

సంతృప్తిగా వర్ధనమ్మగారి కళ్ళు మూతలుపడ్డాయి.

ఆమెకు తెలియకుండానే నెమ్మదిగా నిద్రలోకి జారిపోయింది.

★ ★ ★

## 7

లారీ ఆగేసరికి ఎదురుగ్గా స్కూటర్ కూడా వచ్చి ఆగింది, ఆ స్కూటర్ వెంకటేశ్వరరావు గారిది.

లారీలోంచి దిగుతున్న ముగ్గురమ్మాయిల్ని చూసి ఆయన ఆశ్చర్యపోయారు మొదట.

'ఏమ్మా మాధురీ మీరేనా ?...ఏమిటిలా లారీలో......ఫోన్‌చేస్తే వచ్చేవాడినిగా! అన్నారాయన.

'ముందు లోపలికి పదండి డాడీ వివరంగా చెబుతానుగా' అంది మాధురి.

'నీకెలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో తెలియటం లేదు సింహాచలం. నీ మేలు మర్చిపోలేం' అంది సమీర సింహాచలంతో.

'బలేవారమ్మా ఇదో సాయమా ఏటి ?' అంటూ చేతులు నలుపుకుంటూ వెంకటేశ్వరరావు దగ్గరకొచ్చి

'వస్తామండయ్యగోరూ' అన్నాడు.

'ఎవరూ ? సింహాచలమా. మంచిదయ్యా' అన్నారాయన. ఏం జరిగిందో తెల్సుకోకుండా మాట్లాడం యిష్టంలేక.



మన శరీరానికి అప్‌కోస్-డి అవసరం
మనం మేలుకొని ఉన్నా, నిద్రావస్థలో ఉన్నా, పని చేస్తున్నా, విశ్రాంతి తీసుకొంటున్నా మన శరీరానికి నిరంతరమైన శక్తి సరఫరా అవసరం. ఈ శక్తి వల్లనే శరీరం తన సాధారణ ఉష్ణోగ్రత నిలిపి ఉంచుకోవడానికి సహాయమవుతుంది. శక్తి సరఫరా లేకుంటే మనం లేమన్నమాటే.
మన శరీరం బంగాళాదుంపలు, గోధుమలు, బియ్యం, బీట్‌రూటు వంటి ఆహార పదార్థాలలోని పిండి పదార్థాన్ని అణువణువులుగా విడగొట్టి చివరికి గ్లూకోజ్‌గా రూపొందిస్తుంది. ఈ గ్లూకోజే రక్తంలోనికి పీల్చుకోబడి శరీరానికి అవసరమైన శక్తి అందడానికి కారణమవుతుంది. ఆహారాన్ని గ్లూకోజ్ కింద మార్చే ప్రక్రియ నిదానమైనది. దీనివల్ల, అనారోగ్యము నరాలవత్తిడి, అలసట వంటి స్థితులలో శరీరానికి అవసరమైన అధిక శక్తి సరఫరా కావలసినంతగా జరగక పోవచ్చు. ఈ సమయాలలో శీఘ్ర శక్తి నిమిత్తం నోటిద్వారా శుద్ధమైన గ్లూకోజ్ రూపంలో శరీరానికి శక్తి అవసరమవుతుంది.
అప్‌కోస్-డి ఇట్టి సమయాలలో అత్యంత శ్రేష్ఠమైనది.
అప్‌కోస్-డి పిల్లలలోను, పెద్దలలోను కూడా ఖర్చైన శక్తిని తిరిగి అందించడానికి వాడదగినది.
అప్‌కోస్-డి గ్లూకోజ్‌తో బాటుగా ఎముకలకు, నరముల ధాతువుకొరకై కాల్షియం భాస్వరాలను, కాల్షియంను సరిగా ఉపయోగించుకునేందుకై విటమిన్-డిని కూడా అందిస్తుంది.
అప్‌కోస్-డి తక్షణ శక్తినిస్తుంది. దీనిని మంచి నీళ్లతోగాని, వేడి లేదా చల్లని పానీయాలతోగాని తీసుకోవచ్చు.
మీకు అదనపు శక్తి, అదీ క్షణంలో కావలసినప్పుడు అప్‌కోస్-డిని గుర్తు తెచ్చుకోండి!
అప్‌కోస్-డి అజంతా ఫార్మా వారి సగర్వ ఉత్పాదన
అప్‌కోస్-డి®
(గ్లూకోస్-డి)
అప్‌కోస్-డి అంటేనే తక్షణ శక్తి
ఉత్పాదకులు: ap
అజంతా ఫార్మా ప్రైవేట్ లిమిటెడ్
243, కళ్యాణ్‌దాస్ ఉద్యోగ్ భవన్, వర్లీ, బొంబాయి 400 025
359
Apcose-D
GLUCOSE-D
ap
ajanta pharma pvt. ltd
APCOSE-D

## చైతన్యదీపాలు

లోపలికెళ్ళాక, గబగబా బాత్రూంలోకెళ్ళి. చన్నీళ్ళతో కాస్త ముఖం కడుక్కుని హార్లిక్స్‌కలిపి నాలుగు కప్పులలో పోసి డ్రాయింగ్‌రూంలోకి తెచ్చింది మాధురి.

అప్పటికే ముగ్గురూ ఆలోచనల్లో మునిగి వున్నారు.

సమీరకు. హైమకూ చెరో కప్పు అందించి, 'తీస్కోండి డాడీ' అంటూ ట్రేని టీపాయ్ మీదుంచి తండ్రి ప్రక్కనే సోఫాలో కూర్చోంది.

ఒక్క క్షణం నిశ్శబ్దం తాండవించింది వారిమధ్య.

వెంకటేశ్వరరావుగారు మాధురివంక చూశారు.

అతని గుండె బరువెక్కింది.

కళ్ళలో ఆపుకోలేని ఉద్విగ్నత.

మాధురిని దగ్గరకు తీసుకుని తలనిమురుతూ 'ఏమైనా నే అదృష్టవంతుడిని. నా మాధురీ మళ్ళీ నా కళ్ళముందు కొచ్చింది' అన్నారు.

జరిగిన విషయమంతా సమీర వివరించినట్టు గ్రహించింది మాధురి. ఒక్క క్షణం అలానే ఉండిపోయింది.

'మేమెలాగో అదృష్టవశాత్తు బయటపడ్డాం. ఇప్పుడు మనం వాసంతి గురించి ఆలోచించాలి డాడీ అంది మాధురి.

అలాగేనమ్మా ముందు వాళ్ళింట్లో యీ విషయాన్ని తెలియపరుద్దాం. ఇంతకీ వాళ్ళ నాన్నగారు.. ...!

"వాసంతికి అమ్మోంది కాని, నాన్నలేరు డాడీ. వాళ్ళన్నా వదినల దగ్గరుండి చదువుకుంటోంది. వాళ్ళకి సంగతి ఎలా చెప్పాలో అర్థం కాకుండా వుంది"

అంతవరకూ మౌనంగా కూర్చున్న సమీర ఒక్కమారు లేచి, "సార్, నేనోసారి మీ ఫోను వాడొచ్చా" అంది.

'మాట్లాడమ్మా' అని కాస్సేపాగి,

"పోలీసులకీ విషయం తెలియజేయడం మన విధి అలాగే వాళ్ళన్నయ్యకు కూడ." అని సమీరవంక చూశారాయన ఆమె ఈయనమాట లేవీ విన్పించుకోలేదు.

రెండంగల్లో టెలిఫోన్ దగ్గరకు నడిచి, అక్కడున్న టెలిఫోన్ డైరెక్టరీని చేతిలోనికి తీసుకుని చకచకా పేజీలను తిరగేసింది.

ఒకపేజీలో చటుక్కున ఆగి, చూపుడువేలితో మొదటికాలంలో మీదినుండి వ్రేలు క్రిందికి జరుపుతూ కళ్ళను చకచకా అందరి పేర్ల మీదుగా పరుగెత్తించింది సమీర.

ఆమెవంకే ఆత్రుతగా చూస్తున్నారు ముగ్గురూ.

తను వెదుకుతూన్న నెంబరు దొరకడంతో ఆత్రుతగా డయల్ చేసింది సమీర.

"హలో. ఈజిట్ డిస్ట్రిక్ట్ కలెక్టర్స్ రెసిడెన్స్?"

"......... ... .."

ఈమారు ముగ్గురూ ఆశ్చర్యంగా చూశారు.

"నేనొకసారి వారితో పర్సనల్‌గ మాట్లాడాలి అర్జంట్. కాస్త అందిస్తారా"

"................"

"నాపేరు సమీర. యీవెనింగ్ వారొచ్చిన కాలేజీకి స్టూడెంట్స్ యూనియన్ సెక్రటరీని. అర్జంటుగా వారితో మాట్లాడాలి. ప్లీజ్"

అవతల వ్యక్తి రిసీవర్ ప్రక్కనపెట్టి వెళ్ళడంతో కాస్త సంతృప్తిగా నిట్టూర్చింది సమీర.

"ఎవరమ్మా. నువ్వు ఫోన్‌చేసేది పోలీస్‌స్టేషన్‌కి కాదూ" ఆశ్చర్యంగా అడిగేరు వెంకటేశ్వరరావుగారు.

'చెబుతాగా' అన్నట్లు కళ్లతోనూ, చేతులతోనూ సంజ్ఞ చేసింది సమీర.

మాధురి, హైమ ఆశ్చర్యంగా ఆమెవంకే చూస్తున్నారు. అవతలి వ్యక్తి పలికినట్లే అటెన్షన్‌లోకి వచ్చినట్లు కూర్చుంది సమీర.

''ఎక్స్‌క్యూజ్ మీ మేడమ్. నేను సమీరని. కాలేజీఫంక్షన్ అయ్యాక మేం ఇంటికొస్తూంటే ఓ జరక్కూడని సంఘటన జరిగిపోయింది. దానికి మీ సహాయం అర్జంటుగా కావాలి'' అంటూ అతిక్లుప్తంగా అసలు విషయాన్ని చెప్పింది.

అంతటి ఆతృతలోనూ, ఆమె మాటల తీరూ, ఆమె అభ్యర్థనా, తెలివి చాకచక్యం చూసి ముగ్గురూ ఆశ్చర్యపోయారు

సమీర యింకా ఏదో మాట్లాడింది

పోలీస్ స్టేషన్‌కే సరాసరి ఎందుకు తెలియచేయలేదో, చెబుతూ సాటి స్త్రీగా ఆమె సహాయాన్ని అర్థించింది.

పదినిముషాలు మాట్లాడేక, ఫోన్ దించేసి వచ్చి తలపట్టుకుని కూర్చుంది.

'ఏమన్నారమ్మా' అడిగారు వెంకటేశ్వరరావుగారు.

'కొంచెం సేపట్లో తెలుస్తుంది' అంటూ వాచీవంక చూసుకుని సోఫాలో వెనక్కి వాలింది.

సరిగ్గా ఐదు నిముషాలు గడిచాయి.

ఫోను రింగయింది.

ఒక్క అంగలో పరుగెత్తుకెళ్ళి రిసీవర్ని చేతిలోకి తీసుకుంది.

'హలో...అవును... నేనే సమీరనే మాట్లాడుతున్నా'

'... . . ... ...'

''అవును, మేమిక్కడే వుంటాం. గురజాడ కాలనీ మూడో నెంబర్ లేన్‌లో ఆకుపచ్చమేడ......డాక్టర్ వెంకటేశ్వరరావు గారిల్లు''

''... ... ... ... ...''

ఫోను పెట్టేసి వచ్చి కూర్చుంది సమీర.

డాక్టర్ వెంకటేశ్వరరావు సర్జరీలో అందెవేసిన చెయ్యి. మట్టిబొమ్మలకు దుస్తులేసినంత అవలీలగా మనుషుల అవయవాలు కోసి అతికించి అమర్చగల నైపుణ్యముందాయనలో.

కానీ యిప్పుడెదురైన యీ పరిస్థితి ఆయనకు అయోమయంగా తోచింది. ఆపరేషన్ థియేటర్లో బల్లమీదున్న రోగి తాలూకు వ్యక్తులు బయట చలి రాత్రిపడే ఆవేదన, ఆత్రతఅతని గుండెల్లో ఒక్కసారి జొరబడినట్లయింది.

''సారీ సార్. మీ సలహా తీసుకోకుండానే మొదటి స్టెప్‌వేశాను. ఫలితం బాగుంటుందనే నమ్మకం కలుగుతోంది. మామూలుగా మనంతట మనం పోలీస్ రిపోర్టుఇవ్వడం కన్నా కలెక్టరుగారికి చెప్పి, వారిద్వారా యాక్షన్ తీసుకుని దర్యాప్తు జరిపిస్తే బావుంటుందనిపించింది.అదృష్టవశాత్తూ కలెక్టరుగారి పరిచయం ఈ రోజే జరిగింది. ఉన్నది కొద్దిపాటి పరిచయమే అయినా ఆమె నన్ను బాగా లైక్ చేసింది. ఆ పరిచయాన్ని మరోలా ఉపయోగించుకోడం తప్పయినా, తప్పలేదు. అందుకే అలా చేశాను. ఆమె పోలీస్ సూపర్నెంట్‌తో మాట్లాడిపంపిస్తామన్నారు. కాస్సేపట్లో పోలీస్ ఇక్కడకు వచ్చి కేసు దర్యాప్తుకు కావల్సిన వివరాలు తెల్సుకుంటారు. అందాకా మేమిక్కడ ఉండాలి'' అంది సమీర.

''బావుందమ్మా. నువ్వు తీసుకున్న నిర్ణయంలో ముందుచూపుంది. చూద్దాం, ఏమవుతుందో'' అన్నారు వెంకటేశ్వరరావుగారు

మౌనంగా కూర్చున్న సమీర మనసులో ఎన్నో ఆలోచనలు మొదలయ్యాయి.

★ ★ ★

## 8

''ఏమంటే అనండిగానీ నాకీ పిల్లవ్యవహారమేం నచ్చటంలేదు'' అంది రాజ్యం.

శ్రీనివాసులేం మాట్లాడలేదు.

అసలే మనసంతా ఆందోళనగా వుంది. ఆక్షణాన ఏమన్నా అది ఎదుటి మనిషి గుండెలోకి గురిపెట్టిన బాణమే అవుతుంది.

మొదట్లో లేదుగానీ యిప్పుడిప్పుడే వాసంతిపట్ల రాజ్యం ప్రవర్తన మారుతూండడం శ్రీనివాసులు గమనించాడు.

తండ్రి పోయేనాటికి వాసంతికి పన్నెండేళ్ళు. పరికిణి జాకెట్టూ వేసుకునేది. తనింటికొచ్చాకనే పెద్దదైంది.

పల్లెటూళ్ళో వున్న పాతకొంపను కనిపెట్టుకుని తల్లి అక్కడే ఉండిపోయినప్పుడూ, పదో తరగతి పాసైన చెల్లెలు అక్కడ ఎందుకూ పనికిరాకుండా ఉండిపోడం యిష్టంలేక తమదగ్గరకు తీసుకొచ్చి కాలేజీలో చేర్పించాడు. రాజ్యంకూడ వాసంతిని ఒక చెల్లెలులాగే చూసేది గాని మరోలా ఉండేదికాదు. రాన్రాను పిల్లలుపుట్టి, వారితో విసుగుకలిగినప్పుడు మాత్రం వాసంతికేవో పన్లు పురమాయించేది.

వాసంతి చదువు ఖర్చంతా తల్లే పంపేది. అయినాసరే రాజ్యంకి వాసంతిని డిగ్రీ చదివిరిచ్చడం సుతరామూ యిష్టంలేదు. చదువు ఎక్కువౌతున్న కొద్దీ పెళ్ళిసంబంధాలు దొరకడం కష్టమైపోతుందని ఆమె వాదన. ఏమైనా చదువుకుంటాననే వాళ్ళని మాన్పించడమెలా ?

ఈ ఏడాదిగడిస్తే డిగ్రీ వస్తుంది. దాని కాళ్ళమీద అది నిలిచేందుకు కనీసార్హత వుంటుంది. అనుకున్నాడతను. ఏమైనా యింట్లో బేదాభిప్రాయాలు రావడం తనకిష్టంలేదు. చదువయ్యాక వాసంతిని అమ్మదగ్గరికే పంపెయ్యాలి అని నిశ్చయించుకున్నాడు శ్రీనివాసులు. ఆవులిస్తూ వాచీవంక చూశాడు పదకొండూ నలభై.

★ ★ ★

## 9

ఇంటిముందు జీప్ ఆగిన శబ్దమైతే చటుక్కున లేచి బాల్కానీలోకి వెళ్ళి క్రిందికి చూసింది సమీర.

పోలీస్ జీపే. జీపులోంచి దిగిన యిద్దరు పోలీసాఫీసర్లూ కొద్దిక్షణాల్లో మేడమీదికి వచ్చారు.

వాళ్ళు కూర్చున్నాక, తను చెప్పదల్చుకున్నదంతా జరిగింది జరిగినట్లు, మనసులో ముందుగా రిహార్సల్ చేసుకున్న విధంగా వివరంగానే చెప్పింది.

సమీర చెప్పిన విషయాలన్నీ శ్రద్ధగా విని, నోట్ చేసుకోవలసిన పాయింట్స్ నోట్ చేసుకున్నారు యిన్స్‌పెక్టర్

ఒక్క క్షణం నిశ్శబ్దం తర్వాత అడిగాడు.

''కాలేజీ ఫంక్షన్ అయ్యేప్పటికి టైమెంతైందన్నారు ?

సరిగ్గా పది. నేను బయటకొస్తూ వాచీ చూసుకున్నాను!''



## చైతన్యదీపాలు

'మీరెక్కిన ఆటో స్టాండులోనే వుందా'

'ఆటో స్టాండు మా కాలేజీ మెయిన్ గేట్‌కి కాస్త దూరంలో వుంది సార్. మాకు స్టాండ్‌లో ఆటోలు కన్పించలేదు. అయినా మేం గేటు దగ్గరకొచ్చేసరికి రెండు ఖాళీ ఆటోలు ఎదురొచ్చాయి ముందు వచ్చిన ఆటోనే మేం ఎక్కాం.''

'వాసంతి ఎలా వుంటుందో చెప్పగలరా ?

'రంగు కాస్త తక్కువే అయినా ముఖంలో లక్ష్మీకళ తాండ విస్తూంటుందంటారంతా. కాటుక కళ్ళు మనిషి రివటలా సన్నగా వుంటుంది.

''సుమారుగా హైట్ ఎంతుంటుందో ?''

''ఫైవ్ సిక్సండీ'' అంది సమీర చటుక్కున.

'అంత ఖచ్చితంగా ఎలా చెప్పగలవూ'

'అది అంతే. నేనూ అదీ ఒకే హైటు ఇకపోతే ..... సాధారణంగా వాసంతి వాయిల్ చీరకడుతుంది. కానీ ఈ రోజు పింక్ కలర్ కాశ్మీర్ చీర కట్టుకుంది ఫంక్షన్ కదా'

'వాసంతి ఫోటో ఏమైనా సంపాదించగలరా ?'

'వుంది ఇన్స్‌పెక్టర్' అంటూ లోపలికెళ్ళింది మాధురి

పరీక్షలకు ఫోటోలు కావాలంటే మేం ముగ్గురం కల్సి తీయించుకున్నాం. కార్డుసైజు. ఆ తర్వాత విడివిడి పాస్‌పోర్టులను ప్రింట్ చేయించాం, ఆ నెగిటివ్‌లోంచి. ఆ కాపీ మాధురి దగ్గరుంది' అంది సమీర.

మాధురి తెచ్చిన ఫోటోలోని ముగ్గురునీ ఒకమారుచూసి తర్వాత సమీరనూ మాధురినీ చూసి,

''ఇందులోని వాసంతి ఫొటో నేను కట్‌చేసి తీసుకోవచ్చా. అది మా పరిశోధనకు ఉపయోగపడవచ్చు'' అన్నాడు ఇన్స్‌పెక్టర్.

'ఫోటోలో వాసంతిని మానుండి వేరుచేసినా, మానుండి వేరైపోయిన వాసంతిని మళ్ళీ మీరు మాతో కలుపుతారనే ఆశ వుంది ఇన్స్‌పెక్టర్. తీస్కోండి' అంది సమీర.

'తప్పకుండా వాసంతి మీలోకొస్తుంది. మా ప్రయత్నాలకు దయచేసి సహకరించండి' అని ఒక క్షణమాగి—

అన్నట్టు మీలో ఎవరైనా ఆ ఆటో డ్రైవర్ని గుర్తుపట్టగలరా అన్నాడు.

ముఖాలు చూసుకున్నారు ముగ్గురూ.

'ఆ సమయంలో అంత స్పష్టంగా చూడ్డానికి వీల్లేకపోయింది. సార్ అయినప్పటికీ ప్రయత్నిస్తే...' ఆమె మాట పూర్తికాలేదు,

'పోనీ ఆ ఆటో నెంబరేవరికైనా గుర్తుందా?'

చటుక్కున స్ఫురణకొచ్చింది సమీరకు. ఆమెకళ్ళు ఆనందంతో చేపపిల్లల్లా మెరిశాయి.

'గుర్తుందిసార్. నెంబరు ముందున్న అక్షరాలు ఏమోగాని ఆ నెంబరు మాత్రం 22462 అంటే టూ టూ ఫోర్ సిక్స్ టూ.

'మీ ముందునే ఎంతోసేపు కూర్చున్న డ్రైవర్ని గుర్తుంచుకోలేని మీరు యింత కరెక్టుగా నెంబర్నెలా చెప్పగలుగుతున్నారో చెబుతారా.

'చెప్తానుసార్. మేం కాలేజీనుంచి బయటకొచ్చేసరికి పదిదాటి కొన్నినిముషాలైంది. లాస్ట్ ట్రిప్‌బస్‌కూడ అప్పటికికి వెళ్ళిపోయి వుంటుందని నిర్ధారించుకున్నాక మేం నలుగురం ఆటోలోనే వెళ్ళాలనుకున్నాం. ఆదే వుద్దేశంలో కాస్త దూరంలోవున్న ఆటోస్టాండ్‌వైపు చూస్తే స్టాండులో ఆటోలేవీ కన్పించలేదు. కానీ అప్పటికే మాదగ్గరకు రెండు

ఆటోలు వచ్చాయి. అనుకోకుండా మొదటి ఆటో నెంబరు నా కాళ్ళ బడింది, అదే నేనిప్పుడు చెప్పిన నెంబరు. ఆ నెంబరు నన్నెక్కువ ఆకర్షించడంతో ఆ బండినే పిలిచి బేరమాడేము. వున్న నలుగుర్లోనూ మాయిల్లే అందరి యిళ్ళకంటె దూరం.

అంచేత మా కాలనీకే వెళ్ళాలన్నాను. మీటర్ మీదయితే అయిదు రూపాయలకన్నా ఎక్కువ అవదు. కానీ పగలే మీటర్‌మీద రూపాయో రెండో యిస్తేగాని రారు మన ఆటోవాళ్ళు. ఆ సంగతి మీకూతెల్సు. కొన్నిచోట్ల పోలీసులుండి పేరడిగి నోట్‌చేసుకుని మీటర్ ప్రకారమే డబ్బులిమ్మని పంపిస్తాడు. మిగతాచోట్లలో ఆటోవాళ్ళ ఆశకు అంతుండదు. ఏమైనా అది రాత్రి. పైగా బస్సుకూడ వుండదిట్టేము. అంచేతే ఎంతకైనా సిద్ధపడే వున్నాం.

కానీ మీటర్‌మీద ఎంతోకొంత యిమ్మని వాడనేసర్కి ఆశ్చర్య పోయాం. దేశంలో న్యాయం లేకపోలేదనిపించింది. కాకపోయినా కొన్ని వేళల్లో ఆటోలు సగంధరకో లేక మనిషికో రూపాయిచొప్పన యిస్తేనో వస్తుంటారు. అది వాళ్ళు యింటికిపోయే టైం.

ఏమైతేనేం సరేనని ఎక్కేశాం.

'మీకు తెల్సోలేదో నలుగురు వెళ్ళకూడదు ఒక ఆటోలో'.

'తెల్సు. కానీ ఆ సమయం అలాంటిది. పైగా అందరం ఆడ పిల్లలం.'

'పోనీండి. ఇంతకీ ఆ ఆటోనెంబరంతన్నారు'

నోట్‌చేసుకున్నా మళ్ళీ కన్‌ఫర్మ్ చేసుకుందకి అతను అడుగు తున్నాడని గ్రహించింది సమీర.

"మళ్ళీ అదేనెంబరు చెప్పి, మీ ప్రశ్నకింకా సమాధానం చెప్ప లేదుగదూ. ఆనెంబరు నన్నాకర్షించడానికీ, నేనది అంతబాగా గుర్తు పెట్టుకోడానికీ కారణం అది నా పుట్టినరోజు తేదీ కావడం."

'అంటే స్పష్టంగా చెప్పండి'

'1962 ఏప్రిల్ 22వ తేదీన నేను పుట్టినట్లు రికార్డులో వుంది. అంకెల్లో చూస్తే 22-4-62 కదా?'

ఆమె తెలివితేటలకు అబ్బురపడ్డారంతా.

'ఓకే దెన్' ఆ మాత్రం వివరాలు ఖచ్చితంగాయియ్యగలిగితేచాలు. మీరు రేపొకసారి మా స్టేషన్‌కి రండి.' అని లేచి, వాసంతి యింటి అడ్రసును కూడ తెల్సుకుని నోట్‌చేసుకున్నాడు ఇన్స్‌పెక్టర్.

'థాంక్స్‌సార్. మీరు వెంటనే వెదికించే ప్రయత్నం చేయకపోతే వాసంతి చెయ్యి దాటిపోతుందేమోనన్న భయంగా వుంది' అంది సమీర.

'నోనో.. చూస్తారుగా. ఇది మాజిస్ట్రేట్ కేసండి. పైగా కలె క్టరుగారు స్వయంగా చెప్పినకేసు మా స్వంత కేసులాంటింది. అందుకే చెప్పానుగా మిమ్మల్ని రేపు ఉదయం రమ్మని ఈ రాత్రే దొరికిపోతే మీకు ఫోన్ చేస్తాం. సరా.'

ఊపిరి పీల్చుకుంది సమీర.

ఇన్స్‌పెక్టర్ వెళ్ళాక, నీ ధైర్యాన్ని, సమయస్ఫూర్తినీ తెలివితేటల్ని అభినందించకుండా వుండ లేనమ్మా" అని సమీరను మెచ్చుకున్నారు వెంకటేశ్వరరావుగారు.

ఆయనే స్వయంగా హైమను సమీరను వారివారి యిళ్ళవద్ద దింపి వచ్చారు.

అప్పటికి రాత్రి సరిగ్గా పన్నెండు.

★ ★ ★

## 10

ఉదయం ఆరుగంటలు.

కాలింగ్ బజర్ అదేపనిగా మోగుతూంటె బెడ్‌మించి బద్ధకంగా లేచి తలుపు తీసింది మాధురి.



# చైతన్యదీపాలు

ఎదురుగా సమీర !

'అదంటే...' అని ఏదో అనబోయిసమీర సీరియస్‌గా వుండటం చూసి గతరాత్రి జరిగిన ఉదంతాన్ని గుర్తు తెచ్చుకుని చటుక్కున ఆగి పోయింది.

'మీ డాడీ లేచారా ?'

'ఆఁ అదిగో పూజగదిలో.'

'నేను మీ ఫోను వాడుతాను. ఈలోగా నువ్వు అర్జంటుగా తయారుకా! అంటూ చకాచకా హాల్లోకి ప్రవేశించి సోఫాలో కూర్చొని రిసీవర్‌ని అందుకొని. డయల్‌చేసింది.

అవతలినుంచి ఎంగేజ్ టోన్ విన్పించింది.

ఫోన్‌ని క్రేడిల్‌మీద పడేసి మాధురి యింకా తన వెనుకే ఉండటం చూసి—

'నువ్విప్పుడేనా లేవడం' అడిగింది.

ఆవులిస్తూ అవునన్నట్లు తలూపింది మాధురి. తర్వాత ఆమెలోని సీరియస్‌నెస్‌ని చూసి 'ఇప్పుడే వస్తా' అని తప్పించుకొని వెళ్ళి పోయింది.

రెండు నిముషాలాగి మళ్ళీ ఫోన్ డయల్ చేసింది సమీర.

మళ్ళీ ఎంగేజ్ టోనే.

కాస్సేపు ఆలోచనలో పడింది. ఈలోగా కాఫీ కప్పుతో వచ్చింది మాధురి. 'ఒకనూరయ్యింది' అంటూనే కప్పును చేతిలోకి తీసుకుని సిప్ చేసింది.

'రాత్రి టెలిఫోన్ రాలేదు కదూ'

రాలేదన్నట్లు తలూపింది మాధురి.

'అంత త్వరగా తేలిపోతుందని నేనూ అనుకోలేదు' అంది సమీర. ఆ వెంటనే మరో ఆలోచన వచ్చి డైరక్టరీ తీసి వెదికింది. ఎంత ప్రయత్నించినా ఆమెకు కాలేజీ ప్రిన్సిపాల్‌గారి రెసిడెన్సు ఫోను దొరకలేదు.

రెండు గుక్కల్లో కాఫీ కప్పు ఖాళీచేసి మళ్ళీ ఫోన్‌తీసి డయల్ చేసింది.

ఈ మారు రింగొచ్చింది. ఆ వెంటనే హలో అనే కంఠమూ విన్పించింది. మాట్లాడుతున్నది ఇన్స్‌పెక్టరేనని తెల్సుకుని, నేను సమీరనండి. రాత్రిమీరు టేకప్‌చేసిన కేస్ విషయంలో వివరాలేమైనా అందాయా' అనడిగింది.

''ఆ విషయమై యిందాకనే కొంత కన్‌ఫర్మ్‌డ్ న్యూస్ వచ్చిందండి. పది నిముషాల్రకితం మీరిచ్చిన ఫోన్ నంబర్‌కి రింగ్ చేస్తే ఎంగేజ్‌లో వుంది. ఈలోగా కలెక్టర్‌గారి రెసిడెన్స్ నుండి ఫోనొస్తే వివరాలు చెప్పేం—''

అయితే తను రెండుమార్లు చేసినప్పుడూ ఎంగేజ్‌లో ఎందుకుందో అర్థమయింది సమీరకు.

ఇంతకీ విషయమేమిటో చెప్పారు కాదు వాసంతి దొరికిందా''

'సారీ మేడమ్—మీరిచ్చిన ఆటో నెంబరు తప్పు. ఎక్కడో పొరపాటు జరిగింది—''

'ఏం? ఎందుకని—నేను చెప్పిననంబర్ కరెక్టే. మీరెందుకలా అనుకోవలసి వచ్చిందో నాకర్థం కావటంలేదు—ఇప్పుడు కూడా చెబుతున్నాను. ఆ ఆటో నెంబరు మాత్రం టూ టూ ఫోర్ సిక్స్ టూ యే— ఇంతకీ ఆ నంబరుతో ఈ వూళ్ళో యే ఆటోకూడా లేదంటారా''

''వుంది...!''

'మ రి ?'

'అది స్థానిక ఎమ్మెల్యే లక్ష్మయ్యగారి అల్లుడు భీమరావ్ హయాములో వుంది. అది కాదని మా నమ్మకం. పైగా అది నిన్న సాయంత్రం

# ఆటలో గెల్చారు దాహంతో వచ్చారు.



## ఇదిగో, ఇక్కడ తయారు క్రొత్త రెక్స్ ట్రింకా వారిపై రుచిదే గెలుపు!

మళ్లీ వీరే గెల్చారు!
గుంపులు గుంపులుగా వచ్చారు.
గోల-గోలగా ఇంట్లోకి దూరారు.
సంతోషంతో కేకలు వేశారు. చల్లటి
పానీయం కావాలని అడిగారు. లేత-లేత
ముఖాలు ఎండలో ఆడి-ఆడి కందిపోయాయి.

మరి నేను కూడా వారిని గెలవడానికి సిద్ధంగా
వున్నాగా! క్రొత్త రెక్స్ ట్రింకాతో. ఎందుకంటే
నాకు తెలుసు దాని మధుర రుచి అందరికి ఇట్టే
నచ్చుతుందని.

అంతేకాదు, రెక్స్ (నా విశ్వాసాన్ని చూరగొన్న
వారు) ఇప్పుడు నాకు కావలసింది ఎంచుకొనే
అనుకూలం కూడా అందించారు.

పౌడర్ ప్యాకెట్—6 పెద్ద గ్లాసుల
పానీయం తయారు చేసుకోడానికై.
క్రొత్త లిక్విడ్ కాంసెంట్రేట్—నిల్వ
చేసుకోడానికి వీలుగా 3 సీసాల సిరప్
తయారు చేయగల్గింది ఇదొక్కటే. 50 పెద్ద
గ్లాసుల పానీయం తయారు చేయడానికై. వీటి
సహాయంతో ఇట్టే చిటికెలో ఒక ట్రే నిండుగా
రుచికరమైన, ఉత్తేజకరమైన, సేదతీర్చే
చల్లటి పానీయం తయారు చేశా. త్రాగినంతనే
పిల్లలు సంతోషం పట్టలేక గెంతులు వేశారు.
'ఇంకా-ఇంకా కావాల'ంటూ కేకలు వేశారు.
ట్రింకా ఇచ్చి నేను సులభంగా గెల్చిపోయా!



లిక్విడ్ కాంసెంట్రేట్—
50 గ్లాసుల
పానీయం తయారు
చేస్తుంది.

పౌడర్ ప్యాక్
విటమిన్ 'సి'తో
సమృద్ధం చేయబడినది.
6 గ్లాసుల
పానీయం తయారు
చేస్తుంది.




**REX ట్రింకా**

**రుచిలో అన్నిటికన్నా మిన్న!**

నించీ అవుటాఫ్ ఆర్డరై షెడ్‌లోనే వుందని తెల్సింది. కలెక్టర్‌గారికి కూడా ఈ సంగతే తెలియజేయడం జరిగింది''.

'అయితే మట్టుకు? ఆమె ఏమన్నారు?'

మరోమారు ఎంక్వైరీ చేయందే ఏ నిర్ణయానికి రావద్దన్నారు.

"మరి మీ ప్రయత్నమేమిటో తెల్సుకోవచ్చా'' కాస్త కటువుగా వుందా ప్రశ్న.

"వూళ్ళో ఎన్ని ఆటోలున్నదీ, వాటి ఓనర్లూ, డ్రైవర్లుఎవరైనదీ వివరాలు సేకరిస్తున్నాం. ఈలోగా ప్రక్కవూళ్ళ పోలీస్ స్టేషన్లకు కూడ ఈసమాచారమందించాం. ఇంకా ఎన్నో విషయాల్లో శ్రద్ధ తీసుకొని మా ప్రయత్నాలు మేం చేస్తున్నాం. ఖైదీ బై రాత్రి మీరె క్కింది ఆదే ఆటో అని నిర్ధారించడానికి యింకా ఏమైనా వివరాలివ్వగలరా?''

కాస్సేపాలోచించింది సమీర, రాత్రి తను ఆటోను కేకేసి బేరమాడ్డం దగ్గర్నించీ ఆటో తమను నడిదార్లో వదిలేసి వెళ్ళిపోడం వరకూ జరిగిన ప్రతి సంఘటననూ పెద్ద ఫ్రేంతో ఎన్‌లార్జి చేసి చూసింది ఎంత ఆలోచించినా ఒక్క నెంబరు తప్ప 'అదే ఇది' అని చెప్పటానికి మరో నిదర్శనం దొరకలేదు.

ఈలోగా అవతలి ఫోన్ కట్టయినట్టు అనిపించింది.

సరిగ్గా అదే సమయంలో సమీర చేతిలోని కీచైన్ జారి క్రింద పడింది. దాన్ని వొంగి తీసుకుంటూంటే అమాంతంగా ఆమెకేదో గుర్తొచ్చింది.

అంతే! ఆమెకళ్ళు ఆనందంతో మెరిశాయి.

గుండెలు సంతోషంతోనూ, ఉద్వేగంతోనూ ఎగిరిపడ్డాయి. ఇంకెక్కడికి పోగలడు? అని తనలో ఒక్క మారనుకొని. ఫోన్‌తీసి మళ్ళీ పోలీస్ స్టేషన్‌కే డయల్ చేసింది.

ఎంత త్వరగా విషయం చెప్పగలిగితే, ఎంత త్వరగా నిజం నిరూపిస్తే అంతత్వరగా ఒక అమాయకపు ఆడపిల్లని రక్షించగలుగుతుంది. అంతవరకూ సాక్ష్యాలకోసం నిజం మరుగున పడిపోతూనే వుంటుంది.

అవతలినుండి ఎంగేజ్ టోన్ వినపడ్డంతో అసంతృప్తిగా చిందు వేసింది సమీర.

ఈ లోగా నుదుట విభూది కుంకుమతో అప్పుడే పూజ ముగించుకుని హాల్లోకొచ్చారు వెంకటేశ్వరరావుగారు.

'ఏమ్మా ఏమైనా తెలిసిందటమ్మా ? అయినా పోలీసుల కప్పగించిన కేసూ, కోర్టుకెక్కిన తగువూ ఒకంతట పరిష్కారమై తేయికనేం ?''

"మామూలుగా అయితే అంతే అయ్యేది. కానీ యీ కేసులో కలెక్టరుగారు జోక్యం కలిగించుకోడం వల్ల ఇన్వెస్టిగేషన్ కాస్త క్విక్‌గా జరగటానికి అవకాశముంది. నేను చెప్పిన నెంబరున్న ఆటో ఎవరిదో తెల్సుకున్నారట. కానీ అది ఎమ్మెల్యేగారి అల్లుడిది కావడంవల్ల కాస్త జంకినట్లు కన్పిస్తోంది. మళ్ళీ కొన్ని వివరాలు కావల్సివచ్చాయి.''

"అదేనమ్మా నేను చెప్పేదీనూ. నిజం నిరూపణకు అన్ని సాక్ష్యాధారాలూ మన దగ్గరున్నా అవతలివ్యక్తి డబ్బు, పలుకుబడీ ఉపయోగించుకుంటే అంతేమరి!''

ఏమైనా వాసంతి వచ్చేవరకూ నేనీ కేసునింక త్వరగా వదిలిపెట్టదల్చుకోలేదుసార్. మన కళ్ళముందు జరుగుతూన్న అన్యాయాన్ని మనమే గుర్తించి నేరస్తుల్ని పట్టించలేనపుడు రేపెక్కడో ఏదో జరిగితే ఏం చేయగలం? అయినా యివాళ వాసంతికి జరిగిన అన్యాయమే రేపు నాకు జరగొచ్చు. కాలేజీలో మరొక ఆడపిల్లకి జరగొచ్చు, ఈ ఆగడాలకు అంతెక్కడ? రక్షకభటులని పేరున్న ప్రభుత్వ యంత్రాంగమే ఆటువంటి చిన్న విషయాలలో నేరస్తుల్ని పట్టుకోలేనపుడు యిక ఆశెక్కడుందేం కనిపిస్తుంది.''

''ఏమోనమ్మా–ఆ దేవుడి దయవల్ల వాసంతి రక్షింపబడితే అంతేచాలు. కాని నాకా నమ్మకం ఏ కోశానా కలగటంలేదమ్మా. ఒకవేళ ఆమె మనకు కన్పించినా ప్రాణాలతో వుంటుందని నమ్మకంలేదు. ప్రాణాలతో మనముందు నిలిచినా ఆమె పూర్వపు వాసంతి కానేరదు. ధనం, స్త్రీ వ్యామోహంవల్ల నిత్యం ఎన్ని ఘోరకృత్యాలు జరుగుతున్నాయో మనం పేపర్లో చూస్తూనే వున్నాం''

'ఏమోనండీ వాసంతి మళ్ళీ మనలోకి ఏ కళంకమూ లేకుండానే వస్తుందని గట్టి నమ్మకముంది. నేరస్తుణ్ణి పట్టుకోడానికి కూడ నాదగ్గర బలమైన ఆధారాలే వున్నాయి' అని ఒక్కక్షణం ఆగి 'నాదో రిక్వెస్టు. యీరెండుమూడు రోజులూ మీకారూ టెలిఫోనూ కావాలి. వాడుకోవచ్చా'' అంది.

'దానికేమమ్మా–తప్పకుండావాడు. ఒక మంచిపనికి నేనెప్పుడూ సాయపడగలను' అన్నారాయన.

ఈలోగా మాధురి తయారై అక్కడికొచ్చింది. రోజ్ కలర్ శారీ, అదేరంగు జాకెట్టూ.. అసలే అందగత్తెమో మరింత అందంగా ముత్యంలా మెరిసిపోతోంది.

''లెట్స్‌గో మాధురీ. వస్తామండీ'' అంటూ లేచింది సమీర జాగ్రత్తమ్మా మీరెక్కడ వున్నదీ నాకు ఫోన్ చేస్తూండండి' అన్నారాయన.

'అలాగే' అన్నట్టు తలూపి అడుగు ముందుకేసింది సమీర.

*   *   *

## 11

''నేను నమ్మను. అదంతా ఆవిడగారు ముందుగానే సిద్ధంచేసుకుని వేసిన నాటకం''

రాజ్యంమాటలకు అంతా ఆశ్చర్యపోయారు.

వాసంతి అన్న శ్రీనివాసుల ముఖంలో కాస్తంత ఆందోళన, భయం ద్యోతకమైనా భార్యముందు ఏమీ మాట్లాడలేని వాజమ్మలా కన్పించాడు సమీర దృష్టికి.

'మాకు తెల్సినంతవరకూ వాసంతికి ఏ విధమైన చెడుస్నేహాలూ లేవండీ– పైగా మగపిల్లలతో ఎప్పుడూ మాట్లాడదు– అటువంటిది ' మాధురి మాటలు పూర్తికాకముందే అందుకుంది రాజ్యం.

''ఆడది నిజంగా తనకిష్టంలేనపుడు తనకున్న బలంతో వ్యతిరేకిస్తే యే అనర్ధమూ జరగదు– కొందరిలో ముందు కొంత భయముంటుంది. అది సహజం–కానీ సమయానికి ప్రతిఘటించకపోవచ్చు, అదేజరిగితే యిన్నిమానభంగాలు జరిగేవేకావు. ఏ మానభంగంకేసులోనూ ఆడది తన శీలాన్ని కోల్పోడమేతప్ప అందుకు కారకుడైన పురుషునికి ఏ విధమైన హానీ జరిగినట్టు వినలేదు పిల్లిసైతం ఎదురుతిరిగితే మనిషికి ఎక్కువ హానే కలుగచెయ్యగలదు. అటువంటిది ఆడది తల్చుకుంటే ఎదురుతిరిగి బయటపడలేదా ? ఎవరేమనుకున్నా నేనుమాత్రం మనస్ఫూర్తిగా దీన్ని నమ్మటంలేదు'' అని లోపలికెళ్ళిపోయిందావిడ.

కాస్సేపుండి తిరిగి వచ్చేశారు సమీర, మాధురి. ఆ సంఘటనతో సమీర ఆలోచనలు పరిపరివిధాల పోవ నారంభించాయి. ఇటువంటి అన్న, వదినలు కూడ వుంటారా లోకంలో అన్పించింది. అటువంటి వారి దగ్గర వుండి చదువుకొంటున్న వాసంతిపై ఎనలేని జాలికలిగింది.

## 12

''చెప్పండి'' అన్నాడు ఇన్స్‌పెక్టర్ తన రివాల్వింగ్ చైర్లో సర్దుకుని కూర్చుంటూ–

''ఈ కేసుకు సంబంధించిన వివరాలుమరికొన్ని యిమ్మన్నారుగా' 'ఇవ్వగలరా' అంటూ ఆసక్తిగా టేబిల్‌పైకి వంగేడు.

### జయోస్తు!

శిశిరజాల్ముడు తరులతాశ్రేణి పాణి
జెనకి వసనాపహరణంబు చేయజూచి
అక్షయములైన నవపల్లవాంబరములు
మాధవుడొసంగె కారుణీమహితుడౌచు

2

ఎచట కారాకుడుల్లెనో అచట పొడమె
లేచివురుటాకు వృక్షవల్లికలయందు
నెచట తలిరాకు మొలిచెనో అచట నిలిచె
రంగురంగుల విరులు పొరంగు మీరి.

3

ఎన్ని పూవులు పూచిన నేమి కాని
సాంధ్యవేళల సౌరభావంధ్యమౌచు
మందమలయా నిలంబుల మత్తుకొలిపె
మల్లెయొక్కటియే జగన్మాన్యమయ్యె.

4

కొమ్మకొక చిల్కగా భూరుహమ్మునకొక
శారికగ పుష్పమున కొక్క షట్పదముగ
తోటకొక కోకిలమ్మగా తోచి,దెసల
సారె కలగానరవములు మారుమ్రోగె.

5

సకల శుభలక్షణాన్విత చారుమూర్తి
శ్రీ వసంతునితో చేయిచేయి కలిపి
తరలి వచ్చిన నూత్నవత్సరమ! నీకు
స్వాగతము ! క్రోధనాభిధ ! జయము ! జయము !

**- శనగన నరసింహ స్వామి**

'అనుకోకుండా చేసినవీ, హడావుడిలో మీకుచెప్పడం మర్చిపోయినవీ మూడున్నాయి. అవి మీకు నేరస్తుడిని పట్టుకోడంలో ఎక్కువ ఉపయోగపడతాయనే నా నమ్మకం''

''చెప్పండి''

''నేనిచ్చిన ఆటోనెంబరు పొరపాటని మీ అనుమానం. కానీ అదే నిజమైనదని చెప్పడానికి మరో ఆధారం కూడ దొరికింది.అది...నేను ఆ ఆటోమీద వేసిన గుర్తు, మీకు తెల్సు సాధారణంగా మా వంటి స్టూడెంట్సు చేతులు ఖాళీగా వుండవు. నా చేతిలో ఎప్పుడూ యిదిగో యీ కీచైన్ వుంటుంది. దాన్నివేలికి చుట్టుకుంటూతిప్పడమో చప్పుడు చేయడమో ..ఇటువంటి పన్లు నాకు తెలియకుండానే నేను చేస్తుంటాను ఆ ఆరోజు ఆటోలో కూర్చున్నాక ముందురేకుమీద నా పేరుకు మొదటి అక్షరమైన 'ఎస్'ను దీంతో చెక్కేను. అది అప్పటికి అనుకోకుండా చేసిన పిచ్చి కుర చేష్టే అదిప్పుడు మీకు ఉపయోగపడుతుంది.

రెండోది.. దోవమార్చి ఆపమంటున్నా ఆ ఆటో డ్రైవరు ఆపకపోవడంతో ఏం చెయ్యడానికీ తోచక ఫోల్డింగ్ అంబరిల్లా స్టిక్‌తో డ్రైవర్ తలమీద గట్టిగానే కొట్టాను రాడ్‌మెటల్‌ది అవటంవల్ల అతడికి రక్తం కూడవచ్చి వుండొచ్చు, ఆ అనుకోని దెబ్బకు తట్టుకోలేక ఆటో ప్రక్కకి ఒరిగిపోవడం, మేం తప్పించుకోవడం జరిగింది డ్రైవర్ని ఆ దెబ్బ సాయంతో గుర్తించొచ్చని నా నమ్మకం. మూడోది మేం విసిరిన రాళ్ళకి







# చైతన్యదీపాలు

ఆటోముందు అద్దం పగిలింది

సమీర యిచ్చిన ఆ మూడు పాయింట్స్‌నీ నోట్ చేసుకున్నాడు ఇన్స్‌పెక్టర్.

'మీరు కాస్త త్వరగా యిన్వెస్టిగేట్ చేయాలి సార్. ఇదే ఏ డబ్బో, నగలో అయితే ఎప్పుడు దొరికినా ఫర్వాలేదు. కానీ అపహరింపబడింది ఒక అమాయకపు ఆడపిల్ల. జరక్కూడనిదేం జరిగినా ఆ అమ్మాయి భవిష్యత్తే శూన్యమైపోతుంది.'

సమీర కళ్ళలోని ఆతృతని గమనించాడతను.

'మా సాయశక్తులా మేం కృషి చేస్తామని మాట యిస్తున్నాను. ఆపైన దైవలీల అన్నాడు.

'మీతోపాటు మేం కూడ కొన్ని వివరాలు సేకరించాలనుకుంటున్నాం సార్. ఆ విషయంలో ఎప్పుడేనా మీ సహాయం కావల్సివస్తుంది.

'ఓ యస్. మీకే సాయం కావల్సి వచ్చినా ఫోన్ చెయ్యండి. ఆ మాత్రం ప్రజల సహకారం వుంటే మా పని కూడ కాస్త తేలికవుతుంది'

ఇద్దరూ లేచారు.

★ ★ ★

## 13

చదువుతున్నదన్న మాటేగాని సమీర దృష్టి పుస్తకంమీద నిలవటంలేదు. ఆమె ఆలోచనలన్నీ గతానికీ భవిష్యత్తుకీ మధ్య అల్లుకుంటున్నాయి.

రోజులెంత వేగంగా దొర్లుకుని పోతున్నాయి? అప్పుడే ఆ దుర్ఘటన జరిగిపోయి నెల్లాళ్ళయిపోయింది. ఆమాటకొస్తే ఒక ముప్పయి రోజుల కాలంలో ఏమైనా జరగొచ్చు--రాజ్యాలు కూలిపోయి ప్రభుత్వాలు మారొచ్చు. ఎన్నోరాజకీయ, సాంఘిక ఆర్థిక పరిస్థితులు తారుమారవవచ్చు ఎన్నో హత్యలూ, దోపిడీలూ జరగొచ్చు. ఇంకెందరో హంతకులు నిందితులు కటకటాలవెనక్కు పోవచ్చు.

కానీ జరగనిదొక్కటే వాసంతి తిరిగి తమ మధ్యకు రావడం ఆమె ఆచూకీ తెల్సుకోడం కోసం చేసిన ప్రతిప్రయత్నమూ విఫలమయ్యింది పోలీసులకు కూడ అంతుపట్టని విషయమైంది.

ఈ పరిశోధనలో, వివరాల సేకరణలో తన వూహలెన్నో నిజమయ్యాయి తను గుర్తించిన ఆటో అదేనని తేలింది ఆ ఆటో ఓనర్ భీమారావుకీ కాలేజీ ఎన్నికలలో తనకు ప్రత్యర్థిగా నిలబడి ఓడిపోయిన సురేంద్రకీ మధ్య స్నేహముందనీ, ఆ స్నేహం అమాయకులైన ఆడపిల్లల్ని అల్లరి చేయడానికి ఉపయోగపడిందనీ తేలింది. వాసంతి అపహరింపబడిందన్న వార్త విని సురేంద్ర ఆశ్చర్యంతోనూ భయంతోనూ కంపించిపోయాడు కేవలం ఆటపట్టించే విషయంలోనే ఆటో డ్రైవర్‌తో మాట్లాడి తప్పుదారి పట్టించేవరకే తనకుతెల్సునని మిగతా విషయాలు తెలియవనీ సిన్సియర్‌గానే చెప్పాడు అయితే అసలువిషయం ఆ మర్నాడు గాయపడ్డ ఆటో డ్రైవరు ద్వారానే తెల్సింది. ఆటో డ్రైవరు స్నేహితుడైన రాజులుకి వ్యభిచార గృహాలతో సంబంధముందనీ అతనా సంగతులు తనతో చెప్పేవాడనీ, ఆ రోజు తను గాయపడ్డాక తనకు స్మారకంలేని స్థితిలో తనతో కూడావున్న రాజులే ఆటో డ్రైవ్ చేశాడనీ, అతడే ఆమెనెక్కడికో తీసుకువెళ్ళి వుంటాడనీ పోలీసులముందు స్టేట్‌మెంటిచ్చాడు. అతడు చెప్పింది అందరికీ నమ్మదగినదిగానే కన్పించింది. ఈ దుష్ట పరిణామాలకు కారకుడైన సురేంద్ర డబ్బునూ పలుకుబడినీ ఉపయోగించి తప్పకున్నాడు డ్రైవర్ పోలీస్ కస్టడీలో వున్నాడు రాజుల్ని గాలించి పట్టుకునే ప్రయత్నంలో పోలీసుశాఖ ఎంత కృషిచేసినా లాభంలేకపోయింది.

పుస్తకం మూసేసి లేచి డాబా మీది కొచ్చింది సమీర చీకటి తెరలు కప్పుకొనిపూరంతా నిద్రపోతోంది అంతటి నిశ్శబ్ద వాతావరణంలో దూరంగా వున్న సముద్రపుహోరు స్పష్టంగా భయంకరంగా విన్పిస్తోంది.

'వాసంతి యిప్పుడెక్కడుందో!' అనుకుంది ఆ ఆలోచనే ఎంతో భయంకరంగా తోచింది.

అసలు బ్రతికుంటూ వుందా? అనే మరో ప్రశ్న

ఎన్ని అక్రమాలను కప్పిపుచ్చుకునో అమాయక జీవాల్ని తనలో ఇముడ్చుకుంటూన్న సముద్రం యింకా భయంకరంగా అరుస్తూనే వుంది.

స్త్రీకి మానం కంటే ప్రాణం అధికం కాదన్న పెద్దలమాట వెనుక ఎంత స్వార్థం? శీలం పోగొట్టుకున్న మగవాడు మహారాజులా బ్రతకొచ్చు. ఊహించని పరిణామానికి శీలం పోగొట్టుకున్న స్త్రీసంఘానికి పనికిరాని వస్తువైంది. తిని విసిరేసే ఎంగిలాకు.

ఎంతటి అమానుషం? ఎంతటి పిరికితనాన్ని స్త్రీలలో నూరిపోశారు? అలాచెప్పి ఎంతమంది అమాయకులను ఆత్మహత్య చేసుకునేందుకు తోడ్పడ్డారు? శీలం విషయంలో స్త్రీ పురుషులమధ్య యీ బేధమెందుకో అర్థంకాదు.

సతీసహగమనం అమలులో వున్న రోజులనుండి చూస్తే నేటివరకూ స్త్రీ సంఘంలో ఏదో ఒక అన్యాయానికి గురయిపోతూనే వుంది. భర్తతోపాటు ప్రాణత్యాగం చెయ్యాల్సిన పద్ధతి ఎంతమూర్ఖం? అలాగే కొన్ని కులాలలో వున్న జుట్టు తీయించడం, పసుపు కుంకుమలకు దూరం చేయడం ఎంతటి మూఢత్వం?

# HANUMAN BRAND CEMENT (OPC)

# AS STRONG AS HANUMAN




ISI



A Product of research backed technocratic excellence to make your civil Projects long lasting.
Processed up-to-the-minute research and control, makes your constructions strong, enduring and impressive.

**A Technocrat's Cement to meet all modern construction needs.**

SCC

**SOMESWARA CEMENTS & CHEMICALS LIMITED**
Regd. off.: No.6-3-609/15 Anandnagar colony, Khairatabad, Hyderabad-500 004 A.P.
Phone: 36347

MAYURA


ఇప్పుడు లభిస్తున్న
డీలక్స
నిరోధ్
మరింత నునుపైనది
Made specially for the Government of India
NIRODH
Subsidised price
Re. 1/- for 5.
Superior Quality,
lubricated, electronically tested
సున్నిత మనస్కులైన దంపతులకు
అయిదింటికి
రూ. 1/-
★ ఉత్తమ మైన నాణ్యత గలది.
★ ఎలక్ట్రానిక్ సాదనాలతో పరీక్షింపబడినది.
అన్ని పెద్ద పట్టణాలలో
విక్రయింపబడుచున్నది
davp 84/28

# చైతన్యదీపాలు

విజ్ఞానం, శాస్త్రం యింతగా అభివృద్ధి చెందిన ఈ రోజుల్లో కూడా స్త్రీకి రక్షణ లేకుండా పోతోంది.

సమీర ఆలోచనలు ఎక్కడెక్కడికో పోతున్నాయి.

ఆమెకు చటుక్కున వాసంతి వదిన రాజ్యం అన్నమాటలు గుర్తొచ్చాయి. స్త్రీకి స్త్రీయే శత్రువన్నారందుకే. అంతటి కోపంలోనూ కచ్చలోనూ అన్నమాటల్లో ఏదో ఒకనగ్నసత్యం అంతర్లీనంగా ద్యోతకమయింది. అవును, తిరగబడితే స్త్రీ ఆదిపరాశక్తే. బలవంతంగా చెరచబడిన స్త్రీ కూడా ఆ తర్వాత పగపట్టి ఆ పురుషుడిని అంగ వికలుడుగా చేయవచ్చు. అందుకోసమైనా ఆత్మ సంరక్షణార్థం స్త్రీకి కొన్నివిద్యలవసరం. ఎదురుతిరిగి పోరాడే స్థితికి నేటి స్త్రీలు ఎదగడం ఎంతైనా అవసరం.

ఆలోచించిన కొద్దీ ఆమెకేవో కొత్తకొత్త వూహలు రావడం ఆరంభించాయి. స్త్రీల అభ్యున్నతికోసం స్త్రీల రక్షణ కోసం స్త్రీలే ముందుకు వచ్చి పాటుపడాల్సిన అవసరం ఎంతైనా వుందనిపించింది.

చీకటి ఆకాశంలో ఎక్కడో ఒకవెలుగుల పక్షి అరుస్తూపోతూంది మినుకుమినుకుమంటున్న కోటికోట్ల నక్షత్రాల మధ్య అరుంధతీ నక్షత్రం ఆమె కంటికానింది.

కొత్తరోజునూ కొత్త వెలుగునూ ఆహ్వానిస్తూ కాబోలు చర్చిలో గంట పన్నెండు కొట్టింది.

★ ★ ★

## 14

వాసంతి విషయం యింకా పూర్తిగా తేలనేలేదు. కాలేజీలోనూ, బయటా ఆమె గురించి చర్చలు యింకా ముగియనేలేదు.

పేపర్లలో ప్రకటించిన సముద్రపొడ్డున తేలిన అనాథశవంఆమెదే అన్నారు కొందరు.

రాజమండ్రిలో ఓ వేశ్యావాటికలో చూశామన్నారు మరికొందరు-

శీలం, మానం పోయాక చావధైర్యం లేక ఎక్కడో చాటుగా బ్రతుకుతుందంటున్నారు యింకొందరు.

ఏమైనా అందరికీ ఆమెపై సానుభూతే.

ఆ సానుభూతి వాతావరణం యింకా పోనేపోలేదు

ఆ కాలేజీ ఆడపిల్లలకు షాక్‌లాంటి మరోవార్త!

బియ్యే రెండో సంవత్సరం చదువుతున్న రమణి హాస్టల్ రూంలోనే వురేసుకుంది.

ఆశ్చర్యం,భయం కాలేజీ ఆడపిల్లలందర్లోనూచోటుచేసుకున్నాయి.

రమణి ఒక సామాన్య కుటుంబానికి చెందిన అమ్మాయి. తండ్రి పల్లెటూళ్ళో స్కూలుమాస్టరు. కుటుంబ ఆర్థిక స్థితిగతులను తెల్సుకుని మసిలే పిల్లలానే సింపుల్‌గా కామ్‌గా వుండేది. సహజంగా కాలేజీ పిల్లల్లో వుండే ఆడంబరమూ, చలాకీతనం కూడ ఆమెలో వుండేవికావు.

చదువులో ఎవో ఏవరేజ్.

ఆర్థికస్థితి, చదువు కాకపోతే – ఆమె ఆత్మహత్యకు పాలుబడ్డానికి మిగిలిన ఒకేఒక్క కారణం ప్రేమ వ్యవహారమయి వుండాలి! క్షణంలో వార్త గుప్పుమంది. పోలీసులొచ్చారు. శవాన్ని స్వాధీనం చేసుకుని పోస్టుమార్టంకి పంపారు.

ఆమె సూట్‌కేస్‌లోనూ, రూంలోనూ గల వస్తువులను తనిఖీ చేశారు. రమణి ఆత్మహత్యకు దారితీసిన వివరాలకోసం సోధించారు.

కాలేజీ ప్రిన్సిపల్‌తోనూ, హాస్టల్ వార్డెన్‌తోనూ, హాస్టల్ విద్యార్థినులతోనూ, సమీరతోనూ చర్చించారు.

# ఉగాది ఇంద్రజాలం

గుల్‌మొహర్లు పూచెను కద—
గులాబి పూలెటు దాగెను ?
వనజ్వాలికల నాలుక
కదల బారె కొత్త పాట

నీ పశాఖి కుసుమ రేఖ
చంచల పరిమళ మయూఖ !
రాధా మాధవ మదిగో
అవిరళ అనురా రవళి

మాధవి ఒక మూల దాగి
సర్వము తానై మెరసెను
గర్వ రహిత సౌరభమై —
మదనోత్సవ శోభనమై...

స్రోవంతా ఓసరిల్లి
కాలగమన మాపినదే—
మాలతి పాటల సుగంధి
ఇంద్రజాల మర్మగంధి !

మల్లెపూలు అలవికాని
సరిగమలకు సౌరభాలు
సమకూర్చే గడుసరులవి !
మమతలకే ఫలశ్రుతులవి !

కనుచూపుల కొస వరకూ
ఇంద్రజాలమే ఉగాది !
చనుదెంచే పైరగాలి
కను సైగల నవ ఉగాది ! !

-సోమసుందర్

అయినా వారికే వివరమూ పనికొచ్చేదిలా అన్పించలేదు. 'ఇది హత్యకాదుగదా' అనే అనుమానాన్నికూడా వ్యక్తపరచారు.

రమణి రూంమేటు శారద సెలవుపెట్టి తను వూరెళ్ళడంవల్ల రెండురోజులై రమణి ఒక్కతే వుంటోంది రూంలో. ఆ రెండు రోజుల్లోనూ బయటివారెవ్వరూ ఆమె గదిలోకిరావడం ఎవరికంటా పడలేదు.

ఇవే వివరాలు.

పాయింట్సన్నీ నోట్‌చేసుకుని కేసు నమోదు చేసుకుని వెళ్ళిపోయారు పోలీసులు.

ఆ రోజు కాలేజీలో కలకలం రేగింది.

స్టూడెంట్ యూనియన్ సెక్రటరీగా ఒక ఆడపిల్ల ఎన్నికవడమే యీ అనర్థాలన్నిటికీ మూలమని చాలమంది విమర్శించారు

కొందరు ధైర్యంగా సమీర ముఖంముందే అన్నారు.

లోపల్నుండి పౌరుషం పాము పడగలా బుసకొట్టినా ఏంమాట్లాడకుండా మౌనంగానే వుండిపోయింది సమీర. 'సాధనమున పనులు. .' అనే వేమనమాట ఆమె మదిలో మెదిలింది.

ఆ సాయంకాలం కాలేజీ అయిపోయాక ముఖ్యమైన ఆడపిల్లల నందర్నీ కూడగట్టుకుని ఒక సమావేశాన్ని ఏర్పాటుచేసింది సమీర.

రమణి ఆత్మహత్య చేసుకోడానికి దారితీసిన కారణాలేమై వుంటాయన్నది అందరితోనూ చర్చించింది.

ఆ చర్చలో అంతకుముందు తెలియని ఓ కొత్త విషయం సమీర దృష్టికొచ్చింది.

కొన్నాళ్ళ క్రితంవరకూ ప్రతి ఆదివారం సాయంత్రం రమణి కోసం ఒక యువకుడొచ్చేవాడట. అతడి పేరు రవీంద్ర. ఓ పత్రికా రచయితగా రమణి అప్పట్లో కొంతమందికి పరిచయంకూడ చేసిందట

రమణి భావుకురాలు. చిన్నచిన్న భావగీతాలూ, వ్యాసాలూ రాసి పత్రికలకు పంపిస్తూండేది కాని ఎందులోను అవి అచ్చయ్యేవికావు కాలేజీమేగ్జయిన్‌లో మాత్రం ఆమె రచనలు కొన్ని ప్రచురింపబడ్డాయి

ఆ సాహితీ వ్యాసంగమే వారిరువురిమధ్యా స్నేహానికి దారితీసి వుండొచ్చన్న అభిప్రాయం ఆమె స్నేహితురాళ్ళకి కలిగింది. అంతకుమించి రమణిని మరోలా వూహించలేకపోయారు వారు కారణం ఆమె మితభాషి. సున్నిత మనస్కురాలు అమాయకురాలూ కావడం.

కానీ అటువంటివారే స్పందించి ప్రేమవలలో త్వరగా పడతారనీ, ప్రేమ విఫలమైతే ప్రాణత్యాగానికైనా వెరవరని వారు గ్రహించలేక పోయారు.

దొరికిన ఆధారాలతో రవీంద్ర వివరాలు గబగబా సేకరించడం మొదలుపెట్టింది సమీర.

అతను పనిచేస్తున్న పత్రికాఫీసుకు వెళ్ళేసరికి అక్కడ సమీరకు తెల్సిన ఒకమ్మాయే రిసెప్షనిస్టుగా వుంది. ఆమె సమీరనుచూసి పలకరింపుగా నవ్వింది'

'రవీంద్ర వుండేదిక్కడేనా' అనడిగింది సమీర యోగక్షేమాల తర్వాత.

'అవునిక్కడే వుంటారాయన. ఈరోజు ఆఫ్.' అందామె.

అదే అదునని ఆమెతో కొన్ని నిజాలుకొన్ని అబద్ధాలూ చెప్పి అసలువిషయం రాబట్టింది సమీర

రవీంద్రకు పెళ్ళయి మూడేళ్ళయిందట. ఒక పాపకూడానట పత్రికారచయితగా మంచి వర్క్‌చేస్తాడని పేరుందట.

అయితే ఆడపిల్లల స్నేహాల విషయంలో అతనెటువంటివాడనే సమీర ప్రశ్నకు ఆమెకొంచెం విస్తుపోయింది. ఆ తర్వాత కాస్త అనుమానాస్పదంగా సమీరవంక చూసి మౌనంగా వుండిపోయింది.

తప్పనిసరి పరిస్థితుల్లో తనెందుకొచ్చిందీ చెప్పి అసలు విషయం ఆమె ముందుంచింది.

'రమణి అనే అమ్మాయితో రవీంద్రకు స్నేహముండడం నాకూ తెల్సు ఆమె రచనలను రవీంద్ర కరెక్ట్‌చేసి పత్రికలకు పంపేవారు. మా పత్రికలోనే ఆమె రచనలు చాలా ప్రచురించారు. అయితే ఆ స్నేహం పరస్పర ఆకర్షణవల్ల ప్రేమగా మారితే చెప్పలేం. ఇటీవల రమణి రెండు మూడు సార్లు పత్రికాఫీసుకు వచ్చింది-కానీ రవీంద్ర ఆమెతో కల్సి వెళ్ళగా చూడలేదు.'

దొరికిన వివరాల వల్ల కొన్ని విషయాలను సులభంగానే గ్రహించ గలిగింది సమీర.

ఆ మర్నాడు ఉదయానికి రమణి తండ్రి, అన్న వచ్చారు—రమణి అన్న నవీన్ ఎమ్మే చదివి ఉన్న ఊళ్ళోనే ఖాళీగా వుంటున్నాడు· అతన్ని ప్రక్కకు పిలిచి సమీర అసలు విషయాన్ని అతని ముందుంచింది.

సమీర అనుమానాన్ని నవీన్ బలపరిచాడు.

రవీంద్రతో గల పరిచయాన్ని రమణి చూచాయగా తన అన్నగారికి తెలిపిందట. అయితే అదింత తొందరలోనే ఒక విషసమస్యగా మారి ఆమె జీవితాన్ని బలి తీసుకుంటుందని అతనూహించలేక పోయాడు.

పోస్ట్‌మార్టమ్‌లో కూడా ప్రెగ్నెన్సీ డిటెక్ట్‌కావడంతో మరో ఆలోచనకే తావివ్వనవసరం లేకపోయింది.

అంతే! ఆ క్షణంనించే సమీరలోని ఆడపులి కళ్ళెర్రజేసింది. ఇలా పురుషాహంకారాలకీ, అవసరాలకీ స్త్రీలు బలైపోవడం ఆమె సహించలేక పోయింది. వాసంతి విషయంలో తను నిందితుడిని పట్టులేకపోయింది కానీ రమణి విషయం అలాకాదు. పెళ్ళికాని ఒక అబలను పెళ్ళయిన ఒక బాధ్యతగల పత్రికారచయిత మోసం చేసి కళ్ళముందే హాయిగా వుండటం, తాము తెలిసుండే చూస్తూ పట్టనట్టు వూరుకోవడం అన్యాయ మనిపించింది. అయితే జారిన కాలును లాక్కుని స్థిరంగా నిలబడే ప్రయత్నం చేయకుండా పిరికిగా ప్రాణాల్ని పోగొట్టుకోవడం మూర్ఖత్వం. వయసు తప్పవల్ల వచ్చే ప్రమాదాన్ని వూహించి జాగ్రత్తపడితే ఎంత బాగుండేది!

అయినా తానామెకు జరిగిన అన్యాయాన్ని ప్రతిఘటించాలనే అనుకుంది సమీర. బలమైన సాక్ష్యాధారాలు లేనిదే పోలీసులు ఈ కేసుకి న్యాయం చేకూర్చలేరు. అందుకని తనే స్వయంగా రంగంలోకి దిగాలని నిశ్చయించుకుంది.

ఆ వెంటనే కాలేజీలోని ఆడపిల్లలనందర్నీ సమీకరించింది.

రవీంద్ర పనిచేసే పత్రికాఫీసుకెళ్ళి ప్రదర్శనలు జరిపారు· అమాయక ఆడపిల్ల మానాన్నీ ప్రాణాన్నీ బలిగొన్న రవీంద్ర నశించాలి అన్నారు.

చీఫ్ ఎడిటర్ సమీరను లోనికి పిలిపించి సంగతి కనుక్కున్నాడు రవీంద్ర అటువంటి వ్యక్తికాడే! అన్న అభిప్రాయాన్ని వ్యక్తపరిచాడు.

'ఒక వ్యక్తిగానే కాక బాధ్యతగల ఒక పత్రికా రచయితగా కూడ ఆయన అటువంటి పన్లు చేయకూడదు. అటువంటి వారిని ఉద్యోగంలో వుంచుకోడం మీ పత్రికకే అవమానకరం. సిగ్గుచేటైన విషయం. అతనే నేరం చేశాడనడానికి అన్ని ఋజువులూ, సాక్ష్యాలూ మా దగ్గర వున్నాయి. రవీంద్రను మీరు ఉద్యోగం నుండి తొలిగించకపోతే వచ్చే పరిణామాలకు మేం బాధ్యులం కాము, అంది సమీర.

'రవీంద్ర ఈ రోజు సెలవ్. రేపు కనుక్కుంటాగా' అని నచ్చ జెప్పేడాయన.

ఆ రోజే కలెక్టర్‌కి, పోలీస్‌కీ కూడ ఈ విషయాన్ని తెలియ జేసింది.

మరుసటిరోజు అన్ని పత్రికలూ రమణి మరణవార్తను ప్రచురించినా రవీంద్ర పనిచేసే దినపత్రికలో మాత్రం ఆ వార్త రాకపోయేసరికి చిందులు తొక్కింది సమీర.

ఊరేగింపుగా వెళ్ళి పక్షపాత ధోరణి వహించే పత్రికలు నశించాలనే కొత్త నినాదంతో మళ్ళీ ప్రదర్శనలిచ్చారు—ఆ పత్రిక కాపీలను కొన్ని ఆ కార్యాలయం ముందే తగులబెట్టారు.

మూడు రోజులు ఆ ప్రదర్శనతీవ్రరూపం దాల్చేసరికి రవీంద్రను మరోవూరు బదిలీ చేస్తున్నట్లు హామీ యిచ్చి రమణి మరణవార్తను వివరంగా ఫొటోలతో సహా వేయడానికి సిద్ధపడ్డాడా పత్రిక ఎడిటర్.

ఆ తొలి విజయంతో కాలేజీలోనూ బయట కూడ సమీర పేరు మార్మోగిపోయింది,

★ ★ ★

## 15

'ఈ రోజుతో మన పరీక్షలన్నీ అయిపోయినట్టే. ఇక రేపట్నించీ ఎవరెక్కడ వుంటామో తెలియదుకదా'.

హైమ మాటలకు తలెత్తి చూసింది సమీర

·కాలేజీ ఆవరణలో పచ్చికమీద కూర్చున్న కొద్దిమంది ఆడపిల్లల ముఖాల్లోనూ విచారరేఖలు కన్పిస్తున్నాయి. ఆరోజుతో ఫైనలియర్ పరీక్షలైపోవడంవల్ల ఎవరి వూళ్ళకు వారెళ్ళిపోవాలి. అంతే తర్వాత జీవితంలో ఎవరెలా స్థిరపడతారో వూహించలేని స్థితిలో వున్నారంతా.

నాకు మాత్రం చదువింకలేదు నాన్న పెళ్ళి ప్రయత్నంలో వున్నాడు అంది ప్రమీల.




# ఘర్
# కొబ్బరి నూనె

ప్రఖ్యాత 'ఘర్' బ్రాండ్ రిఫైండ్ వంట నూనెలు, ప్రియ వాషింగ్ సబ్బు ఉత్పత్తిదార్లనుంచి మరొక నాణ్యమైన ఉత్పత్తి - ఘర్ కొబ్బరి నూనె లభిస్తోంది.

ఘర్ కొబ్బరి నూనె 100% స్వచ్ఛమైనది. ఇది పల్చనిది. జిగురు లేనిది, పోషక విలువలను సంపూర్ణముగా కలిసియున్నది. సహజ పరిమళమునూ మార్పు చేయబడలేదు.

ఘర్ కొబ్బరి నూనె ఎండలో బాగుగా ఎండిన ఎన్నిక చేసిన కొబ్బరి నుంచి తయారు చేయబడినది. ఖచ్చితమైన నాణ్యతను పాటిస్తూ అధునాతనమైన సాంకేతిక ప్రక్రియల ద్వారా పరిశుద్ధముగా తయారు చేయబడుచున్నది.

ఘర్ కొబ్బరి నూనె డబ్బాలలోనూ మరియు ప్లాస్టిక్ కంటైనర్లలోనూ 100 ml, 200 ml, 500 ml, 1000 ml లలో దొరుకును




**Swastik**
**OIL INDUSTRIES**
(REFINERY)
18-2-45/3, Chandrayangutta,
Hyderabad 500 005.
Tel: 49313, 49015, 49058, 49326
Grams: SWASTIKOIL
Telex: 0155-371 (BROMIN)

Breeze/SOI/845



# చైతన్యదీపాలు

క్లాసొస్తే చదివే అర్హతను సంపాదించుకుంటాను. లేకపోతే ఏంచేయాలో అర్థంకావటంలేదు అంది మాధురి.

నాకుమాత్రం ఇంకా చదవాలనే వుంది. స్త్రీ పురోభివృద్ధి సాధించిందనడానికి అదొక చక్కని నిదర్శనం కావాలి. చదువు, హోదా, కీర్తి అన్నీ సమకూర్చుకోవాలి అంటూ సమీరవంక చూసి—

'మరి నువ్వేం అనుకుంటున్నావ్ నీ భవిష్యత్తుగురించి' అని ప్రశ్నించింది హైమ.

నేను భవిష్యత్తుగురించి మాత్రం అందమైన కలలు కంటం లేదు. వూహాలోకాల్లో తేలిపోవటమూలేదు అసలు ఆడదానికి వేరే భవిష్యత్తంటూ వుందా అనేదే ప్రశ్న. తండ్రో, భర్తో, పిల్లలో ఎవరోఒకరు జీవితాంతం వారి జీవితంతో తన జీవితాన్ని జోడించి అదే తన జీవితమూ భవిష్యత్తూ అనుకుంటూ వుంటుంది సగటు స్త్రీ—

నిజానికి మన పరీక్షలు యీ రోజుతో పరిసమాప్తికావటంలేదు జీవితంలోని అసలు పరీక్షలు రేపట్నించే మొదలౌతున్నాయి. ఆ పరీక్షల నెదుర్కొవేందుకు జవాబులను కంఠతా పెడితేచాలదు. ఎంతో నిగ్రహం, ఆత్మస్థైర్యం, ధైర్యం, ఆర్థిక నైతిక బలం ఇవీ కావల్సినవి గృహిణిగా స్థిరపడ్డా, అధికారిణిగా పదవుల నలంకరించినా ఆడదిఆడదే ఆమెకున్న సమస్యలు ఎప్పటికీ సమస్యలుగానే మిగిలిపోతున్నాయి. ఏ సంఘ సంస్కర్తో పూనుకుని ఎదిరిస్తేగాని ఆమె యీసంఘంలోని మూఢాచార వలలోంచి బయట పడలేకపోతోంది. సమస్యల సాలెగూళ్ళలోంచి ఒక్క అంగుళం కూడ కదలలేకపోతూంది అందుకే.. సాటిస్త్రీగా మహిళా అభ్యుదయంకోసం, సంక్షేమంకోసం ఉడతాభక్తిగా కొంతకృషి చేయాలనుకుంటున్నాను. ఇది స్వార్థరాజకీయ మార్కు వాగ్దానం మాత్రం కాదు. మనసులో రూపులు దిద్దుకుంటున్న నిశ్చయం మాత్రమే. అతి చిన్నదైన మన యీ కాలేజీ పరిధిలోనే మన కళ్ళముందే ఒకే ఏడాదిలో రెండు దుస్సంఘటనలు జరిగిపోయాయి. అటువంటిది నిత్యం మనదేశంలో స్త్రీలపై ఎన్నెన్ని అత్యాచారాలు జరుగుతున్నాయో వూహించలేకపోము.

ఇప్పటికే ఒక నిశ్చితాభిప్రాయానికొచ్చాను. మా నాన్నగారుకూడ నా అభిప్రాయానికి విలువిచ్చేమనిషి. మన జీవితాన్ని మన యిష్టాను సారం మంచిగా మలుచుకునే స్వేచ్ఛ, హక్కు ముందు మనకవసరం అది సాధించగలననే నమ్మకముంది.

నేను తలపెట్టే కార్యక్రమానికి మంది బలం, ఆర్థికబలం కూడ కావల్సివుంటుంది. అందుకు మీరెవరైనా చేతనైన సాయం చేయండి. జిల్లాలోని స్వచ్ఛందసంస్థల సహాయాన్నికూడ అర్థించాలనుకుంటున్నాను. జిల్లా కలెక్టర్‌కూడ ఒక స్త్రీ కావడం మనఅదృష్టం. ఆమె అండ దండలు తప్పకుండా వుంటాయి.

అయితే ఒక్కమాట. ఈ సహాయాలేవీ అందకపోయినా నేను నా ప్రయత్నంనించి విరమించుకోను. స్త్రీకి అన్నిటా రక్షణ కల్పించాలనేదే నా ధ్యేయం. ఆ పట్టుదలతోనే నా భవిష్యత్తును తీర్చిదిద్దుకుంటాను.

కొండమీంచి జలపాతంలా వురికి, గట్లను తెంచుకుని, ప్రవహించే వాగులా సాగిన సమీర ప్రసంగానికి అక్కడవున్న ఆడపిల్లలంతా ముగ్ధులయ్యారు. ప్రతిఒక్కరికీ తామూ అటువంటి కార్యక్రమంలో భాగస్వాములవ్వాలనేవుంది. కానీ వెనుకనున్న యింటిపరిస్థితులు కొందరినోళ్ళను నొక్కేశాయి. ఐదారుగురు మాత్రం ముందుకొచ్చి సమీర నిర్వహించబోయే పనికి అండగా తమ సహాయ సహకారాలందిస్తామన్నారు. వారిలో వచ్చిన ఆ చైతన్యానికి సమీరమనసు ఆనందంతో వురకలేసింది.

*　　*　　*

ఆ రోజు దినపత్రికలో ప్రచురించబడ్డ ఒక ప్రకటన చాల







మందిని ఆకర్షించింది. ముఖ్యంగా స్త్రీలు ఆ ప్రకటన చదివి ఎంతో ఆశ్చర్యపోయారు. ఇది సాధ్యమా అనుకున్నారు కొందరు ఇదోరకం డబ్బుపోగుచేసుకునే వ్యవహారం అని మరికొందరు తలలు తిప్పారు.

ఆ ప్రకటన సారంశమిది:—

''ఆపదలో వున్న అబలలూ!

మిమ్మల్ని ఆదుకుని మీకు రక్షణకల్పించి వ్యక్తిగా జీవితంలో మీకెదురయ్యే కీలక సమస్యల్ని పరిష్కరించడమే మా ధ్యేయం.

మానవతావాదం, మహిళా సంక్షేమం, స్త్రీచైతన్యం మా ప్రధాన ఆశయాలు —

కులమత జాతి భాషా ప్రసక్తిలేకుండా స్త్రీ అభ్యున్నతి కోసం పాటుపడటమే మా కర్తవ్యం—

ఇందులో స్వార్థ రాజకీయ ఆర్థిక ప్రయోజనాలులేవు. వంటరిగా స్త్రీగా మీరు పరిష్కరించుకోలేని మీ సమస్యని మాకు చెప్పండి— మా సలహాలనూ సేవలను పొందండి''

స్త్రీ చైతన్య సమాఖ్య తరుఫున సమీర యిచ్చిన ప్రకటన అది దాదాపు అన్ని దిన వారపత్రికలూ ఆ ప్రకటనను ప్రచురించాయి.

'ఇటువంటి సంస్థలు ఆవిర్భవించడం అవసరమే అయితే ఆర్థికంగా బలమైనవి కాకపోతే మూతబడి పోవడం తథ్యం' అన్నారు కొందరు.

సమీర స్నేహితురాళ్ళు కూడ ఆమె వేసిన ముందడుగుకు హర్షాన్నీ ఆనందాన్నీ వ్యక్తపరచారు.

జనసమర్థం అట్టేలేని ఓ లొకాలిటీలో రెండుగదుల పోర్షన్ తీసుకుంది సమీర. ఒకగది తనకూ తన పుస్తకాలకూ కేటాయించింది. ముందుగదిలో నాలుగు కుర్చీలు వేసింది. ఒకనాటి అర్ధరాత్రి సమయంలో తమకు తోడుగా నిలిచిన వీరయ్యను వాచ్‌మెన్‌గా, అంగరక్షకుడిగా నియమించుకుంది. తెలివీ, ఉత్సాహమూ వున్న యిశ్వరమ్మాయిల్ని తన కూడా వుంచుకుంది.

పేపర్ ప్రకటన చూసి చాలమంది స్నేహితులు అభినందనలు తెలిపారు. కొద్దిమంది నిరుత్సాహపరిచారు.

అయితే ప్రకటన వెలువడ్డ రెండువారాల వరకూ ఆశించినట్లు స్త్రీ సమస్యలు తనకు చేరకపోవడంతో సమీర చాల నిరుత్సాహపడింది. తన ఆలోచనలోనే లోపముందో, లేక స్త్రీ సమస్యలు తను అనుకున్నంత భయంకరంగా లేవో తేల్చుకోలేకపోయింది.

ఆ మరుసటి వారంనుండే ఉత్తరాలు రావడం మొదలుపెట్టాయి సుమారొక రెండు డజన్లు ఉత్తరాలు వారం రోజుల్లో చేరాయి—అన్నీ ఆడవాళ్ళు రాసినవే

ఉత్సాహంగా ప్రతి ఉత్తరాన్నీ ఎంతో శ్రద్ధతో చదివింది సమీర.

వాటిల్లో ఎక్కువ భాగం ఉత్తరాలు జీవిత సమస్యనుగూర్చినవే— కొందరు దిక్కులేని అనాథలు, మరి కొందరు సవతితల్లి పోరుపడలేక యింటినుంచి ఎలాగోలా బయటపడి జీవించాలని ఆశతో రాసినవి.

దైవసమానులైన సమీరగారికి,

నేను అయిదో తరగతి వరకూ చదువుకొన్నాను అమ్మపోయాక చదువు మాన్పించేశాడు నాన్న. మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు· ఇంట్లో అన్ని పనులు నేనే చెయ్యాలి. పిన్ని నన్ను శత్రువులా చూస్తుంది. కడుపునిండా తిండి. కంటినిండా నిద్ర, ఒంటినిండా బట్ట వుండటం లేదు. నాకిప్పుడుపదమూడేళ్ళు—నాన్ననాకు పెళ్ళి చేసేటట్టు కన్పించడం లేదు· దయచేసి నాకోదారి చూపించి పుణ్యం గట్టుకోండి.

ఇట్లు

అభాగ్యురాలు—భవాని

పేర్లూ కష్టాలు వేరుగాని సగానికి పైగా యిదే మూసలో రాసిన వుత్తరాలే వున్నాయి.

మరికొన్ని అనాథ స్త్రీలు రాసినవి.

స్త్రీలపాలిట కల్పవృక్షమైన సమీరగారికి,

నేను నాఅన్నవాళ్ళులేని వంటరిదాన్ని బతుకోసం వాళ్ళింట్లోను వీళ్ళింట్లోనూ పనులు చేసుకొని గడుపుకొస్తున్నాను. దేవుడి దయవల్ల ఒక పూటైనా కడుపు నిండుతోంది. కాని నాలోని ఆడతనమే నాకు శత్రువుగా తయారౌతోంది. యజమానుల ఆకలిచూపులకు తట్టుకోలేక పోతున్నాను. దినదినగండంగా రోజులు గడుస్తున్నాయి నాకు మరోదారి చూపితే మీమేలు మరువలేను.

—లక్ష్మి.

కాస్త అటూయిటూగా ఆరేడు ఉత్తరాలు యిలాగే వచ్చాయి.

రెండు మూడు ఉత్తరాలు మాత్రం చాల విభిన్నంగా వున్నాయి. అలాంటి వాటిల్లో ఒకటి సరస్వతి వ్రాసిన ఉత్తరం. ఆంధ్రా కోస్తా జిల్లాలోని ఓ మారుమూల పల్లెనుండి రాసింది

సహృదయులైన సమీరగారికి, నమస్కారం.

స్త్రీ సమస్యలపట్ల ప్రత్యేక శ్రద్ధతీసుకుని వాటని మానవతా దృష్టితో మీరు పరిష్కరించి, వారికో జీవిత గమ్యాన్ని చూపించదల్చుకున్నందుకు చాల సంతోషంగావుంది. ఈ స్వతంత్ర భారతదేశంలో ఏ స్వతంత్రమూ లేకుండా అంధకారమయ జీవితాన్ని గడుపుతూన్న వారెందరో వున్నారు. అటువంటి వారికి మీవంటివారు ఆదర్శమూర్తులే కాదు. ఆశాజ్యోతులుకూడ.

దారిద్ర్యరేఖకు అట్టడుగున మిగిలిపోయిన ఎన్నో గ్రామాలలో మా గ్రామం ఒకటి. శుభ్రమైన రోడ్లు, భవనాలూ ఎలావుంటాయో ఇక్కడి చాలమందికి తెలీదు. రైలు, బస్సు వంటి వాహనాలెక్కనివాళ్ళూ

చాలమందే వున్నారు. అటువంటి గ్రామంలో పుట్టిన దగ్గర్నించీ కాలం గడుపుతున్న నేను నూతిలోని కప్పలాగే బ్రతుకుతున్నాను.

నాన్న స్కూలు మాస్టర్‌గా చేస్తూ క్షయవ్యాధితో మంచంపట్టి పోయారు. ఆనాటికి నేను టెంత్‌పాసయ్యాను. నేనే మొదటి సంతానం నా తర్వాత యిద్దరు చెల్లెళ్ళు. చెప్పుకోదగ్గ బంధువులులేరు. నాన్న పోయాక అమ్మ, నేను యిద్దరు చెల్లెళ్ళూ ఒంటరి పక్షుల్లా మిగిలి పోయాం. ఉన్నదొక్క తాటాకుయిల్లు అదే తలదాచుకోడానికీ, పరువు బజారుపాలవకుండా చూసుకోడానికీ.

నాన్న నాకు ఇచ్చిన ఒక్కగానొక్క అస్తి చదువే. నాన్న నేర్పించిన ఆ చదువునే ఆలంబన చేసుకున్నాను. బడిపిల్లలకు ప్రైవేట్లుచెప్పి వారిచ్చిన దాంతో నలుగురున్న యీ కుటుంబాన్ని లాక్కొస్తున్నాను. అది తప్ప యీ పల్లెలో మధ్యతరగతి వాళ్ళు చేసే మరోపని కన్పించలేదు. నాకిప్పుడు ఇరవై రెండేళ్ళు. మనోవ్యాధితో మంచంపట్టినా అమ్మ, లోక మంటే ఏమిటో తెలియని అమాయకపు చెల్లెళ్ళూ. ఉద్యోగంకోసం ఎంప్లాయ్‌మెంట్‌లో రిజిస్ట్రేషన్ చేయించి నాలుగేళ్ళయింది. ఇంత వరకూ ఒక్క పిలుపూలేదు. అన్నిటా బ్రతుకుబారమైపోతున్న యీ రోజుల్లో మీ ప్రకటన నామనసులో ఆనందపు పన్నీరును చిలకరించింది. ఈ తక్కువ చదువుకు ఉద్యోగమిప్పించమని మిమ్మల్ని కోరలేను యీ కుటుంబపు ఆర్థిక సమస్యను చక్కదిద్దమని అడగనూలేను. ఒక మగ దక్షతకూడాలేని యీ యింటిపరిస్థితి మీకు ఆప్తులుగా భావించి వ్యక్త పరచాను.

సహృదయంతో అర్థంచేసుకుని యీ సోదరికోదారి చూపగలిగితే యీ చిన్ని గుండెల్లో వుండేది దైవంకాదు. సమీర ప్రతిమే అని మర్చి పోకండి

అభాగ్యసోదరి — సరస్వతి.

సుదీర్ఘమైన యీ లేఖమాత్రం సమీరను కదలించివేసింది. అదే లేఖను నాలుగైదుమార్లు చదివింది. ప్రతిఒక్కమారూ ఆమెకు సరస్వతి గుండెల్లోని ఆవేదన, ఆర్ద్రత ఒక్కొక్కప్పుడు ఒక్కోరకంగా ద్యోతక మయ్యాయి.

సంఘంలోని ఒక సామాన్యవ్యక్తిగా తను ఓ యింటి ఆర్థిక సమస్యను చక్కదిద్దలేదు. అయితే చీకటిబ్రతుకుల్లో కాసింత వెలుగు నైనా ప్రసరింపజేయాల్సిన సాంఘిక బాధ్యత తనకుంది. చమురింకి, కొండెక్కిపోతున్న దీపాలకు కాసింత చమురునైనా త్యాగంచేయాల్సివుంది. నిరాశా నిస్పృహలలో కుమిలిపోతున్న యువతకు చెయ్యిఅందించి తూరుపు దిక్కులోని వెలుగునుచూపించే యత్నం చెయ్యగలగాలి.

అనుకోకుండా సమీర కళ్ళలో నీళ్ళు నిలిచాయాక్షణాన.

స్త్రీల ఉపాధికల్పనా కేంద్రాలలో కొందరికి చోటివ్వాల్సి వుంటుం దని ముందుగానే అందుకు సంబంధించిన అధికారులతో మాట్లాడి వుండటాన మొదటి రెండు తరహాలకు చెందినవారికీ యించుమించు ఒకే రకమైన సమాధానాలనిచ్చే ఏర్పాటుచేసింది.

స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో బతకాలనుకున్నవారికి ప్రభుత్వంవారి స్త్రీ ఉపాధికల్పనా కేంద్రాలలో అర్హతనుబట్టి ఉపాధి చూపించబడు తుందనీ, అయితే మొదట్లో కొన్ని కష్టనష్టములకోర్చవలసి వుంటుం దనీ, అందుకు సిద్ధపడినవారు తమ అంగీకారాన్ని తెలియజేస్తే వివరాలు పంపబడతాయనీ ఆ సమాధానంయొక్క సారాంశం.

ఆరకమైన సమాధానం మొదటి రెండుతరహాలకు చెందిన వీరికి పంపడం జరిగింది.

అయితే సరస్వతి విషయంలో మాత్రం ఆమె ప్రత్యేక శ్రద్ధ తీసుకోదలచింది దానికిగల కారణాల్లో మొదటిది అది ఒక కుటుంబానికి చెందినసమస్య. రెండోది సరస్వతి టెంత్‌వరకైనా చదివి వుండడం సరస్వతికి ఓ చిన్న ఉద్యోగం చూపించినా చితికిపోతున్న ఓ సంసారం నిలబడుతుంది.

అందుకే స్వయంగా వెళ్ళి కలెక్టర్‌గారితో మాట్లాడింది. సరస్వతి రాసిన ఉత్తరాన్ని అమృతవల్లిగారికి చూపించి ఆమెకెలాగైనా సహాయం చేయమని అర్థించింది. కనీసం 'కుటుంబానికో ఉద్యోగం' పథకం క్రిందైనా ఆమెకుతగిన దారిచూపమంది. కలెక్టర్ అందుకులంగీకరించ డంతో ఓ గొప్ప సమస్యను పరిష్కరించినట్టుగా సంతృప్తిగా వూపిరి పీల్చింది. అది తను సాధించిన మొట్టమొదటి విజయంగా భావించింది.

గర్వంతో, రెట్టింపు ఉత్సాహంతో కార్యరంగంలోకి దిగింది.

★ ★ ★

## 17

కాలప్రవాహంలో రోజులూ, సంవత్సరాలూ దొర్లుకుపోతున్నాయి.

ఆ రోజుకి సమీర 'స్త్రీ చైతన్య సమాఖ్య' స్థాపించి అయిదు ఏళ్ళు.

తన గదిలో కూర్చుని కిటికీలోంచి సాలోచనగా ఆకాశం వంక చూస్తున్న సమీరకు స్వేచ్ఛగా ఎగిరే పక్షులు కన్పించాయి.

ఆమె మనసులో కలిగిన సంతృప్తి భావన ముఖంమీద సంతోష రేఖై భాసిల్లింది.

ఈ అయిదేళ్ళ కాలంలోనూ స్త్రీల సమస్యలను ఎన్నిటిని పరిష్క రించిందో లెక్కలేదు కొందరికి ఉపాధిని కల్పించింది. కొందరికి ఉపకార వేతనాలనూ. వృద్ధులకు వృద్ధాప్య పించనులనూ యిచ్చే ఏర్పాటు చేసింది. కట్నం సమస్యలను దంపతుల మధ్య ఏర్పడ్డ సమస్యలనూ కొన్నిటిని పరిష్కరించింది.

నిత్య తన కార్యాలయానికి ఎస్తున్న ఉత్తరాలకు జవాబిస్తోంది.

కొన్ని విచిత్రమైన కేసులూ సమస్యలు కూడా తనవద్దకు వచ్చాయి. వాటిల్లో కొన్నిట్ని తల్చుకుంటె నవ్వొస్తుంది. కొన్నిట్ని తల్చుకుంటే జాలేస్తుంది. అలా పరిచయమైన కొందరితో బంధుత్వాన్ని మించిన దగ్గరతనం ఏర్పడుతుంది.

సమీర ఆలోచనలు ఒక్కమారు గతంలోకి మళ్ళాయి—

రెండేళ్ళ క్రితం ఓ రోజు తనకోసం ఓ యువకుడొచ్చాడు.ఎర్రగా అందంగా, నాజూగ్గా వున్నాడు.

తన పేరు ఆనంద్ అనీ, ఏదో వూళ్ళో జూనియర్ కాలేజీ లెక్చరర్‌గా పనిచేస్తున్నాననీ పరిచయం చేసుకున్నాడు—అతడినెక్కడో ఎపుడో చూసినట్టనిపించింది సమీరకు—వెంటనే గుర్తుకు రాలేదు.

'చెప్పండీ. నేనేం చెయ్యగలను మీకు !' అంటూ ఇంగ్లీషులో ప్రశ్నించింది.

'నాదో చిన్న సమస్య—ఐ మీన్ స్త్రీ సమస్యేలెండి' అని తొట్రుటు పడి, తన సమస్యను వివరించాడు.

పెళ్ళయి ఏడాదైందట. వేరింటికాపురం భార్యాభర్తల మధ్య కలహాలేమీలేవు. అత్తల, ఆడబడుచుల ఆగడాలేంలేవు. భార్యను అపు రూపంగా చూసుకుంటాడట. వారంరోజులుగా తనభార్య కన్పించటంలేదని అతని ఫిర్యాదు బంధువుల యిళ్ళకు వెళ్ళలేదని నిర్ధారించుకున్నాడట పోలీసు రిపోర్టిస్తే లేనిపోని అపోహలొస్తాయి. అల్లరౌతుందని భయం

స్త్రీ సమస్యల్ని పరిష్కరించడంలోనూ, స్త్రీలకు రక్షణ కల్పించ డంలోనూ మీ కృషిని పత్రికలద్వారా చూస్తూనే వున్నాను మీరు నాకు సాయపడగలనే నమ్మకంతో వచ్చాను. నా భార్యను వెదికించే బాధ్యతను మీమీదుంచుతున్నాను.'' అన్నాడతను గద్గదస్వరంతో. 'ఆమె వెళ్ళాక, అల్మారాలో యీ కాగితం దొరికింది' అంటూ ఓ కాగితాన్నందించాడు.

'నాగురించి వెదికే ప్రయత్నం చేయకండి ఈ అభాగ్యురాల్ని మర్చిపోండి సువర్ణ' అనిమాత్రం ఉందాకాగితంలో.

# చైతన్యదీపాలు

'మీ చిరునామాయిచ్చి వెళ్ళండి. మా అసిస్టెంట్స్‌వచ్చి వివరాలు నోట్‌చేసుకుంటారు' అంది సమీర.

అప్పుడు గుర్తొచ్చిందామెకు అతనెవరో...ఏ పరిస్థితుల్లో పరిచయమైందీనూ. మనిషిలో కాస్త మార్పుండటంవల్ల తను వెంటనే పోల్చుకోలేకపోయింది. అతనూ తనను గుర్తుపట్టలేకపోయాడు. అంటే ...తను మారిందా ?

అతను వెళ్ళిపోయాక, అతనితో ఆరోజుల్లో ఏర్పడిన పరిచయం గుర్తొచ్చి నవ్వుకుంది.

'ఐ లైక్‌యూ మిస్ సమీరా, మీ స్నేహం అపూర్వం, పూర్వ జన్మ సుకృతం' అని రాసి కాగితం ఏరోద్వారా ఆనాటి ఫంక్షన్‌లో వర్తమానం పంపిన ఘనుడు. ఆ తర్వాతకూడ మరో రెండు వర్తమానాల్ని పంపేడు దొంగచాటుగానే. దస్తూరీనిబట్టి కాలేజీలో వెరిఫై చేసి, దొంగనుపట్టుకుంది తను.

ఓరోజు కాలేజీ ఆవరణలోనే తనవైపు దొంగచూపులుచూస్తున్న అతనిని దగ్గరకు రమ్మని సైగచేసింది. బెదురుతూనేవచ్చాడు.

'మీ తెలుగురైటింగ్ బావుంటుంది' అంది మెచ్చుకోలుగా.

'మీకెలాతెల్సు' అతని ముఖంలో ఆశ్చర్యం.

సమీర నవ్వింది గలగలా—పారే సెలయేరల్లే. ఆ నవ్వులోని ఆకర్షణకు ముగ్ధుడై ''ఎలా కనిపెట్టేరు'' అన్నాడు ఆనందంగానే.

''కావాలనుకుంటే ఆమాత్రం కనుక్కోలేనా'' అంది అతనివంక ఓరగాచూస్తూ.

వయసులోనూ,చదువులోనూ తనకంటే తక్కువయిన అతనికితన మీద ఙూ అభిప్రాయమేమిటో ఆమెకర్థంకాలేదు. స్నేహభావమే అయితే దానికి దాగుడుమూతలక్కర్లేదు. అదికాకపోతే......? ప్రేమా...? పైత్యమా...? వికారమా ?

''మీరు బియ్యే తెలుగు కదూ'' అడిగింది. అవునన్నట్లు తలూపాడు.

'నాకోచిన్న సాయం చేయగలరా? మా స్టూడెంట్స్ పెట్టిన ఓ క్విజ్ పోటీలో కొన్ని ప్రశ్నలకు సమాధానాలు రావటం లేదునాకు—మీరు తెలుగు కాబట్టి చెప్పగలరు. ప్లీజ్ హెల్ప్‌మీ' అంది గోముగా.

'చెప్పండి' అన్నాడతను ధైర్యంగా.

కాస్సేపాలోచించి, ఓ కాగితం మీద నాలుగు ప్రశ్నలు రాసింది

1) స్త్రీల కోసం మొట్టమొదటి వచన పుస్తకం నేనే రాశాను అని చెప్పుకున్న రచయిత ఎవరు ?
2) వెన్నెట్లో కూచుని, చంద్రుడు అస్తమిస్తాడే! నిన్న ఉదయించ లేదే! అనిఏడ్చే నిర్భాగ్యుణ్ణి నిన్ను చూశాను......స్త్రీ వాళ్లో ఎన్నాళ్ళు కూచుంటుంది ? చంద్రుడెంతసేపు వెలుగుతాడు ? వెలిగితే...నిలిస్తే . ఈ సౌందర్యం భరించగలవా .. నాయనా'' అని తన స్త్రీపాత్రద్వారా వేదాంతం బోధించిన సాంసారిక విప్లవ సాహిత్య సామ్రాట్టు ఎవరు ?
3) ''......విలాసినుల సహాలాప సహాసన సహయానములు బంధ సమములుగావే'' అన్న కవి ఎవరు ?
4) ''నీ కనురెప్పకొసలనొక చినుకైన కదలనీ
ప్రళయ కాలానంత భయ దపాధోరణి వలె
విశ్వమెల్ల ముంచెత్తు సుమ్మా' అన్న వైతాళికుడెవరు ?

ఆ ప్రశ్నల్ని చూసి తెల్లమొహమేశాడతను.

ఫర్వాలేదు—గుర్తుతెచ్చుకొని సాయంకాలంలోగా చెప్పగలిగితే చాలు చెబ్తారు గదా'' అంది.

తలూపి వెళ్ళిపోయాడు. అంతే! ఆ సాయంత్రం కాదుగదా మరో మూడ్రోజుల వరకూ కళ్ళబడలేదు. నాలుగోరోజున తప్పించుకు పోతూంటే తనే పిలిచింది.

"ఆ రోజు... మా వూర్నించి అర్జంటుగా కబురొస్తేనూ..! అంటూ ఏదో చెప్పబోయాడు. నవ్వేసి, తన పుస్తకంలోని ఒక కాగితం అతనికందిస్తూ "చూడండి. నేనే కనుక్కున్నాను వాటికి జవాబుల్ని కరక్టేనా ?" అడిగింది.

ఆత్రుతగా ఆ కాగితంవంక చూశాడు. సమాధానాలు వరసగా వున్నాయి.

1) కందుకూరి వీరేశలింగం పంతులుగారు. 2. గుడిపాటి వెంకట చలం 3. నన్నయ్య 4. దేవులపల్లి కృష్ణశాస్త్రి). అతని ముఖం పాలిపోయింది. అయినా ఓటమిని కప్పిపుచ్చుకుంటూ కరెక్టుగానే రాశారు. అన్నాడు నవ్వుతూ.

'ఏమైనా మీ వంటి వారిదగ్గర తెలుగు నేర్చుకోవాలి" అంది కవ్వింపుగ.

ఏడుపు నవ్వు నవ్వి, అలాగే అంటూ అర్జంటుగా జారుకున్నాడు. అంతే! ఆ తర్వాత కల్సుకోలేదు. అప్పటికప్పుడు మళ్ళీ—

'ఆ సంఘటనలను గుర్తుతెస్తే ఏమయ్యేవాడో మానవుడు!' అనుకుంది.

మరో నాల్గు రోజుల్లో తన ప్రమేయం లేకుండానే తన అసిస్టెంట్సు విడదీసేరాతని చిక్కు సమస్యని

భర్తమీద ప్రేమ వున్న సువర్ణ ఎదురింటి పెళ్ళికాని కుర్రాడితో లేచిపోయిందనీ—దానిక్కారణం ఆనంద్‌లో పుంసత్వం లోపించడమేననీ—

అది చెబుతూ పడిపడి నవ్వుకున్నారు సమీర అసిస్టెంట్లు.

★ ★ ★

## 18

ఆ రోజు పోస్టులో వచ్చిన ఉత్తరాలలో ఒక కవరు సమీరను ఆకర్షించింది. దానిపైనున్న దస్తూరి తనకు పరిచయమైనదే- కవరు వెనక్కు తిప్పి చూసింది· ఫ్రమ్ ఎడ్రసు లేదు—ఆత్రంగా కవరువిప్పింది ఆది మాధురి రాసింది.

సమీరా !

ఎన్నాళ్ళయిందే నిన్నిలా చనువుగా సంబోధించి! పేపర్లలో నువ్వు చేసేఘనకార్యాలు(వ్యంగ్యం కాదు) చదివినపుడూ, నీపేరు చూస్తున్నపుడూ నిన్ను చూస్తున్నట్టే అన్పిస్తున్నది నాకెప్పుడూ. ఎప్పటికప్పుడు నువ్వు సాధించిన విజయాలకేనా అభినందించాలనుకుంటాను—ఒక్క అభినందన తెల్పి ఊర్కునేంత దూరమైందా మన స్నేహం ? స్వేచ్ఛగా, మనసుకు నచ్చిన పనిని చేస్తూ అందులో వుండే సంతృప్తితో జీవిస్తున్న నిన్ను చూస్తుంటే నాకెంతో గర్వమని పిస్తూంటుంది. దేనికైనా అదృష్టం వుండాలి.

నా అదృష్టానికొచ్చిన లోటేమిటని నువ్వనుకోవచ్చు ఊహ తెలీక ముందే తల్లిని పోగొట్టుకున్నా డాడీ పెంపకంలో అల్లారుముద్దుగానే, అతి స్వేచ్ఛగానే పెరిగాను. డబ్బుకెప్పుడూ లోటులేదు. అయితే మనసుకు నచ్చినపని చేసుకుని ఆనందించడంలో నీకున్న స్వేచ్ఛలో నాకు వెయ్యోవంతుకూడ లేదంటే నమ్ముతావా ? కోయిల కంఠమని నువ్వు మెచ్చుకుని నువ్వు పదేపదే పాడించుకున్న యీ కంఠం రాగాలు పలకడం మానేసి ఎన్నేళ్ళయిందో! సంగీతంలో ప్రావీణ్యతను సంపాదించుకుని ఆ ఆనందంలో, తన్మయత్వంలో రాగాలలో రసానుభూతిని పొందాలనుకున్న నా ఆశలు ఆశలుగానే మిగిలిపోయాయంటే నమ్మగలవా? ఆయనొక పెద్ద బిజినెస్‌మాగ్నెట్. సంగీతమంటే ఆయనకిష్టం వుండదు. భార్య సంగీత కచ్చేరీలుచేస్తే క్లబ్బులో కేబరేడ్యాన్సు చేసినంత అవమానంట ఆయనకి. నా పరిస్థితినిప్పుడు వూహించుకుంటున్నావనుకుంటాను. నాలో నిరాశ వంటరితనం, బిజినెస్ కమ్ముకున్నపుడల్లా ఒక రవిశంకర సితార్, ఒక బాలమురళి తిల్లానా, ఒక హరిప్రసాద్‌చే రాసియాప్లూటూ, ఒక జేసు దాసు కీర్తన, ఒక పంకజ్ ఉదాస్ గజల్—ఇవే నన్ను మనిషిగా పునరుజ్జీవింపజేస్తున్నాయి. ఆ కేసెట్లన్నీ నా ఒక్కదానికే పరిమితం. కళాసృష్టి అంటే ఆత్మ అంతరాళాల్లోంచి అందాన్ని బైటకిచ్చేది. దానికో రూపమిచ్చి, కట్టేసి మాయం కాకుండా జీవింపజేసే నేర్పు ఒక్క కళాకారుడికే వుందని ఎక్కడో చదివినగుర్తు.

--సారీ. ఇన్నాళ్ళతర్వాత ఉత్తరంరాస్తూ యీ సోదంతా రాస్తున్నందుకూ, నా యీ నిరాశామయ జీవితంలోని అంశాలను ఏకరవు పెడుతున్నందుకూ విసుక్కోకు. నువ్వుకాక యింకెవరున్నారు యీ మనసులోని మాటని చెప్పుకునేందుకు? నేనన్నివిధాలా సుఖంగా వున్నానని డాడీ అనుకుంటున్నారు ఇవన్నీచెప్పి ఆయనను బాధపెట్టడం నాకిష్టంలేదు

ఏమైనా నువ్వు చేస్తున్నపని గొప్పది. అందుకునిన్ను మనసార అభినందిస్తున్నా. ఎప్పుడేనా నీకు వీలుచిక్కినపుడు యీ స్నేహితానికోసం ఓ రెండునిముషాలు వెచ్చించి ఉత్తరం రాయగలిగితే అది యీ ఏడారి బ్రతుకులో స్వాతిజల్లే.

నీ—మాధురి

సుదీర్ఘమైన ఆ ఉత్తరం చదివి భారంగా నిట్టూర్చింది సమీర.

* * *

## 19

'ఎవరో నవీన్ బాబంటమ్మా—మిమ్మల్ని చూడాలంటున్నారు"



అంటూ వచ్చాడు వీరయ్య.

'పంపించు లోపలికి' అంది సమీర. రాస్తున్నదల్లా ఆగి పెన్ను మూతేస్తూ, ప్లావ్‌డోర్ తెరుచుకొని లోపలికొస్తూ 'నమస్కారంమేడం' అన్నాడతడు చేతులు జోడిస్తూ.

'నమస్కారం రండి. కూర్చోండి. అంటూ కుర్చీ చూపించింది· అతనాశ్చర్యంగా ఆమెవంక చూశాడు. ఆమెకూడా అదే పరిస్థితిలోవుంది. చటుక్కున గుర్తొచ్చి, 'మీరు...రమణి అన్నయ్య కదూ' అడిగింది.

'అవును—నాపేరు నవీన్· మిమ్మల్నెక్కడో చూశాననుకుంటు న్నాను—

ఇప్పుడు గుర్తుకొచ్చింది. నన్ను బాగానే గుర్తుంచుకున్నారే' అన్నాడు.

నవ్వేసి, మీరొచ్చిన పనేమిటో చెప్పండి' అంది.

నవీన్ కాస్సేపు మౌనం వహించి,'సమీరంటే మీరేనని నాకింత వరకూ తెలీదు—రమణి పోయిన కొత్తలో మీరంతా పత్రికాఫీసు ముందు ప్రదర్శనలిచ్చి, ఘెరావ్‌లు చేసి ఆ రవీంద్రను ట్రాన్స్‌ఫర్ చేసేవరకూ నిద్రపోలేదన్న సంగతి నేనింకా మర్చిపోలేదు—కానీ ఆ సమీరే మీరని... ఏమైనా నేను రావల్సిన చోటుకే వచ్చాను—నిర్భయంగా మా సమస్యను మీ ముందుంచుతాను'' అంటూ ఆగాడు. ఈలోగా వీరయ్య రెండు కప్పులతో కాఫీ తెచ్చి వారి ముందుంచాడు.

కాఫీలయ్యాక నవీన్ చెప్పడం మొదలుపెట్టాడు.

''మీకు తెలుసోలేదో మా అమ్మా నాన్నలకు సంతానం మేం ముగ్గురం. నా తర్వాత యిద్దరు చెల్లెళ్ళు—చెల్లెళ్లిద్దరూ నా రెండు కళ్ళూ అనుకునే వాడిని. రమణిసంగతి మీకు తెల్సిందే· రెండోచెల్లాయి పేరు విజయ. ఇంటికి పెద్దవాడిగా కొడుకుగా నేనసమర్థుడినే అయినా నాన్న మాత్రం చెల్లాయికేం లోటు చెయ్యలేదు. తలకుమించి అప్పు చేసినా మంచి సంప్రదాయమైన సంబంధమే చేశాడు. పెళ్లయి మూడేళ్లయింది—'' అంటూ జరిగినదంతా వివరంగా చెప్పి ఎదురైన సమస్యను సమీరముందుంచాడు·

ఒక్క క్షణం ఆగి, ఆమె ఏం మాట్లాడకపోవడం చూసి,బహుశ ఇదో పెద్ద జీవిత సమస్యగా మీ కనిపించక పోవచ్చు. యిటువంటివెన్నో సగటున ప్రతి నాలు కుటుంబాలలోనూ ఒక కుటుంబంలో జరుగుతూనే వుండొచ్చు. ఆ మాటకొస్తే పూర్వం నుండి కుటుంబంలో స్త్రీయిష్టా యిష్టాలకు, మాటలకు అంత విలువ వుండేదేకాదు. బహుశ యిప్పుడున్నంత స్త్రీ చైతన్యం అప్పట్లో వుండేదికాదేమో! అది వేరేసంగతి మా విజయసంగతి చెప్పానుగా ఎంత సున్నితమైన మ న సో... ఎంతభావుకతో. ఎన్నాళ్ళనుంచి అనుభవిస్తోందో ఆ ఆ వే ద న. ఆమెలోనిమార్పు కనిపెట్టి నేను నెమ్మదిగా అడిగేసరికి కన్నీళ్ళకడలే అయింది. ఇది సున్నితంగా తేల్చాల్సిన సమస్య. మీకేమైనా పరిష్కార మార్గం తోచవచ్చని వచ్చాను.'' అన్నాడు.

వివరాలన్నీ అడిగి నోట్‌చేసుకుని, మీరు నాలుగు రోజులాగిరండి.'' అంది సమీర.

ఆమెమాటలు ఆశాజనకంగా అన్పించలేదు నవీన్‌కి.

బొమ్మలాలేచి బయటకొచ్చేశాడు.

* * *

## 20

చదువుతున్న మాక్సిమ్‌గోర్కీ 'మదర్' పుస్తకం మూసేసి పక్క మీదికి చేరింది సమీర. ఆమె ఆలోచనల్లో మాధురి నెమ్మదిగా చోటు చేసుకుంది. తన ఆనందానికి అభివృద్ధికి ఆటంకాన్ని కలిగించే చిన్ని

సమస్యనుకూడ స్త్రీ పరిష్కరించుకోలేక పోతూండంటే స్త్రీ అబలకాక ఏమిటి? సంగీతమంటే ప్రాణమిచ్చేమాధురి పెళ్లిచేసుకున్న పాపానికి తన సంతోషాన్నీ యిష్టాన్నీ చంపేసుకుని జీవితంతో రాజీ పడిపోతూంది. కారణం సంసారం, భర్త, పిల్లలు సంఘజీవనం. ఇవన్నీ ఆమెను బందీ చేస్తున్నాయి. సున్నితమైన కోర్కెల్నికూడ చంపేస్తున్నాయి.

క్రమంగాసమీర ఆలోచనల్లోంచి మాధురి తప్పుకుని విజయ ప్రవేశించింది.

కలిగిన కుటుంబంలో అత్త, ఆడుబిడ్డలు వున్నయింట మహ లక్ష్మిలా కాలుపెట్టింది. అందము, హోదా, వున్న భర్తకు భార్యగా స్థిరపడింది. తాళాలు చేతికిరాకపోయినా యింటిపనంతా చేతికొచ్చింది. భర్తతో గడిపే కొద్ది సమయంలోనే ఆనందాన్ని పొందేది. క్రమంగా ఆ ఆనందంకూడ క్షీణించిపోసాగింది. పై సంపాదనకు అలవాటుపడ్డ భర్త తాగుడుకికూడా అలవాటుపడ్డాడని ఆలస్యంగా గ్రహించింది. అప్పటికే భార్యకంటె స్నేహితులే హితులయ్యారతనికి. అర్ధరాత్రి ఎప్పుడో రావడం, వంటిమీద స్పృహలేనిస్థితిలో నిద్రపోవడం. ఎవరికి చెప్పుకుంటుంది తనగోడు ?

సమీర కళ్ళ ముందు ఒక్కసారి నవీన్ ముఖం కన్పించింది. అంతర్ జ్ఞానంతో మెరిసే ఆ కళ్ళల్లో ఎక్కడో నిరాశ! ఆ మనసులో చెల్లెలంటే ఎంతటి ప్రేమో!

తన సమస్యను పరిష్కరించగలిగితే ఎంత ఆనందిస్తాడతను ? అయితే అది అయ్యేపనేనా ?

చటుక్కునలేచి ఒక్కమారు అతడిచ్చిన వివరాలు పరిశీలించింది. భార్యాభర్తలమధ్య కలతలులేవు. అత్తపోరులేదు. ఆర్థికసమస్య అసలే కాదు. సమస్యంతా అక్రమసంపాదనవల్ల, చెడుస్నేహితులవల్ల తాగుడు వ్యసనానికి బానిసైపోవడమే.

సమీర మనసులో మెరుపులాంటి ఓ ఆలోచన మెరిసింది అంతే. అతని ఉద్యోగవివరాలు మరోమారు చూసింది. సంతృప్తిగా నిట్టూర్చింది విజయ సమస్యకు పరిష్కారం చూపడంలో తను గెలిచినట్టే !

★ ★ ★

## 21

''కనకానికి పెళ్ళట మీకుతెలుసా?'' అడిగింది యూస్సీ.

యూస్సీ సమీర అసిస్టెంటు

'తెలీదు' అంది సమీర.

'కట్నం ఎనిమిదివేలుట'

ఈమారు నమ్మలేనట్లుచూసి, 'నిజమా?' అంది సమీర.

'పెళ్ళికొడుకు మాకు దూరపుబంధువే అలా తెల్సిందీవిషయం' అని కాస్సేపాగి, 'ప్రేమపెళ్ళికూడనూ' అంది యూస్సీ

సమీరకు యిక ఆ పైమాటలు విన్పించలేదు. ఆమె మనసు చుట్టూ ఎన్నో ఆశ్చర్యార్థకాలు! ప్రేమ పెళ్ళిళ్ళు చేసుకోవచ్చు, కట్నమిచ్చి పెళ్ళిళ్ళు చేసుకోవచ్చు కానీ కనకం యిలా చేస్తోందంటేనే ఆశ్చర్యం !

ఒక సందర్భంలో కనకం తమ ఉద్యమానికి సహకరించింది. సరిగ్గా ఏడాదిక్రితం కనకం తనకోఉత్తరం రాసింది. అది తన అక్కకు కలిగిన ఒక అన్యాయంగురించి. కనకంఅక్క తిరుపతమ్మ పెళ్ళయిన రెండేళ్ళకే ఆత్మహత్యచేసుకుంది. ఆ ఆత్మహత్యకు కారణం కట్నం ! పెళ్ళిపీటలమీద యిస్తామన్నకట్నం పూర్తిగా యివ్వకుండా నాలుగువేలు బాకీపెట్టాడు తిరుపతమ్మ తండ్రి. ఆ క్షణాన వూరుకున్నా ఆ తర్వాత కూడ అతడేం ఆ సంగతి ఎత్తకపోడం, రెండుసంవత్సరాలైనా ఆ బాకీ తీర్చకపోడంతో తిరుపతమ్మ అత్త, భర్త ఆమెనాసొమ్ముకోసం వేధించ సాగేరు.



### రావమ్మ చల్లగా!

ఏమి త్రాగెనో యేమొ
ఎర్రబారిన కనుల యేతెంచి 'రక్తాక్షి'
రక్తమే కురిసింది ఘోరాతిక్రూరముగ !
తనె బాధపడె నేమొ—చీకట్లె పోకుండ
చిరు దీపమును కూర్చి
విస్తరించి వెలుంగు వెళిపోవునల్లదే—

ఏ తెంచు 'క్రోధనా'
నీ దివుడు పాలన.
అరువదేడులు నీవు కాల భ్రమణముచేసి
ఎంతగానో యెదిగి ఏతెంతు వీనాడు—
మనసులో ఊహలో మార్పు చెందితివంచు
మానవత గుర్తెరిగి మంచి పంచెదవంచు
కష్టనష్టాల్లేవి కలిమి గూర్చెదవంచు
సుష్టుగా అందరికి శుభము కూర్చెదవంచు
నీకు స్వాగతమీయ నిలుచుంటి మీనాడు
రావమ్మ క్రోధనా, రావమ్మ చల్లగా !
అవని విధ్వంసాన్కి
అగ్రరాజ్యాధిపులు
పోటీలలో మునిగి పొంచి నిలుచున్నారు—
'ఎవరిచ్చితిరి మీకు ఈ వినాశన హక్కు?'
అని నీవు ప్రశ్నించి, అదలించి బెదరించి
కనులెర్రజేసైన అనువుగా పోరాడి
అవని శాంతిని కూర్చ నాయత్తవై రమ్ము—
రావమ్మ క్రోధనా, రావమ్మ చల్లగా !

- మేకా సుధాకరరావు

పరిస్థితి విషమించడంతో తిరుపతమ్మ ఈ విషయం తండ్రికి వివరంగా ఉత్తరం రాసింది. పిల్లకు పెళ్ళవ్వాలని మాటంటే యిచ్చాడు గానీ తిరుపతమ్మ తండ్రికి ఆ సొమ్మును సర్దేశక్తిలేదు—అందుకే అతను నిమ్మకు నీరెత్తినట్లుండిపోయాడు. ఎన్ని ఉత్తరాలు రాసినా తండ్రి నుండి జవాబు రాకపోవడంతో చివరిసారిగా ''మీరివ్వని పక్షంలో నా చావు ఒక్కటే దీనికి పరిష్కారం—ఈ బాధల్ని భరించేకంటే అదే నయమని అన్పిస్తోంది.'' అంటూ రాసింది—మరో నెలలోనే ఆమె కిరసనాయిల్ పోసుకుని అగ్నికాహుతైపోయింది—

''మా అక్క మరణానికీ చావే కారణం—అక్క నాన్నకి రాసిన ఉత్తరాలే సాక్ష్యం, పాపిష్టి డబ్బుకాసపడి మా అక్కను బలి తీసు కున్నాడు. అతడిని శిక్షించక్కరలేదు—కనీసం కట్నం క్రింద తీసుకున్న నాలుగు వేలన్నా తిరిగి యిప్పించండి'' అంది కనకం తనదగ్గరకొచ్చి ఏడుస్తూ—ఆ మర్నాడే తనతండ్రిని కూడ తీసుకొచ్చిందిసాక్ష్యాధారాలతో సహా.

ఆమె తండ్రిని చూసే సరికల్లా సమీరలో కోపం ఉవ్వెత్తున లేచింది. అయినా నిలదొక్కుకుని అనునయంగా అంది.

''మీరడిగిన దానిలో న్యాయం లేకపోలేదు—అది వేరే సంగతి కానీ ఈ చావుకి కారణం మాత్రం ఆమెభర్త, అత్త మామలూ కాదు— మీరు వెయ్యి అబద్దాలూ, వెయ్యిమోసాలూ చేసి పూర్వులెవరో పెళ్ళి చెయ్యమన్నారని వారి దారిలో వెళ్ళి శక్తికి మించిన సంబంధం





చూసి ఆమె గొంతు కోసింది మీరే—కనీసం ఆ దుస్థితిలో ఆమెను ఆ చెర నుండీ విడిపించి తెచ్చినా ఈ దుర్ఘటన జరిగివుండేది కాదు—మీలాంటి వాళ్ళకి కావల్సింది కూతురు సుఖంగా కాపురం చేసుకోడం కాదు—ఎంతో కొంత డబ్బుతో ఆమెను వదిలించుకోడం.

ఆవేశంగా ఆమె అనేసర్కి బక్క-చిక్కి చచ్చిపోయాడతడు—ఆ తర్వాత 'తప్పంతా నాదే' అని ఏడ్చాడు.

తిరుపతమ్మ భర్త గవర్నమెంటు ఉద్యోగి అవటం వల్ల ఎలాగో బెదిరించి ఆ సొమ్మును తిరిగి యిప్పించగలిగింది.

ఆ గాయమింకా మానకుండానే యిప్పుడు కట్నం యిచ్చి మరీ ప్రేమించిన వాడిని పెళ్ళాడబోతోంది కనకం.

ఎప్పటికి పోతుంది స్త్రీలలో ఈ పిరికి తనం ?

ఎన్నాళ్ళకొ మార్పువస్తుంది యిటువంటి వారిలో.

అసలీలోపం ఎక్కడుంది?

సమీర మస్తిష్కం నిండా ప్రశ్నలే.

★ ★ ★

## 22

'గుడ్ మార్నింగ్ మేడమ్'

తలెత్తిచూసింది సమీర—

గోధుమరంగు లాల్చీ, తెల్లపైజామా. కళ్ళజోడూ, భుజానికి వేలాడే గుడ్డ సంచీ—విలక్షణంగా వున్నాడు

'రండి' అంటూ తనకెదురుగా వున్న కుర్చీ చూపింది.

కూర్చుని, ఆమె కళ్ళలోకి ఆతృతగా చూశాడు నవీన్.

'కాఫియా, టీయా ఏం తీసుకుంటారు' అడిగింది సమీర.

'అవి తర్వాత— ముందు మా సమస్య గురించి ఏం ఆలోచించారో చెప్పండి'

'జీవిత సమస్య. అందులోనూ సున్నితంగా వ్యవహరించాలన్నారు—అంత తొందరైతే ఎలా'

'కానీ మా విజయ...దాని పరిస్థితి ఊహిస్తూంటే . ....'

'డోంట్ వర్రీ—మీ సమస్యకు పరిష్కారం దొరికినట్టే—కార్య రూపంలోకి రావడానికి మరో రెండు నెలలు పట్టొచ్చు''

ఆ మాటలకు నవీన్ కళ్ళు ఆనందంగా మెరవడం గమనించింది

''థాంక్యూ మేడమ్ అదెలాగో తెల్సుకోవచ్చా—''

'ఓ యస్, సావధానంగా తెల్సుకోవచ్చు, కాఫీయా, టీయా' అడిగింది.

'భలేవారే కాఫీ యిష్టం. టీ ఫర్వాలేదు' అన్నాడు. ఇంతలో ఓ అమ్మాయి సమీరదగ్గరకొచ్చి, ఇంకో ఆరు పేజీలు మిగిలిపోయాయండీ టైప్ చేయడానికి. రేపు కంప్లీట్‌చేసేస్తా' అంది,

'ఫర్వాలేదమ్మా—అది సబ్‌మిట్ చేయడానికి యింకా నాలుగు రోజులపైముందిగా. వెళ్ళిరా అంది సమీర.

ఆమె వెళ్ళాక, ''సాంఘిక సంక్షేమ మంత్రిణిగారొస్తున్నారుగా మా సంస్థ ఆశయాలు, విజయాలు తెలుపుతూ ఒక నివేదికను ఆమెకు సమర్పించాలనుకుంటున్నాం' అంది.

''మంచిదే. కానీ ప్రయోజన ముంటుందంటారా''

'మనం చేయాల్సింది మనం చేయడమే. ప్రయత్నం లేకుండా ప్రయోజనమాసించడం అవివేకమని నా అభిప్రాయం' అంది.

నవీన్ వెంటనే ఏం మాట్లాడలేదు. కాస్సేపాగి, ''ఇప్పుడొచ్చిన ఈ అమ్మాయి......'' అంటూ ఏదో ప్రశ్నించబోయాడు.

'నా అసిస్టెంట్—ఖాళీ సమయాల్లో నాకు సాయపడుతుంది—నేను వారికిచ్చేదేం లేదు—కానీ వారి సాయం లేనిదే నా యీ ఉద్యమం కుంటుబడిపోతుందని మాత్రం చెప్పగలను' అంది



Phone : 25889 P. P.

LOOK LOVELY LOOK BEAUTIFUL

# RADHIKA SAREES

**Brodiepet :: 5th Line :: GUNTUR-2.**

మావద్ద అన్ని రకముల షిఫాన్, ఆర్గండి, ఆర్గంజ, ప్యూర్‌కోట, అమెరికన్ జార్జెట్, ప్రింటెడ్ శారీస్ సరసమైన ధరలకు లభించును.

స్త్రీల ప్రత్యేకమైన షోరూం

## రాధిక శారీస్

బ్రాడీపేట :: 5వ లైను

గుంటూరు - 522002.

---

Phone : 25889

# RADHIKA TEXTILES

Brodiepet :: 4th Line :: GUNTUR-2

కంచి * ఆరణి * ధర్మవరం * బెంగుళూరు * బనారస్

అన్ని రకముల చీరలు దొరుకును.

## రాధిక టెక్స్‌టైల్స్

బ్రాడీపేట :: 4వ లైను

గుంటూరు - 2.

# చైతన్యదీపాలు

కాఫీలు తాగుతూన్నపుడు విజయ సమస్యను తానెలా పరిష్కరించా లనుకున్నదీ చెప్పింది సమీర.

'గుడ్ అయిడియా మాశారా నాకు తట్టనేలేదు.' అన్నాడు.

చెడుసావాసాలకు దూరంచేస్తే మనిషి బాగుపడొచ్చు. ఆ వూరి నుండి విజయభర్తను బదిలీచేయిస్తే అటు చెడుసావాసాలకూ దూరం చేసినట్టుంటుంది. ఇటు వేరింటి కాపురమవడంవల్ల భార్యమీద ప్రేమ పెరిగి ఆమెమాటకు విలువివ్వనూవచ్చు. ఆ మారేవూరు పల్లెటూరయితే మరీమంచిది. మందుపని బంద్ అవుతుంది.

అయితే యీ బృహత్కార్యాన్ని అంతకు ఆర్నెల్లక్రింత ఆ జిల్లాకు ట్రాన్స్‌ఫర్ అయి వెళ్ళిన కలెక్టర్ అమృతవల్లిద్వారా తాను సాధిస్తున్నట్లు మాత్రం ఆమె నవీన్‌కి చెప్పలేదు.

''ముందుగా నేనడగనూలేదు. మీరు చెప్పనూలేదు. మీ ఫీజెంతో చెబితే...'' నసిగేడు నవీన్.

''తీసుకునేచోట తీసుకుంటాను. మీలాంటివాళ్ళ దగ్గరకాదు. ఇందులో నాకు ఖర్చయిందేమీలేదు.''

''సంస్కర్తల, మేధావుల సలహాలకు వెలకట్టే ధైర్యంలేదునాకు. కానీ యిటువంటి సంస్థలు ముందుకు నడవాలంటే కొంత ఆర్థికబలం కూడ అవసరంగదా. అందుకనేనా...''

''కావొచ్చు ఆ బలం, ప్రోత్సాహం ప్రభుత్వం నుండే పెద్ద పెద్ద సంస్థలనుండే రావాలి. రమణి చెల్లెలికి నేనామాత్రం చేయకపోతే యింకెందుకు? అయినా ముందు విజయం సాధించనీయండి'' అంది.

కాస్సేపు నవీన్ ఏం మాట్లాడలేదు. తర్వాత అన్నాడు. ''మీరేం అనుకోకపోతే ఒక్కమాట. నేనూ మీ టైపింగ్‌వర్క్‌లో సాయం చేయవచ్చునా'' అతనివంక ఆశ్చర్యంగా చూసింది సమీర.

'ఫర్వాలేదండీ నాకు టైపింగ్ బాగానేవచ్చు. ఎమ్మే చదువుకీ ఉద్యోగం రాకపోతేపోయింది. యీ టైపింగ్ నాలెడ్జివుంటే ఏ చిన్న ఉద్యోగమైనా రాకపోతుందా అని నేర్చుకుని పాసయ్యాను. కానీ దానికీ లాభంలేకపోయింది. దాన్నిలాగైనా ఉపయోగించనీయండి, అని అప్పటికీ ఆమె మాట్లాడకపోడం చూసి, 'రోజులో ఎన్నోగంటలు వృధా చేస్తున్నాను. అందులో కొన్నిగంటలు ఇటువంటి సంఘ సేవకు పయోగిస్తే పోయేదేంలేదు. కాస్తంత తృప్తిఅయినా మిగుల్తుంది' అన్నాడు.

'మీయిష్టం.' ఆనందంలోంచి, మౌనంలోంచి గొంతువిప్పిఅంది.

*   *   *

## 23

ఆరోజు పోస్టులో ఒకేఒక ఉత్తరమొచ్చింది. కవరు పైనున్న రైటింగ్‌ను చూసే పోల్చేసింది అది హైమావతి రాసిందేనని. ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు దీనికీబుద్ధిపుట్టింది అనుకుంటూ ఆత్రంగా కవరుచింపి చదవడం మొదలుపెట్టింది.

డియర్ సమీరా,

ఎన్నేళ్ళయిందోకదూ మన మిలాగైనా ఉత్తరాల్లో మాట్లాడుకుని? ఎన్నీ ఋతువులు వెళ్ళిపోయాయి. ఈ ఋతుచక్రం ఆగదుకదా? వెళ్ళిపోయినా మళ్ళీ కొత్తగా ఆవిర్భవించే ఋతువులాగే మనకీ గతించిన రోజులన్నీ మళ్ళీ వస్తే ఎంత బాగుంటుందీ? నామట్టుకు నాకు గతకాలమే మేలనిపిస్తోంది. ఇంత చదువు చదివి, యింత సంపాదిస్తూకూడ జీవితంలో ఏం సాధించానని ఆలోచిస్తే నిరాశే మిగులుతుంది

డిగ్రీ అయ్యాక, అటుపెళ్ళా, యిటు చదువా అన్నప్రశ్న ఎదురైనపుడు ఆ సంసారచక్రంలో యిరుక్కునేకంటే లెక్చరర్ అయి, పాఠాలు చెప్పుకుంటూ హాయిగా జీవితం గడిపెయ్యాలనే కలలుగన్నాను. ఆ తలపుతోనే అడుగుముందుకు వేశాను.

కానీ యీ వృత్తిలో అనుకొన్నంత తృప్తి పొందలేక పోతున్నానని చెబితే ఆశ్చర్యపోతావు. ప్రతి కొత్తపాఠాన్నీ ఒక కొత్తపద్ధతిలో విద్యార్థుల మనసుల్లో హత్తుకునేలా చెబుదామనుకున్న నా ఆశయాలూ ప్రయత్నాలూ ఆదిలోనే కూలిపోయాయి. ఈనాడు కాలేజీలకొచ్చే ఏభైశాతం విద్యార్థులకు పాఠాలక్కర్లేదు. పాఠం చెబుతూన్నంతసేపూ క్లాస్‌లో సిల్లీకూతలూ, మేకలరుపులూ, గుర్రపు సకిలింతలూను ఇక వాళ్ళు వేసుకునే బట్టలసంగతి చెప్పనక్కర్లేదు. ఆడా మగా ఫ్యాషన్ పెరేడ్‌కి వచ్చినట్టు వస్తారు. వీళ్ళకి మంచి అవ్వాలంటే క్లాసులో అల్లరిచేసినా, పరీక్షల్లో కాపీలుకొట్టినా పూర్కోవాలి.

ఇటువంటి వాతావరణంలో రోజుకి ఆరుగంటలు గడుపుతున్నాను. ఇప్పుడుచెప్పు. నన్నూ నా విద్యార్థుల్నీ తల్చుకుంటే జాలివెయ్యడంలేదూ నీకు ?

జీవితంలో రాంగ్‌స్టెప్ వేశానేమో ననిపిస్తోందిప్పుడిప్పుడే.

నిన్ను తల్చుకున్నపుడూ, నీ గురించిన వార్తల్ని పేపర్లో చదివి నపుడూ అనిపిస్తూంటుంది నువ్వెంత స్వేచ్ఛగా, ఆనందంగా జీవితం గడుపుతున్నావోఅని. చెప్పకేం ఈర్ష్యకూడ పుడుతుంది.

నీకు తెలుసోలేదో...అమ్మపోయి ఆర్నెల్లయింది.

నా పెళ్ళికోసం బెంగ పడీపడీ ఆమె పోయింది. ఏం చేయను ? నా ఆశయం సిద్ధించాక అమ్మకోర్కె ప్రకారం యిన్నేళ్ళొచ్చినా యిన్ని పాఠాలు యింతమందికి చెబుతున్నా ఓ మగాడి ముందు తలొంచుకు కూర్చోడానికే సిద్ధపడ్డాను.

అయితే అప్పటికే ఆలస్యమైపోయింది—చదువులోనూ వయసు లోనూ నన్ను మించిన పురుషుడు నా కోర్కెల మేరకు ఎదురవలేదు. ఎదురైన ఒకరిద్దరూ అన్ని కోర్కెలు వుడిగిన వాళ్ళు—

నాకిక పెళ్ళవదనే బెంగతోనే అమ్మ మంచం పట్టి పోయింది వంటరిదాన్నిప్పుడు.

ఏ వర్షపురాత్రో గదిలో, చీకటిలో బితుకు బితుగ్గా మంచానికి ఓ మూల పడుకున్నపుడూ, ఏ వేసవి రాత్రో ఆరుబయట పడుకున్న పుడు అర్ధరాత్రి మెలకువ వస్తే ఆకాశంలో ఒంటిగా అరుచుకుంటూ పోయే వింత పక్షి అరుపును విన్నపుడూ నాలోని ఒంటరితనం నన్ను భయపెడుతూంటుంది.

అప్పుడొక మగవాడు నా చెంతనుంటే బావుండుననిపిస్తుంది— కేవలం బయొలాజికల్ నీడ కోసమే కాదు—తోడుకోసం, రక్షణకోసం— జీవితాంతం నాతోకూడా వుండటానికీ, నా అనుభవాల్నీ, అనుభూతుల్నీ పంచుకోడానికీ—

'ఇదంతా వట్టి ట్రాష్ అని కొట్టిపారెయ్యకు.

ఆడది ఎంత ఎత్తుకెదిగినా మగవాడి సరసన ఉన్నపుడే నిశ్చింత.

నువ్వేమంటావ్ ? ఉత్తరం వివరంగా రాయి.

నీ హైమ.

ఆ రోజంతా హైమ రాసిన ఉత్తరంలోని ఆఖరి వాక్యాలే సమీర కళ్ళలో కదలాడి ఆలోచనల్ని రేపాయి.

''కేవలం బయొలాజికల్ నీడ్ కోసమే కాదు...తోడుకోసం... రక్షణకోసం జీవితాంతం...కూడా వుండటానికీ అనుభవాల్నీ అను భూతుల్నీ పంచుకోడానికీ...''

తన జీవితంలో కూడా అలా అనుకునే సమయం వస్తుందా? అనుకుంది—ఇంతవరకూ తనకు పెళ్ళితలపే రాలేదు. తన పెళ్ళిని తన యిష్టానికే వదిలిపెట్టారు నాన్న.

అయితే హైమకు కలిగిన ఆలోచన, ఆ బాధ అప్పుడప్పుడు వంటరి ఆడదానికి కలగడం సహజమేనేమో !

అటువంటి పరిస్థితే తనజీవితంలోనూ ఏర్పడినపుడు తనేం చేయ బోతోంది—? తన ఆలోచనలు తనకే విచిత్రంగా తోచాయి'

ఇంతవరకూ తనే మగవాడినీ ఆ దృష్టితో చూడలేదు తన జీవితంలో

## ఆట కట్టించు

దివ్యమార్తాండంగా జరుపుదామనుకొన్న
తెలుగువారి తొలి పండుగ విచ్చేసింది!
పేదరాలి కోర్కెల జాబితాలా
వేదుపచ్చడి రుచి గుర్తుకు తెస్తున్నారు
తెలియజేయకుండా విచ్చేసిన బంధు వర్గం
తొలి పండగ కానుకల కెదురుచూసే జామాత!
జంట స్వరాలు పలికినట్లు
జంటగా అల్లుడూ, అమ్మాయీ
కానుకల పట్టే విప్పారు
కాదు కూడదంటే వొప్పరు
ఎందుకొచ్చావు ఉగాదీ! నెలాఖరులో
సందడి లేకుండా నిన్నెలా పిలవను!
ముందుగా విందులారగించి
జబర్దస్తీ చేసే అల్లుడి ఆట కట్టించు.

—డా॥ ఆర్. అనంతపద్మనాభరావు

## చైతన్యదీపాలు

తనకు దగ్గరగా వచ్చిన వ్యక్తి కూడ ఎవరూ లేరేమో— ఆ ఆలోచనల మధ్యే నెమ్మదిగా నవీన్ చోటు చేసుకున్నాడు—నవీన్‌తో పరిచయం ఈ మధ్యే స్నేహంగా మారుతోంది—స్నేహంలో యిష్టత, ప్రేమ కూడ వుండొచ్చునా. స్త్రీ పురుషుల మధ్య అటువంటి స్నేహం, యిష్టం ఎటు దారితీస్తాయో ఊహించ లేకపోలేదు—దానిక్కావల్సిన నిగ్రహం విచక్షణా జ్ఞానం తనలో నిండుగానే వున్నాయి.

విజయ సంసారం చక్కబడ్డాక నవీన్ తనకు దగ్గరయ్యాడు. తన కార్యకలాపాలలో పాలు పంచుకోవాలని అభిలషించాడు. ఎన్నో విధాల తనకు సహకరించి తనకున్న కార్యభారాన్ని తగ్గించాడు. తీరికవేళల్లో తను చదివి సేకరించిన, ఎన్నెన్నో పుస్తకాలను యిచ్చిచదవమనేవాడు. వాటిపై చర్చలు లేవదీసేవాడు. కొత్త ఆలోచనలను రేపేవాడు.

అటువంటి ఆ స్నేహం వెనుక నిష్కల్మషమైన హృదయమే కన్పించేది గాని స్వార్థం కన్పించేదికాదు.

రాను రాను నవీన్ మరింత దగ్గరయ్యాడు తన మనసుకు అతను కన్పించకపోయినా అతనిమాట ఒక రోజు విన్పించక పోయినా ఏదో లోటు—

అంతలా అతను దగ్గరవడానికి తనుకూడ కారణమా?
సమీర ఆలోచనలు మరో మలుపు తిరిగాయి.

★ ★ ★

### 24

"ఆలోచించండి సమీరా—మనం తల్చుకుంటే అదో కష్టమైన సంగతేం కాదు—" నవీన్ చెప్పినదంతా విని ఆలోచనలో పడింది సమీర—

'నిజమే స్త్రీలకోసం స్త్రీలే నడిపే పత్రిక వుండటం ఎంతైనా అవసరమే—ఫేషన్లు, అలంకరణలకు సంబంధించిన విషయాలే కాకుండా స్త్రీ హక్కులనూ బాధ్యతలనూ తెలుపుతూ ఆమెలో చైతన్యాన్ని తీసుకు రాగల సమర్థవంతమైన పత్రిక ఆవిర్భవించినట్లయితే అంతకంటె కావల్సిందేముంది? దానికి ఊపిరి, ఉత్సాహంయివ్వగల నవీన్ వెన్నెముకలా వుండనే వున్నాడు. కానీ ఆర్థికంగా తట్టుకోగలగడం సాధ్యమేనా అన్నదే సంశయం.'

"మొదట మన తాలూకాలో వివిధ ప్రాంతాలవారిని కల్సుకుని కొంతమందిని చందాదారులుగా చేర్చుదాం. క్రమేపీ సర్క్యులేషన్ పెంచుకోవచ్చు. ప్రభుత్వ అండదండలుకూడ సాధించగలమనే అనుకుంటాను."

నవీన్ మాటల్లో ఎంతో ఉత్సాహం, కార్యదీక్షా కన్పించాయి సమీరకు. ఏమైనా ఆ విషయంలో మరికాస్త ఆలోచన అవసరమేమో ననుకుంది.

ఆరోజు పోస్ట్‌లో వచ్చిన పర్సనల్ ఉత్తరాల్లో ఓ కార్డు ఆమె దృష్టినాకర్షించింది. కార్డు ఎంతో పాతపడి పూర్తిగా నలిగిపోయివుంది. తన చిరునామాకూడ పూర్తిగాలేదు. ఉత్తరం రాసిన తేదీ స్పష్టంగా లేదు. ఉత్తరం కొంత పెన్నుతోనూ కొంత పెన్సిలుతోనూ రాసివుంది. అక్కడక్కడ కొన్ని అక్షరాలు తడిసి చెరిగిపోయి వున్నాయి. కార్డుక్రింద ఉన్న పేరులోని రెండక్షరాలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. మనసునెవరో కెలికినట్లు బాధపడింది. ఆతృతగా ఆమెకళ్ళు ఉత్తరాన్ని చదవడం మొదలుపెట్టాయి.

ప్రియమైన సమీరకు—

పాట్లాల కాగితంలో నీ గురించి రాసిన ఓ వ్యాసం సగంమాత్రమే చదివి ఆ ఆనందంతో ఆ సమీర నువ్వే అనే ధైర్యంతో యీ...రం... స్తున్నాను. ఈ నిర్భాగ్యురా...ర్తుందా సమీరా. అన్నీ కోల్పోయి జీవచ్ఛవంలా యీ బందిఖానాలో బ్రతుకుతున్నా.... ఇక్కడ్నించి ప్రాణాలో...రాలేను. ఎలాగో యీ ఉత్తరం మాత్రం... ఎవరున్నారు నాకు? నిన్ను చూడాలని... —వాసం...

'వాసంతి!' సమీర మనసు ఆక్రోసించింది.

ఆమె కళ్ళలో నీళ్ళునిండి అప్రయత్నంగా బొటబొట రాలి పోయాయి.

అడ్రసుకోసం వెనక్కుతిప్పింది. వీధిపేరుమాత్రం స్పష్టంగా వుంది. ఊరుపేరు బొంబాయిగా గుర్తించింది.

వాసంతి యింకా బ్రతికేవుందంటే ఆశ్చర్యమనిపించింది సమీరకు. సహజమైన పిరికితనంవల్ల స్త్రీ బ్రతకడానికి సాహసించక ప్రాణాల్నే పోగొట్టుకుంటుంది. మరి యింత నికృష్టంగా బ్రతికేకంటె చావు మేలు కాదా అనే నలుగురినిందా వుంది.

ఏం చేయాలి? వాసంతి నెట్లా రక్షించుకోవాలి? వాసంతిని రక్షించుకోలేకపోతే సంఘసేవికగా తనకున్న కీర్తిప్రతిష్టలన్నీ నిరర్థకాలే.

వాసంతి చరిత్రంతా సమీర ద్వారా విన్న నవీన్, ముందు ఆశ్చర్య పోయాడు. ఆ తర్వాత ఆవేశంతో వూగిపోయాడు. అమాయకపు ఆడ పిల్లలను అపహరించి, వ్యభిచారులుగాచేసి వారి నెత్తుటికూడును తింటున్న నరరూపరాక్షసులపైనా, అటువంటి రాక్షసులనూ దుండగులనూ తన కడుపులో భద్రంగా దాచుకున్న యీ వ్యవస్థపైనా అతనికి చెప్పలేనంత అసహ్యం కలిగింది.

"ఇది మనకొక సవాల్‌లాంటిది సమీరా. వాసంతి వంటి బందీలను ఒక్కరిని విడిపించగలిగినా మన ఆశయం పూర్తిగా సిద్ధించినట్టే. వాసంతిని విడిపించే బాధ్యతనాది." అంటున్న నవీన్‌వంక ఆనందాశ్చర్యాలతో చూసింది సమీర. ఆ చూపులో కృతజ్ఞతాభావంకూడ మిళితమై వుంది.

ఆ మర్నాడే మరోయిద్దర్ని సాయంతీసుకుని బొంబాయి బయల్దేరాడు నవీన్. స్టేషన్‌వరకూ వెళ్ళి వీడ్కోలిచ్చింది సమీర. ఆ సమయంలో అతడు పద్మవ్యూహాన్ని ఛేదించటానికి ఆయత్తమైన అభిమన్యుడిలా కాక ధర్మయుద్ధంకోసం పాంచజన్యాన్ని పూరించిన అవతారపురుషుడిలా కన్పించాడు.

ఆమె కన్నుల్లో అతనిపట్ల ఆరాధనా భావం తొణికిసలాడిందా క్షణాన.

★ ★ ★

## 25

కళ్ళు చెదిరే మెరుపు—గుండెను కదిలించే ఉరుము—

రెంటికీ తట్టుకోలేని పరిస్థితిలో సమీర మనసు శూన్యమైంది—

వెలుగు వెంట వుండే చీకటిలాగే ప్రతివిజయం వెనుకా ఒక ఓటమి పొంచి చూస్తుంటూందా ?

విజయమూ, వీరస్వర్గమూ రెండింటినీ పొందిన నవీన్‌ను ఏమనాలి? మహామనిషి అనాలా, మహర్షి అవాలా? యోధుడనాలా? యోగి పుంగవుడనాలా?

వెళ్ళిన వారంరోజులకు ఓ ఉత్తరం రాశాడు నవీన్. విజయం తధ్యమంటూ—

మరోవారం రోజుల్లో వాసంతి తన కళ్ళముందు నిలిచింది— ఆనందం, ఆశ్చర్యం, ఆవేదన,దుఃఖం—అన్నీ కలగలిసి పోయాయాక్షణాన.

రాక్షసత్వం విజృంభించే వ్యవస్థలో అమాయకపు అబలలు బలై పోవడమంటే యిదే అన్నట్లుంది వాసంతి—

అవి కళ్ళుకావు—దుఃఖంతో నిండిన బావులు—

అది సౌకుమార్యమైన స్త్రీ శరీరం కాదు— వికశించకుండానే దూళిలోపడి నలుగురి పాదాలక్రిందా నలిగిన ఆకృతిలేని పువ్వు.

అది మనసూకాదు— చిల్లుల జల్లెడ.

కౌగిలించుకుని ఏడ్చేసింది వాసంతి—ఆ దుఃఖానికి అవధుల్లేవూ ఆనకట్టలూ లేవు. స్నేహబంధంతో ఓదార్చే ప్రయత్నం చేసినా సమీర మనసూ ఆర్ద్రమైంది· కళ్ళు తడిశాయి. అవి ఆనంద బాష్పాలేకావొచ్చు విజయ సూచకమే కావొచ్చు.

కానీ ఆ విజయపు మెరుపు వెనుక పిడుగులాంటి పరాజయం విన్న పుడు తుపానుకు గురైన ఆకులా అల్లల్లాడిపోయింది

ఎంతో తెలివిగా, వాసంతి ఆచూకీని కనుక్కొని ఆమెను అంత కంటే తెలివిగా ఆ పంజరంలోంచి తప్పించగలిగాడే గాని, అక్కడి దుండగుల పైశాచిక దాడి నుండి తను మాత్రం తప్పించుకోలేకపోయాడు నవీన్.

ఈ పాపిష్టిదాన్ని రక్షించకపోయినా బాగుండేది ఒకసహృదయుడు మిగిలేవాడు' అని వాపోయింది వాసంతి.

ఇది జరిగిన నెలవరకూ మామూలు మనిషి అవలేకపోయింది సమీర—ఆ కలతకి కన్నీళ్ళులేవు గుండెనిండా ఆవేదన,దుఃఖం—మనసులో పశ్చాత్తాపం. ప్రతిక్షణం నవీన్ కదిలికలే ఆ కళ్ళముందు—అతని తెలివైన మాటలే ఆ చెవుల్లో—

తను ఆరాధించి యిష్టపడిన తొలి పురుషుడు నవీన్—మనసు పొరల్లోకి ప్రవేశించి కదిలించిన మనిషి నవీన్.

ఎంత పాపిష్టిది తను? ఎందరి సమస్యల్నో ఇంకెందరిదుఃఖాల్నో పోగొట్టిన తనకు యిదా పరిహారం?

ఆమె కన్నులు చింత నిప్పులయ్యాయి అయినా తమాయించుకుంది—

ఒత్తి కాలిపోతూనే వెలుగును లోకానికి పంచుతుంది

అలాగే

త్యాగధనుల జీవితాలతోనే చైతన్య దీపం ప్రకాశిస్తుందా?

అదే నిజమైతే ఆ కాంతి ప్రసరించి నిలిచినంతవరకూ త్యాగనిరులు చిరంజీవులుగనే వుంటారు

★ ★ ★

## 26

కాలచక్రం తిరుతూనే వుంది—

బాల కౌమార యౌవన దశలను దాటిపోయిందిప్పుడు సమీర—

'స్త్రీ చైతన్య సమాఖ్య'ను నెలకొల్పిన స్త్రీగా, వివిధ మహిళా హిత సంస్థల సభ్యురాలిగా, నవవనితా ఉద్యమ కార్యకర్తగా, ఆంధ్రలోనే కాక దేశ నలుమూలలా కూడా కీర్తి నార్జించిన సమీర యిప్పుడు అతి నిరాడంబరంగా నిస్వార్ధానికి ప్రతీకగా స్త్రీ అభ్యుదయం, స్త్రీచైతన్యం కోసమే జీవనాన్ని సాగిస్తోంది—

ఆమె చైతన్య సమాఖ్య శాఖలు యిపుడు రాష్ట్ర నలుమూలలా వున్నాయి— ఏందరో అందులో పనిచేస్తున్నారు— ఆమె నెలకొల్పిన ఉపాధి కేంద్రాలలో కొన్ని వందల మంది స్త్రీలు జీవిస్తున్నారు— నవీన్ మరణానంతరం స్త్రీల కోసం ఆమె స్థాపించిన 'అబల' పత్రిక తెలుగునాట విశేషాదరాభిమానాల్ని సంపాదించింది— హేతువాదం పట్ల వున్నప్రగాఢ నమ్మకంతో ఆమె రాసిన వ్యాసాలు సంపుటాలై ఆమెను అభ్యుదయ రచయిత్రిని చేశాయి—

ఇవన్నీ ఆమె జీవిత పయనంలో ఎక్కిన శిఖరాలూ సాధించిన విజయాలూ అనుకుంటే అంతకంటే గొప్ప విజయం ఆమె ఎందరి అబలల హృదయాల్లోనో ఆరాధింపబడుతూ నిల్చిపోవడం—

ఆసంతృప్తితోనే, ఆ బలంతోనే ఆమె జీవనాన్ని సాగిస్తోంది—

ఎప్పుడేనా మనసుకూ, తనువుకూ కాస్తంత విశ్రాంతి చిక్కి తన గురించి తాను ఆలోచించినపుడు తల్లి, తండ్రి, బంధువు ఎవరూ లేని ఏకాకిగా మిగిలిపోయినట్లనిపించినపుడూ మనసులోపలి పొరల్లో ఎక్కడో ఓ ఆలోచన కలుక్కుమంటుంది—

జీవితంలోవి అనుభూతిని పంచుకోడానికి మగతోడు అవసరమేనేమోననిపిస్తుంది— అప్పుడామె కళ్ళలో నవీన్ సాక్షాత్కరిస్తాడు— విరిసిన పువ్వులాంటి అతని కన్నుల్లో పసిపాపలు కన్పిస్తారు— ఆ పసిపాపల నవ్వుల్లో కోటి వెలుగులు కనిపిస్తాయి

ఆ వెలుగులకావల శాంతి కపోతాల నెగరేస్తూ చైతన్య దీపాల్లాంటి ఆడపిల్లలు కనిపిస్తారు !

(అయిపోయింది)

# పునరపి....!

- వజ్ఝల కాళిదాసు

## ప్రభాత భామాసుందరి

రహో విరహ రాగంతో
ఎరుపెక్కిన తన చెక్కిలిపై
విరబూసిన గులాబి రేకుల
తూరుపు మలపై నుండి
తుహిన మధు బిందు
సహితంగా
విశ్వముపై
విసురుతున్నది

★ ★

అహస్సుందరి, దినరాజు
అస్తమించినంతనే
మందార మాలలు ధరించి
కాషాయాంబరం బిగించి
పశ్చిమ మహా సాగరంలోని
బడబాగ్నిలో దూకి
సహగమనం చేస్తున్నది !

ఒక మహాకాంతి పుంజం
—విశ్వవ్యాప్తమైన వెలుగు
నశించినంతనే
ఆవరిస్తుంది అంధకారం !
అదే సమయం అని
అనంతాకాశం నిండా
ఆవిర్భవిస్తాయి
అసంఖ్యాకంగా
చుక్కలు !
చుక్కలు... ...చుక్కలు......
ఎక్కడ చూచినా చుక్కలు
చక్కని చుక్కలు !
నన్ను చూచి......నన్నే చూచి
కన్నుగీటు తున్నాయి
సన్నగా......సన సన్నగా
కను సన్న చేసి
చిన్నగా......చినచిన్నగా
చిరునవ్వు పూసి

కన్నుగీటుతున్నాయి
వెన్ను తట్టుతున్నాయి !
కాదు...కాదు...కా...దు
వెక్కిరిస్తున్నాయి—
వేళాకోళంగా
ఈసడింపుగా
కనికరింపుగా
సానుభూతితో
అంటున్నాయి—
"ఓ మానవుడా
ప్రతిక్షణం నీ కళ్ళముందే
జరుగుతున్నదాన్ని
అర్థం చేసుకోలేని
ఆశాజీవీ,
తెలుసుకో సత్యాన్ని
పునరపి జననం
పునరపి మరణం
ప్రకృతి లక్షణం!"

# వారఫలం

**15-3-1985 శుక్రవారం మొదలు**
**21-3-1985 గురువారం వరకు.**

★ **మేషం :** నూతన వ్యాపారం లాభదాయకమా? బాగా శ్రమించవలసిన సమయం. బాగా అజమాయిషీ చేసి లాభం సంపాదించతగిన సమయం. అడపాదడపా పొరపాట్లు జరిగాయని బాధపడేదానికన్నా జాగ్రత్తగా మెలగుట న్యాయం. స్త్రీలకు : శుభకార్యానుకూలత, స్వల్పాదాయం.

★ **వృషభం :** నూతన వ్యాపారం బాగా సాగుతుందిగా. మీ కిప్పుడు 'జాయింట్' వ్యవహారం పనికిరాదు. స్వశక్తితో కార్యరంగంలో దిగటం శ్రేయస్కరం. మీయింట శుభం జరిగే అవకాశమున్నది. కోర్టు వ్యవహారమందు, ధాన్య సేకరణయందు మీకు అనుకూల సమయం. స్త్రీలకు : ఉద్యోగమందు ఆశించిన 'ప్రమోషన్' లభిస్తుంది.

★ **మిథునం :** దూర ప్రాంతాల నుండి అనుకూల వార్తలు వింటారు. ఉత్తరాల మూలంగా అనేక విషయాలు తెలిసికొంటారు. బహుశా అవి వ్యాపార సంబంధం మైనవికావచ్చు. విరోధు లున్నారుగా! గమనించి మసలుకోవాలి. స్త్రీలకు . క్రొత్త బట్టలు కొనటం, శుభకార్యా చరణం.

★ **కర్కాటకం :** బాగా వయసు మీరినవారు ఆరోగ్య విషయంగా జాగ్రత్తపడాలి. సాహితీరంగాన శ్రమించేవారికి యిది అనుకూల వారమని గ్రహించాలి. మీరు సేకరించిన ధాన్య, వస్తుసేక రణ విక్రయమందు మంచి లాభం గడించనున్నారు. స్థిరాస్థి విషయంగా శ్రమించుట అవసరం. స్త్రీలకు : ఉద్యోగ వృత్తులందు ప్రగతి సూచితం.

★ **సింహం :** శారీరకంగా జాగ్రత్తపడుట అవసరం. ఎంతో కాలంగా ఆలోచనయందున్న ఒకానొక వ్యవహారం సానుకూలపడగలదు. ధనవంతుల సాయం లభ్యం కాగలదు. స్థిరాస్థి పెంపు చేయగల అవకాశం ఏర్పడుతుంది. వృత్తియందభివృద్ధి చేకూరుతుంది. స్త్రీలకు : అత్యవసరంగా కొందరికి ప్రయాణం తగలవచ్చు. కొందరకు కీచులాటలతో కాలం వ్యర్థం.

★ **కన్య :** ఎవరు మనకు కావలసినవారో, ఏ వ్యాపారం ఫలదాయకమో, ఎవరి సాంగత్యంవలన మేలు చేకూరుతుందో గమనించి మెలగటం న్యాయం. ఎంత ఓర్పుతో సంచరిస్తే అంత మేలున్నది. సజ్జన సాంగత్యం లబ్బం వృత్తియందు వికాసం. స్త్రీలకు : ఇటీవల ఆశవదులుకొన్న ఒకానొక వ్యవహారం మరలా మీ కనుకూలంగా బయట పడుతుంది. ఉద్యోగంలో కనిపించిన అవరోధాలు తొలగిపోగలవు. గమనించండి.

★ **తుల :** వ్యవహారంలో మీకే అనుకూలం. పరిశ్రమలో ప్రగతి కనిపిస్తుంది. కోపం ఎక్కువ కావటం అందుకు మతిమరపు తోడుకావటం జరుగుతుంది. అందుమూలాన మీ వస్తువులు ఏవైనా పోగొట్టుకొంటారేమో! జాగ్రత్త! స్త్రీలకు : మీ శ్రమకు తగిన ఫలితం అందుతుంది. రాజ కీయంగా అనుకూలం లభించిందిగా.

★ **వృశ్చికం :** ఆదాయం అప్రయత్నంగా లభించగలదు. ఎంతో కాలంగా రాని డబ్బు హటాత్తుగా చేతి కందుతుంది. రాజకీయంగా మేలు జరిగి ఉండవచ్చు. ప్రతిభ రాణించే అవకాశం ఏర్పడుతుంది. స్త్రీలకు : కుటుంబానందం, సుఖ శాంతులు, కించిత్తు ధనాదాయానికి అవకాశం.

★ **ధనుస్సు :** స్తోత్రప్రియులను, అవకాశవాదులను, ఓర్పు తక్కువ వారిని దాపునకు రానీయకండి. వస్తుసేకరణకు అనుకూలం. కళారంగంలో ప్రగతి కనిపిస్తుంది. ప్రత్యక్షంగా అపకారమేదీ జరుగదు గాని అమిత జాగ్రత్తగా ఉండతగిన వారం. స్త్రీలకు : సుఖ శాంతులు, కుటుంబానందానికి అవకాశ మున్నది.

★ **మకరం :** అమూల్య వస్తువులు సేకరించుకో గలుగుతారు. ఎంతో కాలంగా చేసే వ్యాపారంలో ఏమంత మేలు కనిపించలేదే అని బెంగపడతారు. అనవసరం, అనుకూల సమయం సమీపంలో ఉన్నది. ఉద్యోగమందు పై అంతస్థుకు పోగల అవకాశా లున్నాయి. వారాంతంలో శుభ వార్తా శ్రవణం, ఆదాయం, ముఖ్యుల కలసికొనే అవకాశం. స్త్రీలకు : ఇంట ఏదో మేలు జరుగనున్నది.

★ **కుంభం :** ఒకానొక కార్యంలో సులభంగా విజయం సాధింపనున్నారు. బంధు వర్గంతో సంభాషణలకు, శుభకార్య ప్రస్తావనలకు యిది అనుకూల సమయం. కానివారిని ఒక కంట కనిపెట్టి మసలుకోవాలి. స్త్రీలకు : ఆశించిన ప్రగతి ఉద్యోగమందు చెప్పదగిన కాలం. సంఘసేవా పరాయణత్వంలో సర్వానుకూలతకు, రచనా విధానాన అనుకూలానికీవారం శ్రేష్టం.

★ **మీనం :** కథకులకు, గాయకులకు, రంగస్థల, చిత్రరంగస్థల నటులకు, యింతెందుకు, కళలందు నేర్పరులకు మంచి అవకాశాలు లభ్యమయి, ధనలబ్ధి గలదని గ్రహించి, శ్రమించండి. స్త్రీలకు : ప్రత్యేకంగా చెప్పదగ్గ అంశం లేకున్నా రచనా విధాన మాత్రం ధనలబ్ధి.

**–విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి**

# వ్యక్తిగతం



డాక్టర్ నాగేంద్ర సింగ్(71) హేగ్‌లో ఉన్న అంతర్జాతీయ న్యాయస్థానానికి అధ్యక్షుడిగా ఎన్నికైన మొట్టమొదటి భారతీయుడు. ఐక్యరాజ్య సమితికిచెందిన ప్రధాన న్యాయవిభాగం అయిన ఈ ప్రపంచ న్యాయస్థానానికి ఈయన 1976 నించి 79 వరకూ ఉపాధ్యక్షుడిగా ఉన్నారు. 1973లో అంతర్జాతీయ న్యాయస్థానంలో ప్రవేశించిన డా. సింగ్ అంతకు ముందు 1966 నుంచి 1972 వరకూ భారత రాష్ట్రపతికి కార్యదర్శిగా పనిచేశారు. కొంత కాలం పాటు ప్రధాన ఎన్నికల కమీషనర్ పదవిని నిర్వహించారు. 1973లో ఈయన పద్మ విభూషణ్ అవార్డుని అందుకున్నారు. డా. సింగ్ రాజస్థాన్‌కి చెందిన దున్‌గార్‌పూర్ రాజకుటుంబానికి చెందినవారు ...☐



భారతదేశంలో కె.జి.బి. గూఢచారుల చర్యలని బయటపెట్టడానికి అవిశ్రాంతంగా పోరాడుతున్న వ్యక్తి, ఢిల్లీ బి.జె.పి. ఉపాధ్యక్షుడు, ప్రముఖ న్యాయ వాది ప్రేమ్ లాల్ శేఖి తమ పార్టీ పదవికి రాజీనామా చేసి శ్రీమతి ఇందిరా గాంధీని హత్యచేసిన ఇద్దరిలో ఒకడైన సత్వంత్‌సింగ్ తరఫున వాదించడానికి వకాల్తా పుచ్చుకున్నారు ... ☐

# శ్రీ కృష్ణసతి రుక్మిణీదేవి ఆంధ్రదేశ వాసియా!

శ్రీమద్భారత భాగవత పురాణ నాయకుడైన శ్రీకృష్ణ పరమాత్మ పట్టపుదేవి, పతివ్రతా శిరోమణి రుక్మిణీదేవి యనుట అక్షరాస్యులైన వారి కందరికి సువిదితము. ఆమె విదర్భరాజకన్య యనియు నిర్వివాదాంశము. కాని ఈ విదర్భ ఎక్కడిదో విపులముగ కనపడదు. సాధారణముగ ఉత్తరహిందూస్థానీయురాలను ఒక ప్రథ కలదు. ఏలనన బొంబాయి రాష్ట్రములో "విదర్భ" యను పేరుతో ఒక దేశమున్నటుల కనబడుచున్నది. అందువలన ఆ విదర్భయే ఆమె జన్మస్థల మన్నట్లు వినికిడి. కాని లోతున విచారించినపుడు ఆమె ఆంధ్ర దేశీయురాలని, విదర్భయనునొక ప్రదేశమాంధ్రదేశముననునట్లు కనబడుచున్నది. ఆ విదర్భవాసులు ఈనాటికిని రుక్మిణీదేవి తమ ప్రాంతపు కన్యయని భావించు చుండుటయు గమనార్హము.

ప్రస్తుత మహారాష్ట్ర ప్రదేశమునకు ముఖ్య పట్టణమైన బొంబాయి సమీపమున ఒక 'విదర్భ' యనునదికలదు ఆంధ్రదేశమునను ఒక 'విదర్భ' యున్నది. ఈ విదర్భయు ఈనాటి వారి సృష్టి కాక అనాది నుండియు యుంటున్నది. ఒకే పేరు గల దేశములు రెండుండగలవా యనునది ప్రశ్న. ఈ ప్రశ్నకు సమాధానము మొన్న మొన్నటి వరకును భారతదేశమున కిరువైపులను పాకిస్థాన ముండియుండుటయే తార్కాణము. ఈనాడు మనము బాంగ్లాదేశమనునది ఒక నాటి తూర్పు పాకిస్తానమేకదా! కావున విదర్భదేశీయులు ఈ రెండు చోట్లలోను ఆ నాడుండి యుండునని భావించుటలో కలుగు విప్రతిపత్తి కనబడదు. బొంబాయి రాష్ట్రములోను, ఆంధ్ర రాష్ట్రములోను ఈ రెండింటియందును విదర్భీయులు తమ దేశమును కలిగి యుండి యుండ వచ్చుననుటలో సందేహము కనబడదు.

## తెలుగు సంవత్సరాది

తెల్లవారితే ఉగాది
తెలుగు సంవత్సరాది.
వసంత వాటికలో
ఉగాది కన్య కాలిడగానే
ప్రకృతి కోయిల పాడింది
పూలు పులకరించాయి॥

లేచిగుళ్ళు తలలెత్తగా
పచ్చని పందిరిగా దోచె
ధాన్యరాశి ఇల్లు జేర
రైతు జంట మురిసి పోయె॥

ఉగాది పచ్చడి చేదు
తియ్యదనాల నిజం
జీవన యాత్రలో
సుఖదుఃఖాల సహజం॥

రంగు రంగు పూల
రంగస్థలిగా దోచె భువి.
నవ వధువులా ముస్తాబై
ఉగాది కన్య విచ్చేసె॥

పిండి వంటలతో కలసి
పండుగ చేసుకుందాం రండి—
ఉన్నవాడు లేనివాడు
పంచుకుని బ్రతుకుదాం లెండి॥

నిజమైన ఉగాది మనకు
నిరుపేదకూ దక్కిననాడే
తెల్లవారితే ఉగాది
తెలుగు సంవత్సరాది॥

—కాణిపాకం లింగన్న

రుక్మిణీదేవి జన్మించినది విదర్భరాజ్యమునకు సంబంధించిన "కుండిన గరము" అని గ్రంథాధారము. ఈ కుందిన నగరము గుంటూరు జిల్లాలో కొండవీటి సీమలోనిదని ఒకనాటి పెద్దలనుండి, ఈనాటి వారుకూడ శ్రీకృష్ణసతియైన రుక్మిణీదేవిజన్మ స్థలమని అనువంశికముగ భావించు చునేయున్నారు. వ్యాఖ్యాన కారులు కూడా "అత్రాఽన్తర్వ్యూత ఏవ కుండిన నగర దేశ ఇతి బహావృద్ధ జనవాదమనుసృత్యేవ ముక్తం" అని తెలియచేసి యున్నారు.

శ్రీకృష్ణభగవానుడు రుక్మిణీదేవిని ద్వారక నుండి తీసికొనిపోవుటకు ఆంధ్ర దేశము చేరుటకు ఒక్కరాత్రిలోనే చేరినాడని భాగవతమున తెలియచేసిన దానికి సమన్వయ మెట్లు కుదరగలదు? ద్వారకకు దగ్గరనుండు.బొంబాయి రాజధానిలోని విదర్భదేశము నందే రుక్మిణీదేవి పుట్టియుండిన, ద్వారకనుండి అచటికి అంత త్వరగ రాగలిగెదరేమో! అను విషయమున భాగవతకారుడు వ్రాసిన వ్రాత లీరీతిగ కనబడుటయే సమాధానము.

" అత్యంత బాల్యమునందే తండ్రియగు నందుని వరుణలోకమునుండియు, విద్యాభ్యాసము పూర్తిగావించిన క్రొత్తలలోనే గురువు పుత్రుని యమలోకము నుండియు, అనతి కాలములోనే

తెచ్చి'' యున్నట్లున్నది. అట్టి పరమాత్మ యైన శ్రీకృష్ణునకు మంచి యవ్వన సమయమున భూలోకములోనే యుండిన ద్వారక నుండి కొంత దూరమున నుండిన యాంధ్ర దేశాంతర్గతమైన విదర్భ దేశమున కొక్క దినములో వచ్చుటకు సందేహముండ నవసరము లేదు కదా !

విదర్భ దేశము ఆంధ్ర దేశాంతర్గతమే నను టకు కొండొక కారణము గమనించుడు. అవతారాదిగ నవతారాంతము వరకును శ్రీ కృష్ణుని చర్యలను (లీలలను) పరికించినచో అవన్నియును శ్రీ రామావతారము లీలలకు కేవలము తల క్రిందులుగ నుంటున్నవి. ఒకరు సూర్య వంశము కాగా మరొకరు చంద్రవంశ సంభవుడు. ఒకరిది శుక్ల పక్ష జన్మ, మరొకరిది కృష్ణపక్షము. ఒకరు సరిగా మధ్యాహ్నసమయమునకాగా మరొకరు సరిగ అర్ధరాత్రి నిశిసమయము. రాంజాంత: పురపుట్టుక యొకరిది, ఇంకొకరిది కారాగార ప్రదేశము. ప్రసిద్ధ వృద్ధిగ నొకరుండగ ప్రచ్ఛన్నవృద్ధిగ మరొకరుంటుండిరి భూపాలత్వ మొకరికుండగా, గోపాలత్వము మరొకరిది కదా ! ప్రభుత్వ గాంభీర్యశాలిత, దూత్య, సారథ్యయుక్తత, మొదలైన వెన్నోయున్నను. అవన్నియు పాఠకుల కెరుకయే యని నాభావన.

భార్యా విషయమునను భేదములేయున్నవి ఒకరు అనన్యదత్తా జానిత్వంకాగా అన్యారర్థిష్ట పతిత్వము. ఏకపత్నీ వ్రతులొకరు బహుపత్నాశాలిత్వమొకరిది. బ్రాహ్మ వివాహమొకరిది కాగా రాక్షస వివాహమింకొకరిది. వీటియందు స్వభాషా జాతి స్త్రీ జానిత్వము, అన్యవాగ్జాతి స్త్రీ పతిత్వమున్నూ కలవన్నుట నగ్నసత్యము. ఈ విషయమునే ఒక పండితుడిరీతిగా ప్రతి పాదించి యున్నారు.

''శ్లో'' స్వభాషా జాతి స్త్రీ జాని యన్య వాగ్జాతి స్త్రీ ధవం రామం దాశరథిం కృష్ణం వాసుదేవం నమామ్యహం॥''

అందువలన లక్ష్మ్యవతారము, పట్టపుదేవి యునైన రుక్మిణీకన్య నారాయణా వతారమైన శ్రీ కృష్ణుని కన్నను అన్యదేశ భాషా జాతగనేయుండియుండ వచ్చును అట్లైనచో రుక్మిణి ఆంధ్ర దేశమందు కాక కృష్ణ జన్మదేశమున కన్నను భిన్నమైన మరేదేశమందైనను నవతరించియుండ వచ్చునుగదా యన్నచో:— అట్టివాదము ఇతరత్ర యొచ్చటను నున్నట్లు కనబడదు. ఒక్క ఆంధ్ర దేశముననే తరతరములనుండి పూర్వులనుండి ఇప్పటి వరకు పెద్దలగు వారు చెప్పుచున్నారు కనుక రుక్మిణిదేవి పుట్టినిల్లు యాంధ్ర దేశమే నగుట సకల వృద్ధ జనసమ్మతమై యున్నది.

రుక్మిణీ జన్మించినది ఆంధ్రదేశం తస్థిత విదర్భ దేశమునందేనని యావదాంధ్ర దేశమునందలి విజ్ఞులు తెలియ చేసెదరనుటకు ... కృష్ణా గుంటూరు మండలములోని ఈనాటి వృద్ధులను ''ఇచటనే రుక్మిణీ పుట్టినది'' యనితెలుపుదురు ఈ విషయమును ప్రప్రథమమున చెంగల్పట్టు జిల్లాలోని వారును శతాధిక గ్రంథకర్తలు, మహామహోపాధ్యాయాద్యనేక నేరుదాంచితులునైన శ్రీ మాన్ విక్రాల రాఘవాచార్యుల వారును గ్రంథ స్థము గావించియుండిరి. వారి సమకాలీయులైన శ్రీ రాళ్ళబండి నారాయణమూర్తి గారును ఆనాటి ''ఆంధ్రభూమి'' యందును తెలియచేసి యుండిరి ప్రకృతము కానందు.. రుక్మిణి జన్మ విషయమును వదలినను బ్ర.శ్రీ గురజాడ శ్రీ రామమూర్తిగారు (విశాఖ మండల వాసులు) తమ కవి జీవితములలో ''విదర్భదేశము కృష్ణాజిల్లాలోని''దని స్పష్టముగ వ్రాసిన దాని కన్న మిన్నయైన ప్రమాణ మవసరమా !

— డా. టి. ఆర్. కృష్ణన్

## ఇ'వేమన'పద్యాలు




ఇహమునందు బాధ లెంతైన పడుదురు
యముని బాధదలచి యరయలేరు
పరుల బాధలేక బ్రతుకుడీ నరులార
విశ్వదాభిరామ వినురవేమ.

# శ్రీ సర్వేశాయి తిరుమలరావు!

తిరుమలరావుని గురించి సాహితీ సుగతులకి ప్రత్యేకించి చెప్పవలసిన అవసరంలేదు. ముఖ్యంగా 'భారతి' చదివేవాళ్ళకి, రాసేవాళ్ళకి ఆయన గురించి తెలిసే వుంటుంది.

కరణం గిరీ చేసే మాధ్వదేశస్థ బ్రాహ్మణుని ఇంట ఆదోని తాలూకాకి చెందిన బొమ్మరాపురం అనే గ్రామంలో 1928లో ఈయన పుట్టారు. అనంతపురం కాలేజిలో బి. ఎస్సి. డిగ్రీ పుచ్చుకొన్న ఈయన 1951-53లో పిలానిలోని బిర్లా కాలేజిలో ఎం. ఎస్సి డిగ్రీ పుచ్చుకొన్నారు. రసాయనిక శాస్త్రంలో ఉపన్యాసకునిగా ఒక సంవత్సరం పాటు మైసూరు మహారాజా కళాశాలలో పని చేసి, 1954 మధ్యలో అనంతపురం తైల సాంకేతిక పరిశోధనా సంస్థలో పరిశోధకునిగా చేరారు. ఈ సంస్థ డయిరెక్టర్‌గా 16 ఏండ్లు ఉండి, 1983 జూలైలో రిటరయినారు. అవివాహితులు. చివరికి ఉపనయనం కూడ చేసుకోలేదు!

వృత్తిపరంగా అంతర్జాతీయ ప్రశస్తిని అందుకొన్నారని చెప్పవచ్చు. హిల్డిచ్, బెయిలీ, ఎకీ, కాపెమన్ వంటి తైల పరిశోధకుల కృషితో రావు కృషి సరితూగ గలదు. వాటిలోనే గాక రాశిలోనూ ఈయనదే పై చేయి! 400 పరిశోధనా వ్యాసాలని, 11 పేటెంట్లని, 800కి పైగా సాంకేతిక వివరణలని అందించిన తిరుమలరావు తొమ్మిదిసార్లు జాతీయ అవార్డులని అందుకొన్నారు. వరితవుడు నుంచి వంట నూనెని తీయడానికి అతి సులువైన పద్ధతి చెప్పింది ఈయనే!

సాహిత్య విమర్శ పట్ల ఈయనకున్న అభిరుచి లోతైనదే కాక, గట్టిది కూడా! కన్యాశుల్కం, శివభారతంలపై చేసిన విమర్శలని చూస్తే ఈ విషయంలో స్పష్టంగా అవగాహనకి వస్తుంది. "భారతి"కి ఈయన రాసిన విమర్శలు చదువుతూ



1962 నాటి ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీ నగేష్‌తో సర్వేశాయి తిరుమలరావు!

వుంటే ప్రాక్పశ్చిమ సాహిత్యాలని ఆయన ఎంతగా ఆపోసనపట్టారో అర్థమవుతుంది. పత్రికలకి రాసే ఉత్తరాలలో ఈ ధోరణి వెల్లడి అవుతుంది.

వ్యక్తిగతంగా సహృదయులు. నిరాడంబరమైన జీవనాన్ని గడుపుతూ తనకి తోచిన సహాయం చేస్తూ ఉంటారు. అతిథులపట్ల ఈయన కనబరచే ఆదరణా, ఆత్మీయతా తలచుకొన్నప్పుడెల్లా కళ్ళలో నీళ్ళని తెప్పిస్తాయి. సబ్బు అనిష్టం అన్నది ఈయన అభిమతం. అంతా షామ్ అని కొట్టి పారివేస్తారు. అయితే అన్నింటిని చదివి ఆకళింపుకోవాలని చెబుతారు.

"భూమి మనకు చెందదు. మనమే భూమికి చెందెదము. విశ్వంభర క్షేమమే మానవ వ్రతత" – ఇదీ ఈయన భావన. సమ సమాజం రావాలని కోరుకొనే వారిలో ఈయన కూడా ఒకరు. "స్నేహంతో రత్న ద్వీపంపతి వెలుగుదే జవితం సత్యమునకే జయము కావలె. సత్యమే జయము" – ఎంత చక్కటి మాట!

"చిరంజీవి ననుకొని విద్య నేర్వవలెను ఎప్పుడు మరణింతునో అనునట్లు దానము చేయవలెను" – ఎంత గంభీరమైన భావం! వ్యాకరణ దోషాలు లేనిభాషని రాసే లౌకిక కశ్మలాలు లేని సాధువు ఈయన!

"కాలము పురతి క్రమము. చరైవేతి చరైవేతి ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరాన్ని బోధతా" – ఎవరికైనా ఆయన చెప్పే మాట ఇదే!

– డా. గుమ్మనూరు రమేష్‌బాబు

# సినిమా విశేషాలు

—జి వి జి

## "జై భేతాళ" 3-డి జానపద చిత్రం

"చిన్నారి చేతన—3డి చిత్రం తాలూకు నవోదయా యూనిట్‌వారి సాంకేతిక సహకారంతో తీస్తున్నాం," అన్నారు విశ్వచిత్ర ప్రొడక్షన్స్ అధినేత జి ఆర్ కె రాజు పై జానపద చిత్రానికి బి విఠల ఆచార్య కథ, స్క్రీన్‌ప్లే పర్యవేక్షణలో ఆయన పుత్రుడు బి వి శ్రీనివాస్ దర్శకత్వం వహిస్తున్నారు ఫిబ్రవరి 14 నుంచి 20 వరకు మొదటి షెడ్యూల్ జరిగింది మాధవి, నరసింహరాజు, శ్యామలగౌరి, అల్లురామలింగయ్య, జీవా, నాగేష్, టెలిఫోన్ సత్యనారాయణ ప్రభృతులు పాల్గొంటున్నారు కర్పూరపు ఆంజనేయులు సంభాషణలు, చక్రవర్తి సంగీతం, డబ్లు ఆర్ చంద్రు ఛాయ, నాగరాజన్ శిల్పం, వెంకట రత్నం కూర్పు, జయకృష్ణారావు సహకార దర్శకత్వంతో కపిల నాగేశ్వరరావు నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు మార్చి 13 నుంచి ఏప్రిల్ 30, మే 8 నుంచి 20 వరకు జరిగే తదుపరి షెడ్యూల్స్‌తో చిత్రీకరణ ముగుస్తుందని నిర్మాత తెలిపారు

## మార్చిలో "దేవాలయం"

"మూఢ నమ్మకాలపై ఒక ప్రయోగంగా, ఆస్తికత్వం-నాస్తికత్వాల మధ్య పోరాటంగా సెంటిమెంట్, కామెడీ, డ్రామా వగైరాలన్నీ కలిపి రూపొందించాం ఇది వరకు శోభన్‌బాబును గ్లామర్ పాత్రల్లో చూస్తూ వచ్చిన ప్రేక్షకులు ఈ చిత్రంలో అపూర్వమైన పాత్రను చూస్తారే గాని శోభన్‌గా చూడరు మొత్తంమీద ఇది సీరియస్ చిత్రం మాత్రం కాదు ఇంకో విశేషం ఉత్కృష్టమైన మానవరూపం కోసం భగవంతుడు పడ్డ తపనే దశావతారాలనే సరికొత్త వాదనను విశదీకరించడానికి అధిక వ్యయ ప్రయాసలకోర్చి చక్కని టెక్నిక్‌తో దశావతారాలను చిత్రీకరించాం," అన్నారు కృష్ణ ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో శోభన్‌బాబు ప్రధాన పాత్ర నిర్వహిస్తూ సమర్పించే శ్రీనికేతన్ ఆర్ట్ క్రియేషన్స్ "దేవాలయం" ప్రముఖ పంపిణీదారుడు వై హరికృష్ణ ఆధ్వర్యంలో ప్రతిష్టాత్మకంగా తయారైంది విజయశాంతి, జె వి సోమయాజులు, రావు గోపాలరావు, పి ఎల్ నారాయణ, రవికాంత్, రాజా, వేలు,నర్రా వెంకటేశ్వరరావు, చిట్టిబాబు, గరగ, ఏచూరి, యర్రంనేని చంద్రమౌళి, హరనాథరావు, శశికళ, అన్నపూర్ణ, దేవి, అత్తిలి లక్ష్మి నటించారు జాన్సన్, హరనాథరావు సంభాషణలు రాశారు చక్రవర్తి సంగీతం, రవికాంత్ ఛాయ, తోట శిల్పం, చౌదుల కూర్పు, ముత్యాల సుబ్బయ్య సహ దర్శకత్వంతో రామకృష్ణారెడ్డి ప్రొడక్షన్ డిజైనర్ తాతినేని సదాశివరావు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ నర్రా కోటయ్య ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ బి లక్ష్మి, వై రాజ్యలక్ష్మి నిర్మాతలు మార్చి చివరివారంలో విడుదల

## కె.ఎస్.రెడ్డి దర్శకత్వంలో కె. మహేంద్ర నిర్మించే "ఢాకూ రాణి"

"చక్కగా శిక్షణ ఇవ్వబడిన 6 జాగిలం ఈ చిత్రంలో ప్రత్యేకంగా కనిపిస్తుంది ఏప్రిల్‌లో షూటింగ్ ప్రారంభించి జూన్‌లో పూర్తి చేస్తాం," అన్నారు కె మహేంద్ర ఈయన "బందిపోటు రుద్రమ్మ" అనంతరం కె ఎస్ రెడ్డి దర్శకత్వంలో నిర్మించే "ఢాకూ రాణి" చిత్రానికి పేరాల స్క్రిప్ట్ తయారు చేస్తున్నారు ఈ సంవత్సరాంతంలో సుమన్ హీరోగా కె మహేంద్ర మరో చిత్రాన్ని నిర్మిస్తారు



వందేమాతరం లో విజయశాంతి



శోభన్‌బాబు దేవాలయం లో



బాలకృష్ణ, సుమలత, "కత్తుల కొండయ్య"లో

## "అమెరికా అల్లుడు"లో కస్టమ్స్ వారితో కష్టాలు

కస్టమ్స్ ఉద్యోగి పాస్‌పోర్టు చూపించమని బామ్మ (సూర్యకాంతం)ను ఇంగ్లీషులో అడిగాడు అది అర్థం కాలేదామెకు పక్కనున్న అప్పారావు "అదే బామ్మా! నీ బొమ్మ అంటించిన బుక్కు ఉందిగా? అది వాళ్ళ మొహాన తగలెయ్యి చూసిస్తారు" అన్నాడు

"ఒరే, ఒరే! నేనిక్కడుండగా నన్ను చూడొచ్చుగా? బొమ్మ బుక్కు దేనికి?" అంది బామ్మ.

"అమెరికాలోని పద్ధతి నీకు తెలియదు బామ్మా! ఇలా ఇయ్యి," అంటూ అప్పారావు పాస్‌పోర్టు తీసుకుని, ఆ ఉద్యోగికి చూపించాడు దాన్ని ఆ ఉద్యోగి చూసి, పక్కనున్న మూటను చూపిస్తూ, "వాట్ ఈజ్ దిస్ బండిల్?" అన్నాడు

"అమ్మ వీడి దిష్టి కళ్ళు దీని మీద పడ్డాయి!" అని బామ్మ లోలోన తిట్టుకుంటూ, పైకి "చస్తే చూపించను," అంది

"చూస్తే ఏంపోయింది బామ్మా వాడికి నోరూరుతుంది" అంటూ అప్పారావు "సార్, దిస్ ఈస్ మేంగో పికిల్," అన్నాడా ఉద్యోగితో

"ఏడిశాడు చచ్చినా చూపించను ఇది విప్పాలంటే వీడి తల్లో జేజమ్మ దిగి రావాలి ఒరే, అప్పిగా! వాడితో నువ్వు కుమ్మక్కయిపోయి కూతలు కూస్తున్నావు," అని బామ్మ అంటూండగా ఆ ఉద్యోగి సంచీలోని విబూది తీసి నోట్లో వేసుకుని, ప్రమాదకరమైనవి ఏవీ లేవని తేల్చుకున్నాక "యు కెన్ గో," అన్నాడు

బామ్మకు అరికాలిమంట నెత్తికెక్కింది "వీడికేం పోయే కాలం విబూది తింటాడు? వచ్చే జన్మలో అడుక్కుతింటాడు దరిద్రపు వెధవల్లారా? మీ చేతులు పడిపోనూ ఊళ్ళో కొచ్చే వాళ్ళ సామాన్లు విప్పేయడం సరదానా మీకు? ఈ వెధవ పని చేయడానికి కోట్లూ, బూట్లూ కూడానా?" అంటూ మూటా ముల్లేతో బయటపడింది

సుమన్ హీరోగా కె వాసు దర్శకత్వంలో డాక్టర్ వేమూరి రమేష్‌బాబు నిర్మించిన చికాగో ఫిలిమ్స్ "అమెరికా అల్లుడు" మార్చి విడుదల

## ఎ.ఎన్.ఆర్, కోదండరామిరెడ్డి కాంబినేషన్‌లో "దాంపత్యం"

"ఏ ఎన్.ఆర్ సరసన జయసుధ, సుహాసిని హీరోయిన్‌లు," అన్నారు ఎ కోదండరామిరెడ్డి ఈయన దర్శకత్వంలో చదలవాడ తిరుపతిరావు సమర్పించే అనూరాధ ఆర్ట్ కంబైన్స్ "దాంపత్యం" చిత్రం త్వరలో విడుదలవుతుంది మురళీమోహన్, గుమ్మడి, ఈశ్వరరావు, రాజ్యలక్ష్మి, తులసి ఇతర ముఖ్య భూమికలు నిర్వహించారు. సత్యమూర్తి రచన, చక్రవర్తి సంగీతం, నవకాంత్ ఛాయ, సలీమ్ నృత్యాలు, వెంకటరత్నం కూర్పుతో ఆర్ వి కృష్ణారావు నిర్మాత



చంద్రమోహన్, తులసి, "ముచ్చటగా ముగ్గురు"

## డి. రామానాయుడు సమర్పించే "ముచ్చటగా ముగ్గురు" మార్చి విడుదల

''నా దృష్టిలో వినోదం లేకపోతే పిక్చర్‌లో రిలీఫ్ ఉండదు. రిపీట్ ఆడియన్స్ ఉండరు. వినోదంతో పాటు ప్రయోజనం ఉండడంకూడా ముఖ్యమైనదే. చిత్రాలను ప్రజల కోసం తీస్తున్నాం గనుక, వారు మెచ్చే విధంగా తియ్యడమే సమంజసమైనదీ; సబబైనదీ. ఈ లక్ష్యంతోనే ఈ హాస్య ప్రధాన చిత్రాన్ని తీశాను,'' అన్నారు ఎస్. ఎస్. క్రియేషన్స్ అధినేత యార్లగడ్డ సురేంద్ర. ఈయన నిర్మాతగా డి. రామానాయుడు సమర్పించే పై చిత్రంలో చంద్రమోహన్, తులసి, పూర్ణిమ, అల్లు రామలింగయ్య, నిర్మల, రమాప్రభ, వీరభద్రరావు, రాజేంద్ర ప్రసాద్, నూతన్ ప్రసాద్ పాల్గొన్నారు. డి. వి. నరసరాజు సంభాషణలు, చక్రవర్తి సంగీతం, హరనాథ్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, అక్కినేని వెంకటరత్నం నిర్వహణతో రేలంగి నరసింహారావు స్క్రీన్‌ప్లే, దర్శక బాధ్యతలు వహించారు.

## సినిమా

ఒక్క మగ పురుగు కూడా లేని సినిమాలు రావాలి - అప్పుడే ఆడది అభ్యుదయం సాధించినట్టు లెక్క!




## కొదమ సింహాలు

''నరేష్‌తో పాటు మరో అయిదుగురు యువతరం హీరోలుంటారు,'' అన్నారు ఆర్ రామకృష్ణంరాజా. ఈయన ''దర్జాదొంగ'' అనంతరం నిర్మించే శ్రీ విజయలక్ష్మి ఆర్ట్స్ వారి ''కొదమ సింహాలు'' చిత్రానికి సత్యానంద్ సంభాషణలు, ఇళయరాజా సంగీతంతో ఎస్. రామచంద్రరావు దర్శకుడు కె రామరాజా సహ నిర్మాత.

## నందం హరిశ్చంద్రరావు దర్శకత్వంలో మోహన్‌బాబు

''జూన్, జులై నెలల్లో 1–15 తేదీల మధ్య జరిగే రెండు షెడ్యూల్స్‌తో మొత్తం షూటింగ్ పూర్తయి పోతుంది,'' అన్నారు నందం హరిశ్చంద్రరావు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే శ్రీ పద్మావతీ క్రియేషన్స్ వారి చిత్రంలో మోహన్‌బాబు, శారద, రజని, జగ్గయ్య, బాలాజీ వగైరా తారా గణం. జె. వి. రాఘవులు సంగీత దర్శకుడు.



[illegible]
కృష్ణంరాజు

# కృష్ణంరాజు జీవితంలో మరపురాని రోజు

కృష్ణంరాజు బాల్యంనుంచీ ఆరాధించే గొప్ప నటులలో దిలీప్‌కుమార్ ఒకరు. ఇప్పటికీ కూడా వీడియోలో దిలీప్ పిక్చర్ ఏదైనా చూస్తూంటే, కృష్ణంరాజు అసలీ ప్రపంచాన్నే మరచిపోతుంటారు.

''బొబ్బిలి బ్రహ్మన్న'' చిత్రం చూసిన వెంటనే దిలీప్ గాఢంగా కృష్ణంరాజును కావలించుకుని, ''హేట్సాఫ్ టు యు... ఎక్స్‌ట్రార్డినరీ పర్ఫార్మెన్స్'' అన్నారు.

ఇంతకు మించిన గొప్ప అవార్డు ఏముంటుంది కృష్ణంరాజుకు ? ''నేను అభిమానించి ఆరాధించే అంతటి గ్రేట్ ఆర్టిస్ట్ ప్రశంసకు పాత్రుడ్నయిన రోజును నా జీవితంలో మరచి పోగలనా?'' అంటారు కృష్ణంరాజు.

ఈ సందర్భంలో నాకో విషయం గుర్తొస్తోంది...భారీ ఎత్తున మద్రాసులో జరిగిన ''బొబ్బిలి బ్రహ్మన్న'' విజయోత్సవానికి బహుమతీ ప్రదాతగా విచ్చేసిన దిలీప్‌కుమార్‌కు, ఆయన సతీమణికి కృష్ణంరాజు 'సురేష్‌మహల్'వద్ద స్వాగతమిచ్చినప్పుడు జరిగిన సంఘటన... స్టేజ్‌మీదున్న బ్రహ్మాండమైన ''బ్రహ్మన్న'' కటౌట్‌ను సైరాబానుకు చూపిస్తూ, దిలీప్ కుమార్ ''ఆయనెవరో పోల్చుకోగలవా?'' అన్నారు. సైరా ఎంత నిశితంగా పరిశీలించినా—పోల్చుకోలేకపోయింది. దిలీప్ మందహాసంతో కృష్ణంరాజువంక చూపిస్తూ ''ఈయనే ఆ గ్రేట్ ఆర్టిస్ట్'' అన్నారు. సైరా నమ్మలేక ఎదురుగా సూట్‌లో ఉన్న కృష్ణంరాజువంక, స్టేజ్‌మీదున్న ఆ ''బ్రహ్మన్న'' కటౌట్‌వంక పలుమార్లు పరిశీలనగా చూస్తుండిపోయింది.

ఆ తర్వాత వేదికమీద తన భర్త చేతులమీదుగా మొమెంటోను కృష్ణంరాజు అందుకునే వరకు ఆమెకు నమ్మకం కలగలేదు.

[ జి. వి. జి. ]

# సినిమా

## ''ఆడపిల్లలే నయం''లో ఆడపిల్ల పనితనం

శారద (జయసుధ) మట్టితో వినాయకుని బొమ్మను చేస్తోంది. అది చూస్తున్న ఆమె తమ్ముడు సుధాకర్ (మురళీకృష్ణ) ''అక్కా, చాలా బాగా చేశావ్. కాని, ఆ తొండం ఎక్కువ వంకరైందేమోనని నా అనుమానం,'' అంటూ వంకలు పెట్టాడు.

''ఒరేయ్, అనుమానం పక్షీ! ఏకదంతం.. వక్ర తొండం వక్రం అంటే, వంకర్రా,'' అంటూ శారద, తమ్ముడ్ని మరికాస్త మట్టి ముద్ద ఇవ్వమంది

''ఇంకెందుకే? అయిపోయిందిగా?''

''మూషిక వాహన గజాననా— అన్నార్రా ఎలుకను చేయొద్దూ? ఒరేయ్, ఎలుక లేని వినాయకుడు అంటే, పదవిలేని నాయకుడురా!''

''ఆ!... ఏస్... లెస్స పలికితివి... నువ్ ఎలుకను చేసేయ్. నేనమ్మదగ్గరికి వెళ్ళొస్తాను,'' అంటూ సుధాకర్ తుర్రుమన్నాడు.

వేజెళ్ళ సత్యనారాయణ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో బి. మరిడేశ్వరరావు నిర్మించిన ''ఆడపిల్లలే నయం'' చిత్రం మార్చి విడుదల.

## ''దర్జాదొంగ''లో దగాకోరు

అతనిపేరు హరిశ్చంద్రప్రసాద్ (సత్యరాజ్) చెప్పేవన్నీ అబద్ధాలే ఇక అతను వేదిక ఎక్కాడంటే చెప్పనక్కర్లేదు...'' నేనే ఈ ఊళ్ళో మహిళా మార్కెట్‌కి పునాదిరాయి

వేశాను. మహిళా లైబ్రరీకి మొదటి పుస్తకం కొన్నాను. మహిళామండలిని నేనే ప్రారంభించాను. చెప్పేస్తున్నా. నా మనసులోని అసలు విషయం చెప్పేస్తున్నా [illegible] గౌరవం. ఇంతమంది [illegible] రాత్రి ఆ [illegible] ఉ గొప్ప [illegible] రమైన [illegible] ంపాను. [illegible] మ్మను. [illegible] రాస్తే, [illegible] ాతంటే [illegible] నాయి [illegible] కలిదిండి

రామచంద్రరాజు సమర్పించే శ్రీ విజయలక్ష్మి ఆర్ట్స్‌వారి ''దర్జాదొంగ'' చిత్రానికి ఆర్. రామకృష్ణంరాజు నిర్మాత.




### విలక్షణమైన టైటిల్

నిర్మాత నేను త్రీ-డి చిత్రం తీయడంలేదు గాని, నా చిత్రం పేరులో త్రీ-డి ఉండడం విశేషం

కొనుగోలుదారుడు అదేమిటండోయ్! ఏమిటా పేరు?

నిర్మాత 'రం'డి' కూర్చోం'డి'- చూడం'డి' - ఇది మా సిన్మా పేరు ఇందులో త్రీ 'డి'లు ఉన్నాయి కదా?

(జి వి జి)

## రేలంగి నరసింహారావు దర్శకత్వంలో శ్రీ సారథీస్టూడియోస్ 7వ చిత్రం

"ఒక పూజారి, అతని అర్ధాంగి, ఒక రౌడీ. ఈ మూడు పాత్రలచుట్టూ ఊహాతీతంగా నడిచే కథ తమిళంలో 'సిరై' (చెర)గా ప్రేక్షకులను విశేషంగా ఆకర్షిస్తూ సంచలనం సృష్టించింది ఆ వెరైటీ సబ్జెక్ట్‌నే తెలుగులో తీస్తున్నాం మార్చి 7 నుంచి 18, ఏప్రిల్ 1 నుంచి 15 వరకు రెండు షెడ్యూల్స్‌లో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు పి శశిభూషణ్. ఈయన నిర్మించే శ్రీ సారథి స్టూడియోస్ 7వ చిత్రం పూర్తిగా ఔట్‌డోర్‌లో రూపొందుతుంది. చంద్రమోహన్, సుహాసిని, శరత్‌బాబు, మురళి, రజని, అల్లు రామలింగయ్య, రాళ్ళపల్లి, వేలు ఆదిగా గలవారు పాల్గొంటున్నారు. ఆత్రేయ మాటలు, పాటలు రాశారు. కె. వి. మహదేవన్ సంగీతం, గోపాల రెడ్డి ఛాయ, కృష్ణమూర్తి శిల్పం, కె సూర్య నారాయణ నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు. ఈ విప్లవాత్మక చిత్రంతోపాటు జంధ్యాల రచన, దర్శకత్వంలో ఒక హాస్యప్రధాన చిత్రాన్ని కూడా తయారు చేస్తున్నట్లు శశిభూషణ్ తెలిపారు



# 'ఊర్వశి' శారద విన్న గొప్పజోక్

"గత సంవత్సరంలో— అంటే, ఉగాదికి ముందు మీరు విన్న గొప్ప జోక్ ఏమిటి ?" అని అడిగితే, 'ఊర్వశి' శారద నవ్వుతూ ఇలా అన్నారు—

"నిప్పులేనిదే పొగరాదంటారు. కాని, నిప్పులేకుండా పొగరావడం తమాషా కదా ? నేను రాజకీయాలలో ప్రవేశించబోతున్నానని ఒక వార్త వెలువడడం ఎంత గొప్పజోక్ ! నాకసలు రాజకీయాలతో ఎప్పుడూ సంబంధం లేదు. ఎన్నికలలో నిలబడాలనే ఉద్దేశ్యం అప్పుడూ, ఇప్పుడూ. ఎప్పుడూ లేదు... సినిమా రాజకీయాలతోనే సతమతమవుతున్నప్పుడు దేశ రాజకీయాలతో చేతులు కలిపే ప్రసక్తెక్కడిది ? . ...అసలు ఈ పుకార్లను ఎవరు పుట్టిస్తున్నారో, ఎందుకు పుట్టిస్తున్నారో ఇందువల్ల వాళ్ళకు ఒరిగేదేమిటో ఆ పెరుమాళ్ళకేఎరుక."

[జి. వి. జి.]

## "మాయలాడి"లో ఫోన్‌లో పిడుగు

క్లబ్బులో పేకాట జోరుగా సాగుతోంది. టెలిఫోన్ బెల్ మోగింది. లావణ్యమూర్తి (రాళ్ళపల్లి) వెళ్ళి రిసీవర్ అందుకున్నాడు "హల్లో!" అన్నాడు. రిసీవర్‌ను పక్కన పెట్టేసి, "మాధవరావ్! ఈవేళ ఛాన్సులన్నీ నీకే. దశ మారింది. ఎవరో అమ్మాయ్ ఫోన్," అన్నాడు.



### విడియో పేర్లు

జడ్జి మీరు అక్రమంగా కొన్ని సినిమాలను విడియోలలో ప్రదర్శిస్తున్నారని అభియోగం ఏమిటా చిత్రాల పేర్లు?

నిందితుడు "నేను నిర్దోషి. చట్టానికి కళ్ళు లేవు. కాలం మారింది. మార్చండి మన చట్టాలు"

(జి వి. జి )

చేతనున్న పేకముక్కలను మాధవరావు (జీవా) టేబుల్‌మీద పారేసి, చివాలున వెళ్ళి రిసీవర్ అందుకున్నాడు. అంతే. అమాంతంగా గాలి తీసిన సైకిల్ ట్యూబ్‌లా చప్పబడిపోయాడు. రిసీవర్ పెట్టేసి, వెనుతిరిగాడు.

"భర్తరఫ్ అయిపోయిన పార్టీ ప్రెసిడెంట్ లాగ అయిపోయినావేంటిరా?" అని లావణ్యమూర్తి అడిగాడు.

మాధవరావు చిర్రెత్తుకొచ్చింది "అవతల పని కట్టుకుని ప్రాణం తీస్తానని ఫోన్ చేస్తూంటే, యెధవ యేళాకోళం నువ్వూనూ. ఎవతో మాయలాడట. ఈ రాత్రికి ప్రాణం తీస్తానని ఫోన్ చేస్తావుంది."

పక్కనే ఉన్న యశోదమ్మ (రాజసులోచన) "ఓస్... అదా? డబ్బున్న కుర్రాళ్ళు ఈ రోజుల్లో ఏమీ తోచక— ప్లేన్‌లు కూల్చేస్తున్నామని, మనుషుల్ని చంపేస్తున్నామని ఫోన్‌లు చేస్తూంటారు," అంది.

"మరీ అలా కొట్టి పారేయకు. ఒరే, ఎందుకైనా మంచిది. నీ జాగ్రత్తలో నువ్వుండు!" అన్నాడు లావణ్యమూర్తి.

"ఉంటాన్లేరా మహా చెప్పొచ్చావు," అంటూ మాధవరావు ఎకాయెకీన బయలుదేరాడు.

"ఎక్కడికి?"

"చావడానికి."

"తథాస్తు! వెళ్ళిరా!" అన్నాడు లావణ్యమూర్తి.

మాధవరావు పెద్ద పెద్ద అంగలతో నడక సాగించాడు.

స్మిత నాయికగా ఎస్. వి. సుబ్బరాజు కథ, సమర్పణలో వి. ఎన్. రంగనాథవర్మ నిర్మించిన శ్రీ వాణీ సినీ ఆర్ట్స "మాయలాడి"చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు. నిర్వహణ : ఎన్. బంగారురాజా. మార్చి విడుదల



స్త్రీ మనోభావాలకు అందమైన
భాషలు ఎన్నెన్నో.
అందులో విమల్ ఒకటి.
VIMAL
A RELIANCE PRODUCT
చీరలు
ప్రత్యేకమైన
సూపర్ సిల్క్ ఫినిష్‌తో
జార్జెట్
షిఫాన్
వాయిల్
టిష్యూ
క్రేప్
2265 TEL

# క్రోధన నామ సంవత్సర ఫలితాలు



# సుత్తి పంచాంగ శ్రవణం

### మేషం :

ఈ రాశిగల ఉద్యోగులు తమ అధికారులు వేసిన చచ్చు జోక్‌కు నవ్వక, వారి ఆగ్రహానికి గురి అయ్యే ప్రమాదమున్నది గాన గ్రహించ గలరు నవంబర్, డిసెంబర్ మాసములందు నల్లులవల్లగాని, దోమలవల్లగాని నిద్రలేమి. విద్యార్థులకు జీర్ణశక్తి ఎక్కువై, జ్ఞాపకశక్తి సన్నగిల్లును.

### వృషభం :

ఈ ఏడు సుత్తి జంట నటించిన చిత్రములకు ముందుగా టిక్కెట్లు అడ్వాన్స్‌డ్ బుకింగ్ చేసుకొనని యెడల నిరాశ చెందు సంభవములున్నవి. స్టాంపు అంటించని ఒక బరువైన కవర్‌కు రెట్టింపు చార్జీలు చెల్లించి తీసుకొనవలసి యుండును. వృద్ధులకు స్త్రీ సుఖము.

### మిధునం :

నగలు చేసి పెట్టమని భార్యలు ఇంట్లో పోరు చేయుదురు. విద్యార్థులకు రాత్రిళ్ళు నిద్ర పట్టదు. లాండ్రికి వేసిన బట్టలలో ఏదో ఒకటి చినిగివచ్చును. ఈ ఏడు గుడ్‌ఫ్రైడే పండుగ శుక్రవారంనాడు రావడం వలన మహిళలకు శుభప్రదం. ఈ రాశివారు ఈ సంవత్సరమంతయూ ట్రెయిన్‌లో తమ గమ్యస్థానమునకు కాస్త కూస్త ఆలస్యముగా చేరుకొనెదరు.

### కర్కాటకం :

ఏడాది పొడుగునా మీ గృహం చుట్టుపక్కలతో కళకళలాడుచుండును. గర్భిణీ స్త్రీలకు డోకులు రావచ్చును. ఆందోళన చెందవలసిన పని లేదు. కొందరు యువకులు రోడ్డుపై తారసిల్లిన యువతులను వారి గృహములకు సురక్షితంగా చేర్చివచ్చెదరు. వృద్ధులు వర్షాకాలమున గొడుగును ఎప్పటైనమా మరచివత్తురు.

### సింహం :

ఈ రాశిగల రచయితలు పంపిన రచనలు పత్రికా కార్యాలయముల నుండి తిరుగుటపాలో సురక్షితముగా తిరిగివచ్చును. పాత కాగితముల విక్రయమువల్ల అధిక ధనలాభం కుటుంబమున పురుడుపోతలు అధికముగా నుండి మిక్కిలి సంతోషము కలుగును. రోహిణికార్తెలో కొందరికి చెమటలు పోయును

### కన్య :

త్రీడిసినిమానుచూసిఇంటికి మరలునప్పుడు పొరపాటున మీ కళ్ళజోడును థియేటరులో ఇచ్చేసి, త్రీడీ కళ్ళజోడును ఇంటికి తీసుకు వెళ్ళవచ్చును మెలకువగా ఉండండి. శ్రీ రామనవమినాడు మీరు సేవించు పానకంలో పుడక ఉండును వేసవి కాలమున విద్యార్థులకు చెమట కాయలు రావచ్చును.

### తుల :

మే మాసమున పౌర్ణమినాడు చంద్ర గ్రహణము రావడం వలన ఈ రాశివారికి యోగకాలం విద్యార్థులు అక్షరాలను గుండ్రంగా టైప్‌చేసి టైప్‌రైటింగ్ పరీక్షలలో ఉత్తీర్ణులగుదురు కేంద్రప్రభుత్వోద్యోగులకు భోపాల్‌కు బదిలీఅయ్యే అదృష్టమున్నది. సంక్రాంతి సమయమున ఇంటి ముందు వేసిన ముగ్గులు తొక్కకుండా గెంతుట వలన కొందరికి కాలు విరిగే ప్రమాదం గలదు

### వృశ్చికం

మీ వద్ద అప్పుతీసుకుని చాలా కాలముగా తప్పించుకు తిరుగుతున్న మీ మిత్రుడు అకస్మాత్తుగా మీకు కనిపించి, మళ్ళీ కొంత అప్పును తీసుకొనును. విద్యార్థులు వర్షాకాలమున రోడ్డు మీద జారిపడి, బట్టలు బురదమయం చేసుకొనగలరు.

### ధనుస్సు :

ఈ రాశిగల పురుషులు చక్కగా వంట చేసి వారి ధర్మపత్ని ప్రశంసలకు పాత్రులగుదురు. విద్యార్థులు రాత్రిళ్ళు లైట్ లేకుండా సైకిల్ తొక్కి అపరాధమును చెల్లించవలసి యుండును. ఈ రాశి గలవారు సెప్టెంబర్ మాసమున వినాయక చవితినాడు ఉండ్రాళ్ళను అధికముగా సేవించి, అజీర్తికి లోనగుదురు.

### మకరం :

ఉద్యోగులకు కొందరు వ్యాపారులు లంచము ఇవ్వజూతురు అది నిరాకరించిన ఆదాయము సన్నగిల్లును, స్వీకరించిన పట్టుపడిపోవు ప్రమాద మున్నది. యువకులు రాసిన ప్రేమలేఖలు యువతుల పెద్దల చేతుల్లోపడి, తద్వారా ఒళ్ళు గట్టిపడే యోగముకలదు గృహిణులు దాసీలతో తగవులాడుదురు

### కుంభం :

కొందరికిలాటరీలో 5రూపాయలుగాని, 10 రూపాయలుగాని ప్రైజ్ వచ్చే యోగమున్నది గనుక అన్ని రాష్ట్రముల లాటరీ టిక్కెట్లను వందల సంఖ్యలోగాని, వేల సంఖ్యలోగాని కొనిన ప్రయోజనముండును పోస్టాఫీసులలోనో, బాంకులలోనో అడిగినఅపరిచితులకు మీ పెనాను ఇచ్చి పోగొట్టుకొనగలరు గాన జాగరూకతతో యుండవలయును

### మీనం :

వంటగ్యాస్ సకాలమునకుఅందక గృహిణులు ఇబ్బంది పడవచ్చును గుడికి వెళ్ళిన కొందరికి కొత్త పాదరక్షల జత లభించవచ్చును కొందరు యువకులు ప్రేమించిన యువతులు వారికే 'రాఖీ' కట్టే అదృష్టమున్నది.

[ సమర్పణ జి.వి.జి ]



ఉత్తమ నటుడు
కృష్ణంరాజు



ఉత్తమ నటి
సుహాసిని



ఉత్తమ దర్శకుడు
జంధ్యాల



ఉత్తమ సంగీత దర్శకుడు
చక్రవర్తి



ఉత్తమ సహాయ నటుడు
చంద్రమోహన్



ఉత్తమ సహాయ నటి
శారద



ఉత్తమ హాస్య నటుడు
సుత్తివేలు



ఉత్తమ హాస్య నటి
శ్రీలక్ష్మి

ఉత్తమ చిత్రం

# ఆనంద భైరవి

బాలట్ విజేతలందరికీ
ఉగాది
శుభాకాంక్షలు!

ప్రకాష్‌తో యిలా మాట్లాడాల్సి రావటం సస్యకి ఎంతో బాధగా వుంది. ఆ మాటల సారాంశం కొద్దిసేపటిక్కానీ అర్థం కాలేదు ప్రకాష్‌కి.

"థాంక్‌గాడ్! యింకా నయం. హఠాత్తుగా మా శిల్ప వుడ్‌బీ చచ్చిపోయాడు. నువ్వు చచ్చిపో అనలేదు!" గాఢంగా నిట్టూర్చాడు.

అతనింకేం మాట్లాడలేదు.

అవతల నుండి ఫోన్ డిస్కనెక్టు అయిన శబ్దంతో ఉలిక్కిపడింది సస్య.

"ప్రకాష్‌కి కోపం వచ్చిందా?" ఆలోచనలకు అవకాశం లేకుండా విజ్జూ పిలుస్తున్నాడు.

"నన్ను ఎంత టైమ్ కావాలి? అని అడిగి ఎంతకీ నువ్వు బయటపడి రావేం?" అరిచాడు.

సస్య పొండీతో ముఖం తుడుచుకుని బయటకు వచ్చింది.

* * * * * * * *

విజ్జూ డ్రైవ్ చేస్తానన్నాడు. ఫ్రంట్ సీటులో విజ్జూ పక్కన సంజయ్. సస్య కూచున్నారు. వెనుక రజియా, శిల్ప, యాదమ్మ కూచున్నారు.

"ప్రకాష్ సంగతి ఎవరూ ప్రస్తావించరేం? లేక నాలాగే తలచారా అందరూ?" సస్య మనసులో అనుకుంది.

విజ్జూ డ్రైవింగ్‌లో కారు మెత్తగా సాగిపోతుంది. తల కాస్త కిటికీ లోంచి బయటకుంచి రివ్వున వీస్తున్న గాలికి సంతోషంగా వెనక్కు వెళుతున్న పరిసరాలను చూస్తుంది యాదమ్మ.

యాదమ్మకు పన్నెండేళ్లుంటాయి. నల్లగా, బొద్దుగా ఉంటుంది. పని బాగా హుషారుగా చేస్తుంది. కానీ తనలో తను ఎప్పుడూ ఏవో పాటలు పాడుకుంటూ ఉంటుంది.

"యాదా, ఏదన్నా పాట పాడవే" మవునాన్ని చెదరగొడుతూ అన్నది సస్య.

"పోమ్మా నాకేమొస్తాయి?" యాదమ్మ సిగ్గుపడింది.

విజ్జూ "నేను పాడతానని". "బండెనక బండి కట్టి, కోడి బాయె లచ్చమ్మదీ" రెండు పాటలు పాడాడు అచ్చం తెలంగాణా యాసలో.

యాదమ్మ.గలగలా నవ్వింది.

బీబీనగర్, భువనగిరి దాటేసారు.

రజియాకి యిలా తామంతా కలిసి గండిపేట పిక్నిక్‌కి వెళ్ళినది గుర్తు వచ్చింది.

"అప్పుడు శామ్‌సన్. ప్రకాష్ కూడా వచ్చారు. రెండు కార్లు కావాల్సి వచ్చింది. ఎంత సందడిగా ఉండింది. ఆ రోజు సస్య, శిల్పలు ఎంత సంతోషంగా వున్నారు!" అనుకుంది.



## ప్రేమించవే మనసా

కారులోనే నేరుగా కొంత పైకి వెళ్ళిపోయారు. అప్పుడే కోనేటి దగ్గర కాళ్ళు కడుక్కుని తలపై నీళ్ళు చల్లుకుని దేవుని దర్శనం చేసుకున్నారు.

పైన కొంత చివరన బండల దగ్గర అందరికీ ఫోటోలు తీసాడు విజ్జూ.

"వదినా ఎప్పుడూ చూడాలి, చూడాలి అంటూంటావుగా యీ ప్లేస్. బావుందా?" అడిగింది సస్య రజియాని.

"దేముడు తప్ప. యిక్కడ చూసేందుకు ఏమంత లేవు." కాస్త నిరుత్సాహంగా అన్నది రజియా.

"కింద పాత కోవెల అని వుంది. అక్కడ చెట్లు, అవీ చల్లగా బాగుంటుంది. అక్కడ నచ్చుతుందిలే నీకు" అన్నది సస్య.

"మీరు కారులో వెళ్ళిపోండి. నేను కిందకు నడిచి వస్తాను. ఫోటోలు తీసుకోవాలి" అన్నాడు విజ్జూ.

"కోతులనా?" చిన్నగా నవ్వాడు సంజయ్.

"ఆ, అవే చక్కని పోజుల్లో ఉంటాయి" తనూ నవ్వుతూ చెప్పాడు. విజ్జూ మంచి ఫోటోగ్రాఫర్. మనసులో ముద్రించుకు పోయేలా ఫోటోలు తీసి, చక్కని వ్యాఖ్యలతో వివిధ పత్రికలకు పంపుతుంటాడు. కొన్ని ప్రైజులు కూడా సంపాదించి పెట్టాయి. ఇంట్లో అతనికి స్వంతంగా డార్క్ రూమ్ కూడా ఉంది.

"శిల్ప, మనం కూడా నడుద్దామా? మరీ పెద్ద దూరం లేదుగా" సస్య అడిగింది.

శిల్ప కారులో వెళ్ళినా నడచి వెళ్ళినా ఒకే మానసిక స్థితి.

"యీడమ్మ కూడా నడుస్తానంది.ఇక అన్నయ్యా, వదినా వెళ్ళనీ. ఆ పది నిముషాల ఏకాంతంలో తనెందుకు మధ్యలో" అనుకుని.

"అలాగే" అన్నది.

"నేను కూడా నడిచేదా, ఎక్కేటప్పుడుకన్నా దిగేటప్పుడు అంత కష్టంగా ఉండదుకదా" అన్నది రజియా సంతోషంతో.

"వద్దమ్మడూ, నడవద్దు పరుగెత్తు!" వెక్కిరింతగా అని 'చాలు చాలు, ముందు కారెక్కు!" మెత్తగా కసిరాడు సంజయ్.

ప్చ్, మీది మరీ అపురూపం" చిరునవ్వుతోనే విసుగ్గా అంటూ వెళ్ళి కూచుంది. కారు వెళ్ళిపోయింది.

పెద్ద పెద్ద బండలు, వాటి మధ్యనే చెట్లు, ఆపై కోతుల సందడి తమాషాగా ఉంది హైహీల్స్ చెప్పులతో నడవటం కష్టంగా ఉన్నా హుషారుగానే అడుగులు వేస్తున్నారు సస్య, శిల్ప.

కెమేరా పట్టుకుని నడుస్తున్న విజ్జూ సన్నగా యీల వేసాడు చెట్టుపై కొమ్మని పట్టుకుని ఉయ్యాల వూగుతున్న కోతి పిల్లను ఫోటో తీసాడు

మరో చోట ఓ బండ రాయిపై గుంపుగా కూచుని ఉన్నాయి కోతులు. భుజాలపై చంటి పిల్లలతో, చేతుల్లో సంచులతో చక చకా దిగుతున్న పల్లెటూరి వాళ్ళదో ఫోటో తీసాడు వెనుకనుంచే. వీళ్ళు దిగేసరికి కారులో కింద వెయిట్ చేస్తున్నారు రజియా, సంజయ్.

"ఎన్ని తీసావు?" అడిగింది రజియా విజ్జూని.

ప్చ్, ఎక్కువ దొరకలేదు."

అందరూ మళ్ళీ కూర్చున్న తర్వాత కారు పాత కోవెల వైపు పరుగు తీసింది.

అక్కడ ముందుగా నవగ్రహాల చుట్టూ ప్రదిక్షణలు చేసారు.

"ఆదిత్యాయచ, సోమాయ, మంగళాయ. బుధాయచ, గురు, శుక్ర, శనిభ్యశ్చ, రాహవే, కేతవే నమః"

రజియా పెద్దగా చదువుతూ చుడుతుంటే విజ్జూకి ఆశ్చర్యం వేసింది. అక్కడ వ్రాసింది చూసి చదవటం లేదు ఆమె. కనులు మూసుకుని తిరుగుతూనే చిన్నగా అనుకుంటూంది.

బయటకొచ్చిన తర్వాత అడిగాడు "వధినా ఎలా వచ్చు నీకది?"


విజయలక్ష్మి ఆర్ట్ మూవీస్
నిర్మాత: టి. త్రివిక్రమరావు M.A., దర్శకత్వం: ఎ. కోదండరామిరెడ్డి
సంగీతం: చక్రవర్తి మాటలు: పరుచూరి బ్రదర్స్
డైరెకర్ ఆఫ్ ఫొటోగ్రఫీ: వి.యస్.ఆర్. స్వామి W.I.C.A.

# ప్రేమించవే మనసా

"నా చిన్నప్పటి ఫ్రెండ్ కాంచన వలన! తనతోపాటు హంపా దేవాలయాలకు వెళ్లేదాన్ని. వాళ్లు బ్రాహ్మిన్స్. వాళ్ళ నాన్నగారు పొద్దున్నే స్నానం చేసి చక్కగా మంత్రాలు చదువుతూ యింట్లో పూజ చేసేవారు దేముడి దగ్గర ఎంత నిష్ఠగా వున్నా నన్నూ కాంచనతో సమానంగా చూసేవారు కులాలు బుద్ధినిబట్టి నిర్ణయించాలి కానీ పుట్టుకతో రావు అనేవారు కాంచనతోపాటు కుతూహలంగా చూస్తుండే నాకూ అన్నీ నేర్పేవారు నా కసలు అప్పట్నుంచే యిష్టమైందనుకుంటాను విగ్రహారాధన అందమైన విగ్రహాలకు, పటాలకు పువ్వులు అలంకరించి దీప, ధూపాల మధ్య మంత్రాలు చదివి నైవేద్యాలు సమర్పిస్తూ వుంటే, గంట వాయిస్తూ హారతిస్తుంటే ముందు ముందు అదంతా తమాషాగా వున్నా చూసేందుకు తర్వాత అందులో ఎంతో ప్రశాంతత తోచేది నాకు అయితే యిదంతా మా యింట్లో తెలియదు అప్పుడు' చిన్నగా నవ్వింది రజియా

ఇప్పుడెక్కడ వుంది మీ కాంచన? పక్కనే నడుస్తూ అన్నీ వింటున్న సస్య అడిగింది

తను మెడిసిన్ చదివింది డాక్టర్నే పెళ్ళి చేసుకుని ప్రస్తుతం మద్రాసులో సెటియిపోయింది

మళ్ళీ నరసింహస్వామిని దర్శించుకుని, ఆ పక్కనే చిన్న కొండపైన శివాలయాన్ని, అక్కడ కొండల మధ్య స్వచ్ఛంగా వున్న కోనేరు, పక్కనే గుడిలో చిన్ని శివలింగానికి పాదాభిషేకం చేస్తూ సన్నగా ప్రవహిస్తున్న గంగనూ చూసారు

నిశ్శబ్దంగా ప్రశాంతంగా వుంది అక్కడంతా

తర్వాత గుబురు గుబురుగా వున్న చెట్టుకింద కూచుని ఫలహారాలు చేసారు యాదమ్మ అన్నీ కడిగి సర్దిపెట్టింది

టేప్‌రికార్డర్‌లోనుంచి సన్నగా పాటలు వస్తున్నాయి విజ్జూ కెమేరాతో చెట్ల వైపు వెళ్ళిపొయ్యాడు అతనికి లైట్‌తో పనిలేదు కెమెరాతోపాటు ఎప్పుడూ ఫ్లాష్ కూడా దగ్గర ఉంచుకుంటాడు

ఈ అయ్య మనుషులను ఫోటో తీక చెట్లు, పిట్టల్నితీస్తాడెందుకో? అటు చూస్తూ అనుకుంది యాదమ్మ కొద్దిసేపు పాటలు వింటూ ఎవరి లోకాల్లో వాళ్ళున్నట్లు అంతా కామ్‌గా ఉండిపోయారు

సస్యకి పదే పదే ప్రకాష్ గుర్తుకి వస్తున్నాడు

శిల్ప వెంట తీసుకువచ్చిన యిలస్ట్రేటెడ్ వీక్లీ తిరగేస్తూంది

ఓ గంట తర్వాత విజ్జూ వచ్చాడు

అందరూ కలిసి కొద్దిసేపు కార్డ్స్ ఆడారు శిల్పకు ఆసక్తి లేక, రజియాకు ఆట సరిగా చేతకాక వరుసగా అన్ని ఆటల్లోనూ ఓడిపోయారు

కను చీకట్లు ముసురుకోబోతుండగా 'ఇంక బయలుదేరుదాం అన్నాడు సంజయ్ అందరూ లేచారు

ప్చ్, ఎందుకో యీ రోజు సరదాగానే లేదు శిల్పని జ్ఞాపకాల నుంచి మళ్ళించాలని, తనే ఆలోచనలతో గడిపేసింది నిజంగా మనసివ్వటమన్నా యిచ్చిన తరువాత మరిచిపోవటం అన్నా ఎంత సంఘర్షణ' అనుకుంది సస్య

ఇంటికి వచ్చేసరికి నగరం దీపాలతో సింగారించుకుని చాలాసేపయింది

ప్రొద్దున్నే శిల్ప ముఖం కడుక్కుని రాగానే సస్య రెండు కప్పులతో కాఫీ పట్టుకుని వచ్చింది ఒకటి తను తీసుకుని మరో కప్పు శిల్ప కందించింది

వద్దు'

ఆశ్చర్యంగా చూసింది సస్య ఏం?

తాగాలనిలేదు నేను స్నానం చేసి వస్తాను మరి కాసేపు అక్కడే ఉంటే సస్య ప్రశ్నలు ఆపదని త్వర త్వరగా బాత్‌రూమ్‌లోకెళ్ళిపోయింది

సస్యకేం అర్థం కాలేదు తను నోటి దగ్గర పెట్టుకున్న కాఫీ తాగటం కూడా మరిచిపోయి మూసుకున్న బాత్‌రూమ్ తలుపు వంక వింతగా చూసింది

"స్నానం చేయకుండా కాఫీ కూడా త్రాగకూడదని నియమాలేం లేవే శిల్పకి. అసలు బెడ్‌కాఫీ అలవాటు. తనే పళ్ళు శుభ్రం చేసుకుని కాఫీ తీసుకోవే అని గొడవపెడుతుంది. అలాంటిది మరి యీవేళ యిదేమిటి?"

చేతిలో చల్లారుతున్న కాఫీ గుర్తుకువచ్చి రెండు గుక్కల్లో తాగేసి కప్పు పక్కన పెట్టి అక్కడే కూర్చుంది.

శిల్ప తలస్నానం చేసి బయిటకు వచ్చింది తెల్లని ఆర్గండీ శారీ తెల్లని వీ నెక్ జాకెట్‌తో తెల్ల గులాబీలా ఉంది చెవులకు ముందు రోజు పెట్టుకున్నవే పెద్ద పెద్ద రింగులు, ఎప్పుడూ కుడిచేతి వ్రేలికుండే ముత్యపు ఉంగరం తప్ప మరే ఆభరణాలు లేవు

తడి తలని కొద్దిసేపు ఫాన్ గాలికి ఆరబెట్టి పొడవాటి వెంట్రుకలను తెల్లని రిబ్బన్‌తో సగంలో ముడివేసింది ఆ తర్వాత డ్రెస్సింగ్ టేబిల్‌పై వున్న కారు తాళాలు తీసుకుంది

అంతవరకూ మౌనంగా చూస్తున్న సస్య యిక ఊరుకోలేక

ఎక్కడికీ? అడిగింది

ఇప్పుడే వచ్చేస్తాను!

శిల్పీ, ఏమిటిది? ఎక్కడి

గది దాటుతూ వెనక్కి తిరిగిచూసింది శిల్ప ప్లీజ్ సస్యా, నన్నేమీ వివరాలు అడక్కు వచ్చేస్తానుగా' చక చకా వెళ్ళిపోయింది

సస్య తేరుకుని వెనుకే అనుసరించబోయేంతలో కారు స్టార్ట్ అయిన శబ్దం వినిపించింది మళ్లీ వెనక్కు పరుగెత్తుకుంటూ వచ్చి వరండాలోంచి కిందకు చూసింది

కారు గేటు దాటుతుంది

సస్యా, శిల్ప ఎక్కడికి వెళుతుంది?' కింద నుంచి రజియా వచ్చింది మెట్లెక్కిన ఆయాసంతో ఉంది

తెలియదు' అంటున్న ఆడపడుచు వంక తెల్లబోయి చూసింది

అదేమిటి?

కాఫీ తీసుకోస్తే వద్దంది వెళుతుంటే ఎక్కడికని అడిగితే యిప్పుడే వచ్చేస్తాను అన్నది సస్య మెల్లగా చెప్పింది

నాకేం అర్థం కావటంలేదు అసలే దిగులుతో ఉంది ఇలా చెప్పా పెట్టకుండా ఎక్కడికో అని వెడితే ఏమనుకోవాలి ఏదన్నా అఘాయిత్యం

ఆమె మాటలు పూర్తికాక మునుపే ఆపేసింది సస్య

అలాంటిదేం ఉండదు ఇప్పుడే వస్తానన్నదిగా, వచ్చేస్తుంది! నమ్మకంగా అన్నది

రజియా వెళ్ళి సత్యనారాయణగారితో చెప్పింది

శివశంకరంకి ఫోన్ చేద్దామా? ఆయనా ఆందోళనగా అన్నారు

వద్దు వద్దు, ఆంటీ అంకుల్ కంగారుపడతారు వచ్చేస్తానంది కదా' వెనుకే వచ్చిన సస్య అన్నది

విషయం విని సంజయ్ కూడా సస్య అంత నమ్మకంగా చెపుతుంది చూద్దాం అన్నాడు

పొద్దున పది గంటలు దాటింది

సంజయ్, సత్యనారాయణగారు బయటకు వెళ్ళిపోయారు

శిల్ప యింటికి రాగానే తమకు ఫోను చెయ్యమని చెప్పారు సస్య హాల్లోనే సోఫాలో ఒక పుస్తకం పట్టుకుని కూచుంది

పన్నెండు అయిపోయింది

రజియాకి ఆందోళనగా ఉంది

సస్యా పోనీ తనెక్కడికి వెళ్ళి ఉంటుందో నువ్వేమన్నా ఊహించావా? అడిగింది

'తెలిస్తే నేనూ ఎప్పుడో వెళ్ళేదాన్ని ఇక్కడ కూర్చుని యీ టెన్షన్ ఎందుకు?

మరి యిప్పుడెలా? అయోమయంగాఅన్నది

సస్యకూ సమయం గడిచే కొద్దీ ఆందోళనగా ఉంది

ఎదురింటి వైపు చూసింది నిశ్శబ్దంగా ఉంది పొద్దున్నే విశాలాక్షి హాస్పిటల్‌కీ, విజ్జూ కాలేజికి వెళ్ళిపోయారు

ఉండు!' టెలిఫోన్ దగ్గర కెళ్ళి ఓ నంబర్ తిప్పింది

మెడికల్ కాలేజ్?' అని అడిగి విజ్జూ వివరాలు చెప్పి అర్జంటుగా పిలవమన్నది

కొద్దిసేపటికి అవతల నుంచి విజ్జూ కంఠం వినిపించింది

విజ్జూ, నేను సస్యను నువ్వు వెంటనే బయలుదేరి రా అని విషయము క్లుప్తంగా వివరించింది

పది నిముషాల్లో విజ్జూ స్కూటర్ యింటి ముందాగింది

'అదేమిటి? పొద్దునే ఎందకు చెప్పలేదు? విజ్జూ రావటం, రావటం అడిగాడు

వెంటనే వచ్చేస్తానన్నది కదా అనుకున్నాను కానీ ఎంతసేపటికీ రాకపోతే బయమేస్తున్నది కొంచెం బేలగా అన్నది సస్య

పొద్దున్నే వాళ్ళ యింటికి ఫోన్ చేస్తానంటే సస్య వద్దన్నది

ఇప్పుడేదన్నా అయితే వాళ్ళకేం చెపుతాం? రజియాకి ఊహించు కునేందుకే భయంగాఉంది

ఇప్పుడేమయిందని? విజ్జూకి లోలోపల ఏదో అనుమానంగా ఉన్నా ధైర్యంగా అన్నాడు

వదిన్నా ముందు కొంచెం మంచి నీళ్ళివ్వండి అడిగాడు ఫ్రిజ్ లోంచి చల్లని నీళ్ళు తెచ్చి యిచ్చింది రజియా

సత్యనారాయణ గారు ఫోన్ చేసారు శిల్ప వచ్చిందా? అడిగారు ఆయనతో లేదని చెప్పి యిటు తిరుగుతూ అంది రజియా మళ్ళీ మ్రోగింది ఫోన్

శిల్ప వచ్చిందా? సంజయ్ అడిగాడు

ముందు చెప్పిన సమాధానమే చెప్పి వాల్‌క్లాక్ వైపు చూసింది ఒంటి గంట పైనే అయింది ఎవ్వరూ భోజనాల మాట అనుకోలేదు

విజ్జూ లేచాడు సస్య అతని వైపు ప్రశ్నార్థకంగా చూసింది

ఇలా కూర్చుని ఉంటే ఏం లాభం? అన్నాడు

మరి ఎక్కడ చూస్తావు?

అతను ఏం మాట్లాడ లేదు బయటకు నడిచాడు స్కూటర్ దగ్గర కెళ్ళి స్టార్ట్ చెయ్యబోయిన వాడల్లా ఆగి వెనక్కి వచ్చాడు

సస్యా, శిల్ప డైరీ రాస్తుంది కదూ?

'ఆ! అయితే?

రాత్రి ఏం వ్రాసిందో చూడు!

తమకు ప్రాణ స్నేహితురాలే కావచ్చు ఒకళ్ళ మధ్య ఒకళ్ళకు దాచుకునే రహస్యాలేం లేక పోవచ్చు! కాని కానీ డైరీ చూడచ్చా?

తటపటాయిస్తున్న సస్యతో ఇలా కూర్చుంటే కాదు మరి అంతకన్నా మార్గం లేదు రాత్రి తన భావాలను బట్టి మనం ఏదన్నా ఊహించవచ్చు!

సస్య మేడపైకి వెళ్ళింది మూడు రోజుల ముందే శిల్ప బట్టలు, శిల్పక్కావలసిన వస్తువులు సూట్‌కేస్‌లో సర్ది డ్రైవర్ దగ్గర పంపించింది భువనేశ్వరి .

సూట్‌కేస్ తెరిచింది సస్య బట్టల అడుగున వుంది బ్లూ కవర్ డైరీ తీసుకుని కిందకి వచ్చింది

విజ్జూ అందుకుని గబగబా పేజీలు తిప్పి ముందురోజు డేట్ ఉన్న పేజి దగ్గర ఆగాడు

(ఇంకా ఉంది.)

# ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

## ఎం. ఎస్. ఆర్. అమలాపురం.

ఎప్పటినుంచో మీ సమాధానాలు చదువుతున్నాను. నిజాన్ని నిష్కర్షగా చెప్పే ఔదార్యం, వ్యంగ్యాన్ని అలాగే తిప్పికొట్టే మీ భావ ప్రకటన నాకు నచ్చాయి. మనిషి ముఖం అద్దం లాంటిది అంటారు. మన ముఖం అద్దంలో ఎలా కనపడుతుందో ఎదుటి వారికి మన నైజం కనపడు తుంది నిజమేనా?

★ నిజమే. అద్దం ప్రతిబింబాన్ని ఉన్నదున్నట్టు చూపినట్లే ఎదుటివాడికి మన ముఖం అద్దంలో లాగా మన మనసులోని భావాలని తెలియ చేస్తుంది. అందుకే నవ్వుతూ మాట్లాడినా – ఎదుటి వాడి అసలు వూహలు ఎలా సాగుతున్నాయో మనం కనిపెట్టవచ్చు!

## బి. వి. ఏ. అల్లూరు.

నేను ఒక అమ్మాయిని ప్రేమించానని ఇంకా గ్యారంటీగా చెప్పలేనండి. ఆ అమ్మాయి మాత్రం నన్ను గ్యారంటీగా ప్రేమిస్తుందని చెప్పాలి. మేం యిద్దరం యిప్పటివరకు మనసులతో మాట్లాడుకున్నాం..... పేరడిగింది చెప్పాను. ఇక నాతో మాట్లాడటం మానేసింది. ఎందువలన?

★ తెలియలేదా వీరాంజనేయా? ఘోటక బ్రహ్మచారి పేరుకి! నువ్వా గ్యారంటీగా అమ్మాయిని ప్రేమిస్తున్నట్టు చెప్పలేదాయె. ఇంకెందుకీ వేట? మనసులలో మాట అని వూరుకొని వుంటుంది. తెలివైనదే.

## ఆర్. ఎం. ఆర్. అంబుసోలి.

నేనొక అమ్మాయిని ప్రేమించాను. మా ప్రేమ ప్రేమ సంకెళ్ళలా అతుక్కుపోయింది. అమ్మాయికి చాలా డబ్బుంది. ఆమె తల్లితండ్రులు మా ప్రేమ సంకెళ్ళని ఇనుప సంకెళ్ళుగా మార్చుతారని భయంగా వుంది.

★ ప్రేమకి భయమా! అయినా డబ్బు సంకెళ్ళు తెంచుకోలేకుండా వున్నట్టుంది – కదూ?!

మీరు అడ్డమైన ఉత్తరాలకి జవాబిస్తా రెందుకండి?

★ మరి నీలా రాస్తే ఏంచెయ్యనయ్యా?!

## టి. ఎం. మారంపల్లి.

కరవాలనం ఎందుకు?

★ నోటితోనే కాక స్పర్శతో కూడా తమ తమ ఆనందం తెలియచేయడానికి.

## వి. జె. ఎం. ఆర్. తెనాలి.

మీరే భారత ప్రధాని అయితే?

★ అమ్మో – ఢిల్లీలో చలి ఎక్కువ. నేను మద్రాసు మనిషిని. ఓటేస్తానేగాని ఓటు కోసం తిరగను!

## పి. ఎన్. వి. శృంగవరపు కోట.

పత్రిక రాగానే ప్రథమంగా చదివేది ప్రశ్నావళి. అది లేక పోతే పత్రిక కొనడం వృధా అనిపిస్తుంది.మాలతీ చందూర్ గారి జవాబులు గంభీర గోదావరిలా వుంటే – మీవి గలగల పారే సెల యేరులా వుంటుంది. ప్రశ్నావళి శీర్షికపై చిరునామా యిస్తే బాగుంటుంది.

★ థాంక్యూ నీలవేణీ. అంతా తిట్టినా సరే ఇలాంటి ఒక్క ఉత్తరం చాలు ఉత్సాహంగా వుండడానికి. చిరునామా యిస్తే యింటికి వస్తాయి ఉత్తరాలింక. నాకిష్టం లేదు. కేరాఫ్ ఆంధ్ర పత్రిక-- హాయిగా వుంది.




## కే.వి. ఆర్. భోగిరెడ్డిపల్లి.

నేటి విద్యా విధానం పై మీ అభిప్రాయం. మానవునికి విద్య అవసరమా? అనవసరం అయితే మరీ చదువు ఎందుకు?

★ మానవ మనో వికాసానికి చదువు అవసరం. కిటికీలు మూసిన గదిలో మనిషిని బంధిస్తే పిచ్చెక్కుతుంది. అలాగే మెదడు కిటికీలూ–మూసి వుంచడం ప్రమాదం. ఇక, చదువు కావాలి. కాని అది ఎలాంటిదో తెలియక – తరం నుంచి తరానికి– కుర్రకారుని బలిచేస్తున్నారేమో – అన్పిస్తుంది నాకు. చదువు ఒక్క విజ్ఞాన సముపార్జనకే– అంటే అదీ అందివ్వడం లేదు. చదువు ఉద్యోగ సంపాదనకే అంటే అదీ రావడం లేదు దీనివల్ల. మరిటువంటి కాగితాల చదువులు ఎందుకు? వయసొచ్చేసరికి ప్రతి మనిషీ తన కాళ్ళపై తను నిలబడ కలిగేలాగా చేయాలి చదువు. అది చేయలేనిది– చదువేగాని పనికొచ్చే చదువు అని అనలేం.

## జి. ఆర్. గారీపట్నం.

అక్కయ్యా, లంచానికి-డొనేషన్‌కి తేడా ఏమిటి?

★ ఒకటి అడిగితే యిచ్చేది. రెండోది అడకుండా కట్టేది!!

## సిహెచ్. ఎ. ఎన్. కోనల.

మానవత్వంలో మనిషి వున్నాడా? మనిషిలో మానవత్వం వుందా?

★ మానవత్వమే మనిషి లక్షణం అనుకుంటుంటే యీ అనుమానం ఏమిటి? జంతువులకి వుండదు – మానవత్వం!

## జి. వి. విశాఖపట్నం.

ప్రముఖ ఉద్యోగాల్లో వున్న అనేకుల్లో కులతత్వం చాలా హెచ్చుగా వుందని నా నమ్మకం. దానికి కారణం ఏమిటంటారు?

★ అంత ఎత్తున వుంటేనే – అడిగేవాడుండడు!....

## డి. ఎల్. డి. చోడవరం.

ఆడదాన్ని అవసరం తీరేదాకా వాడుకొని నిన్ను పెళ్ళి చేసుకుంటానని చెప్పి తరువాత వదిలిన మగవారిని ఏం చేయాలి?

★ నీ అమాయకత్వం చూస్తుంటే నవ్వాలో ఏడవాలో తెలియడంలేదు. అవసరం తీరేక పెళ్ళి కూడా ఎందుకు?!

## హెచ్. ఎస్. విజయవాడ.

మనిషిని మనిషిగా చూడలేని ఈ సమాజంలో మనసుండి బ్రతకలేకపోతున్నాను.

★ ఏం చేస్తాం ఛాయా, అందాకా– అదే అదేదో – నవసమాజం వచ్చేదాకా–మనస్సుని దాచేస్ బ్రతికెయ్. సర్దుకుపోవాలి మరి! □

పెద్దకథ

# మండుటెండలో మంచుబొమ్మలు

సాయిరమేష్ (రాధ)

(గత సంచిక తరువాయి)

విసురుగా గదిలోకి ఎవరో వచ్చిన చప్పుడు విని వులిక్కిపడి కళ్ళు తెరిచింది విశాలాక్షి వెండీ

'నువ్వా ఎవరో అనుకున్నాను వంటి మీద వలువలు గాలికి వదిలేసి వయ్యారంగా వళ్ళు విరుచుకుంటూ, వయసు పొంగులు ప్రదర్శిస్తూ ప్రక్క మీదనుంచి లేచి విభుడి చెంతకి వచ్చింది

కోపంతో ఎరుపెక్కిన కళ్ళతో నమిలి మ్రింగేసేలా చూస్తున్నారు శంకరరావు

ఈరోజంతా చాలా సిక్‌నెస్‌గా ఫీల్ అయ్యాను డార్లింగ్ అసలు ఏమీ తినలేదు తిందామంటే ఏమైనా సహిస్తే కదా నీరసంగావుంటే రెస్ట్ తీసుకుందామని కొన్సేపు నడుంవాల్చాను కడుపుతో వుంటే యిన్ని కష్టాలు పడాలన్నమాట అయ్ హేట్ యిట్ అయినా తప్పలేదు చూశావా నీ కోసం ఎంత త్యాగం చేస్తున్నానో ముద్దు ముద్దుగా మాట్లాడుతూ, మగడి మెడచుట్టూ చేతులువేసి మత్తుగా వాటేసుకుంది వెండి ఆయన పరిస్థితి గుర్తించకుండా

క్షోభిస్తున్న గుండెల్లో క్రోధ జ్వాలలు రగులుతుంటే, పగ ప్రతీకారం హృదయ ద్వారాల మధ్య వత్తిడి చేస్తుంటే, శంకరరావుగారు వుద్వేగంతో వూగిపోతున్నారు

షటప్ అండ్ లిసన్

వెండీ ముఖం వెలవెలబోయింది శంకరరావుగారి నోటి దురుసుతనానికి

వాట్ హేపెండ్ డార్లింగ్ ఆర్ యు ఆల్‌రైట్

దడ దడ లాడుతున్న ఆయన గుండెల మీద సేద తీర్చుకుంటున్న వెండీ కాస్త దూరంగా జరిగింది అయోమయంగా చూస్తూ

గర్భవతి అన్న దయాదాక్షిణ్యాలు లేకుండా యిల్లాలి చేయి విరిచి ఒక్క త్రోపు త్రోశారు వుగ్రరూపందరించి

ఆ వూపుకి నిలద్రొక్కుకోలేక మంచం మీద తూలిపడింది వెండీ 'మైగాడ్ వాటీజ్ ది మేటర్ విత్ యు హేవ్ యు గాన్ క్రేజీ ఆర్ నాట్ అంది ఆవేశంగా అరుస్తూ

ఎస్ అయామ్ స్వీట్ హార్ట్ నిన్ను కట్టుకున్న ఏ మగాడికైనా మిగిలేది అదొక్కటేనేమో యిన్‌సేనిటీ మేడ్‌నెస్ అఫ్ కోర్స్ అయామ్ క్రేజీ డార్లింగ్ వికృతంగా నవ్వుతూ, వురుములా గర్జిస్తూ మీద మీదకు వచ్చారు శంకరరావు

వెండీ నిలువెల్లా వణుకుతోంది, వూహించని విభుడి విజృంభణకి విస్తుపోయి చూస్తూ

"ప్లీజ్ రావ్ పుత్ యువర్ సెల్ఫ్ టుగెదర్ నేను యిప్పుడు మామూలు మనిషిని కాదన్న సంగతి మర్చిపోయావా డోంట్ బి సిల్లీ అయామ్ కేరీ యంగ్ యువర్ సన్ ప్లీజ్ రిమెంబర్ దట్ '

వెండీ కంఠంలో గూడు కట్టుకున్న దైన్యతకి చలించిపోయారు శంకరరావు

"అయ్‌నో అయ్‌నో పిచ్చిగా వాపోతూ వెనక్కు తగ్గాడు ఆయన నోట్లో ఏదేదో గొణుక్కుంటూ

గుండెల్ని రాపిడి చేస్తున్న రోషానికీ, మనసుని తల్లడిల్ల జేస్తున్న మనోవేదనకీ మధ్య ఆయనలో ఓ భయంకరమైన సమరం జరుగుతూనే వుంది అప్పటికీ

మానవత్వం మాత్రం మనిషికి బానిసై ఎన్నాళ్ళు బ్రతుకుతుంది ఏదో ఒకనాటికి అదీ ఎదురు తిరుగుతుంది

విషం రుచిచూసిన మనసు చేదుని చీత్కరించుకుని తిరుగుబాటు ప్రకటించటంలో తప్పేముంటుంది

శంకరరావుగారిలో చెలరేగుతోన్న సంచలనం అదే అప్పుడు

ఎదలో అలజడి చేస్తున్న ఆలోచనల ప్రభావం ఆయన భౌతికఖాయాన్ని సంపూర్ణంగా స్వాధీనం చేసుకుంది క్షణాల్లో

చిరుచెమటలు ఆయన చెంపల్ని తడిమాయి

నిశితమైన చూపుల్లో నిరాశ, నిస్పృహ నగ్న నాట్యం చేశాయి

చలనేంద్రియాల్లో సారం సన్నగిల్లి కుప్పలా కూలబడిపోయారు శంకరరావు, ఎదురుగా కనిపించిన ముద్దులమగువ డ్రెస్సింగ్ కుర్చీలో

ఎందుకు డార్లింగ్ అంతకోపం నేను చేసిన తప్పేమిటో చెప్పు సంజాయిషీ చెప్పుకుంటాను నా మూలంగా నీ మనసు కష్టపడితే నేనుమాత్రం భరించగలనా ' ఎనలేని లాలిత్యం వలికించింది వెండీ, జాలిగొలిపే చూపుల్లో ప్రేమనింపి

మండుటెండలో మంచు ముక్కలా, ఆయన క్రోధావేశాలు కరగటం ప్రారంభించాయి వగలాడి వేడి నిట్టూర్పులు సోకగానే

సి దిస్ అంటూ చేతిలో కవరు కార్పెట్ మీదకి విసిరారు

లేచి అందుకుని వుత్తరం విప్పింది కుతూహలంగా

వాటీజ్ దిస్ డార్లింగ్ అయ్‌కాంట్ రీడ్ దిస్ ఇదేదో పారిన్ లేంగ్వేజ్‌లా వుంది జోక్ చేస్తున్నావా ఏమిటి కొంపతీసి

అతికీ అతకని అరనవ్వుతో కంగారు కప్పిపుచ్చుకోటానికి ప్రయత్నించింది ఆ సింగారి శ్రీవారి వైపు చిత్రంగా చూస్తూ

నాకు తెలుసు నువ్వు అలా అంటావని ఆయన కంఠంలో కాఠిన్యత వేడి గిన్నెలో వెన్న ముద్దయ్యింది

అయితే దీని వుద్దేశం ఏమిటి విరుచుకు పడింది వెండీ వుత్తరం గాలిలో వూపుతూ ఇల్లాలి సరస సల్లాపాలయితే తట్టుకో గలడేమో కాని, ఆక్షేపణలు అధికార చలాయింపులూ మాత్రం బరించే స్థితిలో లేడు ఆ ఆంధ్రుడు, ఆక్షణంలో

ఏమిటా ఈ వుత్తరం రాసింది ఎవరో తెలుసా నాబ్రదర్ యిన్ లా అంటే భారతి బ్రదర్ అన్నమాట యిప్పుడు అర్థమవుతోందా అసలు విషయం ఏమిటో సహనం సన్నగిల్లి మండిపడ్డారు రావుగారు నిరసనగా

సో వాట్

రెచ్చిపోయారు రావుగారు

'యు బ్లడీ బిచ్ డోంట్ యునో వాట్ యుహేవ్ డన్

ఏమిటట నేను చేసిన పొరపాటు కావాలనే శాంత వహించింది వెండి కళ్ళు మిటకరించి వెటకారంగా నవ్వుతూ

చివ్వున లేచివచ్చి అనాలోచితంగా చేయి విసిరారు శంకరరావు, వుగ్ర రూపం ధరించి చూడామణి చెంప చెళ్ళు మంది

క్షణకాలం బయంకర నిశ్శబ్దం విలయ తాండవం చేసింది వాళ్ళిద్దరి మధ్య

యు బ్లడీ బ్రౌన్ బాస్టర్ డోంట్ యు డేర్ టుడు దిస్ టు మి

నెవ్వర్ ఎవ్వర్ ఎగెయిన్ వెండీ తిరిగి చేయెత్తింది విసురుగా ఎరుపెక్కిన కపోలాన్ని రెండో చేత్తో సవరించుకుంటూ

చేష్ట లుడిగారు శంకరరావు తన ముద్దుల యిల్లాలి ప్రతీకార చర్యకి తట్టుకో లేక రుసరుస-

లాడుతూ తన వార్డ్రోబ్ తెరిచి భద్రంగా దాచిన మూడు పుత్తరాలు బయటకు తీసి ఆయన ముఖాన్న వేసి కొట్టింది పౌరుషంగా

ఐ మస్ట్ హేవ్ నోన్ యు లాంగ్ ఎగో యు ఆర్ ఎ బ్లడీ యిండియన్ రావ్ నీ సెంటిమెంట్లు విన్న తరహా బుష్పలు ఎక్కడికి పోతాయి చెప్పు

నా యవ్వన మంతా దారపోసి ముక్కిపోతున్న నీ జీవితాన్ని సుఖమయం చేద్దామనుకున్నాను ఎందుకో తెలుసా నీలో ఏదో కాస్త మంచితనం, మానవత్వం వుందని బట్ అయామ్ రాంగ్ యు ఆర్ ఎ మీన్ బాస్టర్డ్ అయ్ హేట్ యు లైక్ ఎనీ థింగ్--అవిగో నీ బ్రదర్ యిన్ లా రాసిన పుత్తరాలు చూసుకుని వూరేగు తావో ఏడుస్తూ వాళ్ళని వుద్ధరిస్తావో నువ్వే నిర్ణయించుకో ఈ ముసుకులో గుద్దులాటలు నేనూ భరించ లేను అంటూ విసవిసలాడుతూ వెళ్ళిపోయింది వెండీ. వేనిటీ బేగ్ తీసుకుని ఎక్కడికో ప్రయాణమవుతూ?

చెక్కిన బొమ్మలా నిలబడి పోయారు శంకరరావు యిల్లాలి ఎదురు దెబ్బకి తాళ లేక ఆమె వెళ్ళిన వైపు వెర్రిగాచూస్తూ!

**********

శంకరరావు గారి మనసు ముక్కముక్కలయ్యింది అతకలేనన్ని ఆ ముక్కల్లో దగాపడ్డ ఆ పెద్దమనిషి ఆకారం వికారంగా ప్రతిబింబిస్తుంటే.చెదిరిన మనసు మనో నేత్రాన్ని మూయించి. విషాద గీతికలు వినిపించటంలో వింతేముంటుంది?

భారతి రూపం పదే పదే కళ్ళల్లో కదలాడుతుంటే ఆయన వూహల్లో విపరీత మైన వెలితి . ఏదో తెలియని వైరాగ్యం వాహ్యాళి సలిపాయి





తియ్యని గతంల్లో తన తొందరపాటు వలన ఓ చుక్క విషం తొణికిపడి జీవితాన్నే చేదెక్కిస్తుంటే ఆయన మాత్రం ఎంతకాలం ఓర్చుకో గలడు ఆ చిత్ర వధని?

తను చిక్కింది ఓ ముళ్ళ వలలో నో లేక తను వేసిన గేలానికి తగిలింది వన్నెలున్న ఓ ముళ్ళచేపో తేల్చుకోలేక తల్లడిల్లి పోయాడు ఆయన

ఎన్నెన్నో సాక్ష్యాధారాలుతో ఒక ప్రక్క నుంచి కట్టుకున్న కోమలాంగి గుట్టు రట్టవుతుంటే ఆ ఆంధ్రుడి అంతరాళంలో అసూయ ఆరని జ్వాలలు రగిలించటం అతి సహజం ఏమో??

శంకరరావుగారు యిప్పుడు అటువంటి అయో-మయంలో నే కొట్టు మిట్టాడుతున్నారు ఏం చేయాలో తోచక మానవత్వాన్ని విడనాడి మరో మనిషి మీద పగ సాధించాలో. లేక జరిగిందంతా ఓ పీడకలని మరిచిపోయి మామూలుగా సంసార యానం సాగించాలో నిర్ణయించు కోటానికి ఓ వారం రోజులు శలవు పెట్టి నార్త్ వేల్స్ బయలుదేరి వెళ్ళారు. వెండీకి చెప్పా చెయ్యకుండా

అశాంతిలో ప్రశాంతి వెదుక్కునే మనుషులికి నిర్మలమైన నార్త్వేల్స్ పరిసరాలు అత్యంత దోహదం కలిగిస్తాయని ఆయన ఎప్పుడో ఎవరో-చెప్తే విన్నారు

అందుకే తను పోగొట్టు కున్నది వెదుక్కుంటూ రిల్ అనే వూరు చేరి ఆవారం రోజులూ స్వేచ్ఛగా గడిపేశారు. ఓ ఖరీదైన హోటల్లో మకాంపెట్టి.

చుట్టూ వున్న స్వచ్ఛ మైన సెలయేళ్ళ ఒడ్డున. దట్టమైన వరుపులాంటి పచ్చిక బయళ్ళ మధ్యన కొండ శిఖరాల నుంచి. సముద్రతీరం వరకూ సుముఖంగా ప్రతీ రోజూ విహరిస్తూ

ఇంటి ముఖం పట్టేరోజు వచ్చింది ఆఖరికి ఎంతైనా తన భార్య అపురూపసుందరి పైగా వయసులో వున్న దొరసాని. తనా కాస్త నుదురు నెరిసిన పరాయి దేశస్థుడు అలాంటప్పుడు యిల్లాలి తప్పులు పట్టి ఆమెని యింటిలోంచి వెలివేయాలనుకోటం వెర్రి తనమే మరి

రంగులు హంగులు పైన వేసుకుని రోడ్డునపడే ఈ యింగ్లీష్ ఆడవాళ్ళ తీరు తెన్నులు తిరుగుళ్ళూ అన్నీ తెలిసి వుండికూడా వెండిమీద మోజుపడి మెడకి దిగవేసుకున్నాడు ఆ గుది బండిని యిప్పుడు వూపిరాడడంలేదని వాపోటంలో అర్థంలేదు ఆల్రైట్ తనని మోసంచేసి వెండి మరొకడితో తిరుగుతోంది క్షమించరాని తప్పే చేస్తోంది అలా అని మీదపడి చావబాదితే పోయేది తన పరువేగా కట్టుకున్నాక పతిత అయితేనేమి పతివ్రత అయితే-నేమి ఎవరైనా ఒకటే పేరుకి పెళ్ళాం అందులో

యిలాంటి దేశాలు వచ్చి బ్రతుకుతూ అలాంటి అల్ప విషయాల్లో తలదూర్చి తలక్రిందులవ్వటం శుద్ధ అవివేకం....

ఇదీ ఆయన విజ్ఞాన వివేకాలు ఆయనకి ప్రబోధించిన వేదాంతం.

ఏది ఏమైనా ఆయన వేడి నిట్టూర్పులు చల్లబడ్డాయి. మనసు కుదటపడింది. చెలరేగిన పెనుతుఫాను సద్దుమణిగినట్టు.

పరవళిస్తున్న నార్త్‌వేల్స్ ప్రకృతికి పరవశించో, మూగవేదనకీ మానవత్వానికీ మధ్య రాజీ కుదిరో, ఎందుకో తెలీదు కాని మొత్తానికి మామూలు మనిషిని అయ్యాను అనిపించారు శంకరరావు. మూడు వందల మైళ్ళ రైలు ప్రయాణాన్ని ఓ మూడున్నర గంటల్లో ముగించి నిశ్చలమైన మనసుతో వుల్లాసంగా యిల్లు చేరుకున్నారు ఆయన.

గుమ్మంముందు ఆగివున్న మినీ మెట్రో కారు చూడగానే ఆయన కనుబొమలు ముడిపడ్డాయి.

అనుమానదేవత ఎలుగెత్తి ఎదలో కేకలు వేస్తుంటే ఆయనలో ఏదో తెలియని సంచలనం ఏర్పడింది మళ్ళీ.

తన దగ్గరవున్న స్పేర్ తాళం చెవితో సింహద్వారానికి వేసివున్న సెక్యూరిటీ లాక్‌తీసి నెమ్మదిగా లోపలికి నడిచారు.

నిశ్శబ్దంగా నిర్మానుష్యంగా వున్నాయి క్రింది గదులన్నీ.

చప్పుడు కాకుండా చేతిలో సూట్కేసు మెట్లదగ్గర వదిలి, మెల్లగా మేడ ఎక్కారు అదురుతున్న గుండెల్ని అరచేతిలో పెట్టి పట్టుకున్నట్లు గుప్పిళ్ళు గట్టిగా బిగించి నడుస్తూ.

బెడ్‌రూమ్ లోంచి సన్నగా మాటలు వినిపించటంతో చటుక్కున తలుపుదగ్గరే ఆగిపోయారు రావుగారు.

"డార్లింగ్.. అయామ్ సో హేపీ టుడే." వెండీ గొంతుకలో విలాసం శంకరరావుగారిని వుడికెత్తించింది.

"అయ్ టూ... స్వీట్ హార్ట్.."

ఓ మగకంఠం మన్మదావస్థలో మెలితిరిగింది.

కొన్ని క్షణాలు ముద్దుల వర్షం కుండపోతగా కురిసిన శబ్దం అయ్యింది.

"ఊ.."

"ప్లీజ్.. ఒన్ మోర్.."

"దట్స్ ఎనాఫ్.."

"......."

"అయ్‌సే స్టాప్.." వెండీ మురిపెంపు వినవచ్చింది.

"కమాన్ డార్లింగ్" పట్టువిడవని విటుకాడు ఆమెను వుక్కిరిబిక్కిరి చేస్తున్నాడు యింకా

"ఆ...."

చాటుగా చెవిపెట్టి వింటున్న శంకరరావుగారికి శివమెత్తిపోయింది.

"ఈ కులటనా తను క్షమించాలనుకుంది."

## స్వాగత నివాళి

కవితా నవ వసంత
కమనీయ విపంచిక
నాయెదలో నించెను
నవ్య స్వన మాధురి
క్రౌంచిపురు పసందులు
కోకిల కూజితములు
పిరి కన్నెల నవ్వులు
వెన్నెల తొలి చిందులు
ప్రసరించెడు ఉగాది
పర్వమిదె యే తెంచెను
సకల ప్రజానీకము
సమ్మోదము చెందెను
కవిగాయక ప్రముఖ
కళాకారుల యెదల
నవనవ చైతన్యము
నాట్య ఫణితి నలరెను
రంగుల హరి విల్లయి
పొంగి ప్రమోద దీప్తి
వసంత లక్ష్మికి ఘన
స్వాగత హారతి నిడె!

- జ్యోతి

## మందుటిండలో మంచుబొమ్మలు

గిరుక్కున వెనక్కు తిరిగి కిచెన్ వైపు వెళ్ళారు కార్పెట్ పరచిన మెట్లమీద దెబ్బతిన్న బెబ్బులిలా పరుగెడ్తూ.

కిచెన్ కప్‌బర్డ్‌లోంచి కార్వింగ్ నైఫ్‌తీసి పట్టుకుని వచ్చినంతవేగంగా మళ్ళీ పైకి చేరుకుని, కాలితో బలంగా తన్నారు పడక గది తలుపు మీద.

భళ్ళున తెరుచుకుంది ఆ వూపుకి గొళ్ళెం విరిగి.

ఎదురుగా వెండీ ప్రియుడి వడిలో తలపెట్టుకుని అర్ధనగ్నంగా పడుకుని అమెరికన్ గ్రేప్స్ ఆరగిస్తోంది. విటుడు వ్రేళ్ళతో గుత్తి ఎత్తిపట్టుకుని విలాసిని నోటికి అందిస్తుంటే సుతారంగా స్వీకరిస్తూ.

పగపట్టిన పాములా బుసలు కొడ్తూ నిలబడ్డ భర్తని చూసి బెంబేలుపడింది వెండీ.

ఎక్కడో పడివున్న వుడుపులకోసం కంగారుగా లేస్తూ.

"యు బ్లడీ రాటెన్ యింగ్లీష్ బాస్టర్డ్స్.... ఇదా నా కళ్ళుకప్పి మీరు చేస్తున్న పాడుపని... యు సన్ ఆఫ్ ఎ బిచ్.. ఎంత ధైర్యంరా నీకు..

నా భార్యని బుట్టలో వేసుకోటమే కాకుండా ఆఖరికి నాయింట్లోనే మకాం పెట్టి యింత ఘోర పాతకానికి తలపెడ్తావా... నువ్వు మాత్రం తీసిపోయావా బ్లడీ బిచ్ నమ్మించి ఎంత మోసం చేశావే...నీ అంతం చూస్తానుండు..." బిగ్గరగా అరుస్తూ వెండీ మీదకు వురికారు శంకరరావు వెర్రిగా. ఆవేశంలో నో అలవాటు లోనో అక్కడక్కడ అచ్చ తెలుగు వుచ్చరిస్తూ.

చేతిలో కత్తిచూసి కెవ్వున అరిచింది.

పీటర్ అడ్డపడి నిలబడ్డాడు శంకరరావు గారిని ఎదిరించటానికి సిద్ధమవుతూ.

"గెట్ అవుట్ ఆఫ్ మై వే..బాస్టర్డ్.." కత్తి ఝళిపిస్తూ క్రూరంగా మీదకు వచ్చారు శంకరరావు.

"డోంట్ బి ఎ ఫూల్ డాక్.. ప్లీజ్..కామ్ డౌన్.. వెయిట్ ఎ మినిట్.. అయ్ విల్ గో నౌ.. ఓ కె... లిసన్ టుమి..అయ్ విల్ నెవ్వర్ ఎవ్వర్ సి హెర్ ఎగెయిన్.. సారీఫర్ ఆల్ దిస్.."

అతి వినయంగా నివేదించు కున్నాడు పీటర్ శంకరరావు గారిని శాంతింప చేయటానికి పిచ్చిగా ప్రయత్నిస్తూ. అయినా వుగ్రరూపం వీడలేదు ఆయన. పళ్ళు పటపటా కొరుకుతూ, వికృతంగా ముఖం పెట్టి. మీది మీదికి వస్తుంటే పీటర్ వెండీ ఒకరి నొకరు గట్టిగా పట్టుకుని వెనక్కు తగ్గారు.

"ఈ ఏడ్పు ముందే ఏడ్వక పోయారా.. స్కౌండ్రల్స్.. ఏమగాడూ భరించలేడు రా యింట్లో ఆడది యింత పాపిష్టి పని చేస్తుంటే..నో...అయ్ విల్ నెవ్వర్ స్పేర్ యు బాస్టర్డ్స్.. మిమ్మల్ని చంపితే గాని నా మనసు శాంతించదురా........"

ఒక్క వూపున ముందుకు వచ్చారు శంకరరావు. కత్తి ఆ దొంగాడి గుండెల్లో దిగవేయాలన్న కోపంతో

పీటర్ తెలివిగా ప్రక్కకు వరిగి కత్తి పోటు తప్పించు కున్నాడు. ఆయన చేయి వెలివేసి పట్టుకుని తృటిలో తెరుకుని నేర్చుకున్న కరాటే విద్య ప్రయోగించాడు ఆ పెద్ద మనిషి మీద

"ఓ మై గాడ్" ఆర్తనాదం చేస్తూ చేతిలో కత్తి జార విడిచారు శంకరరావు.

అవకాశం వదులు కోకుండా ఆయన్ని రెండు చేతులతో పైకెత్తి నేల మీద కుదవేశాడు పీటర్ పౌరుషంగా.

ఆ వూపుకి తట్టుకో లేక తూలి బెడ్ సైడ్ కేబినెట్ మీద పడ్డారు శంకరరావు అమాంతంగా.

నేలకు వరిగిన రావు గారు మళ్ళీ లేవలేదు ఆ దెబ్బతో.

"వాట్ హేపెండ్ టు హిమ్" విస్తుపోయింది వెండి.

పీటర్ పిచ్చిగా చూశాడు ఏం చేయాలో పాలుపోక.

పరుగెత్తి దగ్గరకి వెళ్ళి నాడి పట్టుకుని పరీక్షించింది వెండీ.

"మైగాడ్...వాట్ హేవ్ యు డన్ టు హిమ్.."

శంకరరావు గారి శరీరం చేతికి చల్లగా తగల గానే వెల వెల పోయింది వెండీ ముఖం, కత్తి వాటుకి కూడా నెత్తురు చుక్క చిమ్మనంతగా పాలి పోతూ.

అలా జరుగు తుందని వూహించ లేదేమో నిలు వెల్లా వణికి పోయాడు ఆ ధొరబాబు, నిశ్చేష్టుడై నిలబడి పోయి.

ఎదలో పేరుకున్న ఆవేదన ఆఖరికి రక్త రూపం దాల్చి చిట్లిన శంకరరావు గారి నుదుట నుంచి కరిగి కారుతుంటే చెక్కిన శిల్పాల్లా చేష్టలుడిగి చూస్తుండి పోయింది ఆ తెల్ల జంట, కొన్ని క్షణాలు ఏం చేయాలో తోచక.

"అయ్ కాంట్ ఫీల్ హిజ్ పల్స్..."

వున్నట్టుండి వెండీ కళ్ళల్లో కొత్త కళ తచ్చాడింది.

"ఓ .. లార్డ్ జీసస్.. అయితే నిజంగా చంపేశానంటావా" పిరికిగా వాపోయాడు పీటర్.

"డోంట్ వర్రీ... నాకో మంచి ఐడియా వచ్చింది... గివ్ మి ఎ హేండ్"

అంది వెండీ చురుకుగా భర్త శరీరం కార్పెట్ మీద నుండి లేపటానికి ప్రయత్నిస్తూ.

"ఏమిటి వెండీ నీ వుద్దేశం.. యిప్పుడు ఏం చేద్దామనుకుంటున్నావ్".

"చూడు పీటర్ నువ్వు యిలా గాభరా పడి లాభం లేదు.. యిలాంటప్పుడే మనిషికి కాస్త ధైర్యం కావాలి.. అండర్ స్టేండ్... లిసన్ టు మి... అనవసరంగా మనం కాలయాపన చేశామంటే మళ్ళీ యిలాంటి అవకాశం చిక్కదు. అందుచేత నేను చెప్పినట్లు చేయి.. ఓ కె..." కంగారుగా హెచ్చరించింది వెండీ చిరుకోపం ప్రదర్శిస్తూ.

"ఆల్ రైట్... వాటీజ్ ఆన్ యువర్ మైండ్...."

## మండుటెండలో మంచుబొమ్మలు

దుడుకుగా దగ్గరకు వచ్చాడు పీటర్.

"హెల్ప్ మి.." శంకరరావు గారి శరీరాన్ని ఎత్తి మోయ లేక వగర్చింది వెండీ.

"వాట్...."

"అయ్ సే కేరీ హిమ్..." అరిచింది అసహనంగా.

కిక్కురు మనకుండా వెండీ మాట పాటించాడు పీటర్, అయోమయంగా అడుగులో అడుగు వేసి ఆ వన్నెల లేడిని అనుసరిస్తూ.

*　　　*　　　*

మెదడుకి తగిలిన విపరీతమైన దెబ్బలతో రావుగారికి పూర్తిగా తెలివి తప్పింది. వెంటనే పెద్దహాస్పిటల్‌లో చేర్చినా, ఎన్నెన్నో బ్రెయిన్ స్కేన్‌లు, అల్ట్రాసౌండ్‌ల వంటి అత్యాధునికమైన యంత్రాలు వుపయోగించి తనిఖీలు చేసినా ఆంగ్లేయ వైద్య నిపుణులు మాత్రం ఆయన బుర్రలో పేరుకొన్న రక్తపు గడ్డలమీద దండయాత్ర సాగించి విజయం సాధించలేకపోయారు.

ఆ ఘాతంలోంచి శంకరరావుగారు కోలుకోలేకపోయారు. ఆయన మెదడులో రక్తపునాళాలు అతకలేనంతగా చితికిపోయి మందులు మాకులు యిచ్చి మాన్పించలేని సబ్ ఎరకోనాయిడ్ హెమరేజ్ సృష్టించటంతో ఎవరు చేయగలిగింది ఏమీ లేకపోయింది.

చివరి వూపిరి వదిలి శాశ్వతంగా కనుమూశారు శంకరరావు ఆఖరికి. ఆ ఘోర ప్రమాదం జరిగిన వారానికో??

ఒకరి చావుకి మరొకరు కారణం కాదని నిరూపించుకోవటం ఆంగ్లేయ చట్టానికి అనాదిగా అలవాటే. శంకరరావుగారి విషయంలో కూడా తుచ తప్పకుండా తన కర్తవ్యం నిర్వర్తించింది న్యాయపీఠం. "ఆ పెద్దమనిషి మరణానికి గల కారణం ఏమిటో కనిపెట్టవలసిందిగా" వూరి కరోనర్‌ని ఆదేశిస్తూ.

వెండీ తగు జాగ్రత్త తీసుకుంది. ఓ ప్రజ్ఞావంతుడైన వకీలు వాక్చాతుర్యాన్ని వెయ్యి పౌండ్లు యిచ్చి కొనుగోలు చేసి.

"తల తిరిగో, కాలు జారో వున్న మెట్లన్నీ ఒక్కసారిగా ధిగటానికి ప్రయత్నించటంతో తట్టుకోలేక బోల్తా పడ్డాడు తన మగడు.... దాని ఫలితమే ఈ దారుణమంతా అని వెండీ నేర్పుగా కల్పించి చెప్పిన కట్టు కథని నిజంచేసి నిరూపించాడు లోకానికి ఆ ఇంగ్లీష్ లాయర్.

"డెత్ బై ఏక్సిడెంట్...." అన్న తీర్మానంతో తుది పలుకులు రాసింది కరోనర్స్ కోర్ట్ ఆ తెలుగుబిడ్డ చరిత్రని అంతటితో ముగిస్తూ??

★　★　★　★　★

పడ్డ కష్టానికి ఫలితం దక్కుతుందని వుర్రూతలూగింది వెండీ. కాని దగాపడి దిగాలుపడిపోయింది ఆ దంతపు బొమ్మ అసలు నిజం తెలియగానే? వెండీ విసిరిన వలపులలో చిక్కుకుని తన సర్వస్వం కోల్పోయినా తనకోసం సమస్తం ధారపోసిన తొలి భార్య ఋణం మాత్రం మర్చిపోకుండా తీర్చేసుకున్నాడు ఆయన, అన్న సంగతి ఆఖరికి బయటపడింది. శంకరరావుగారు తన ఆస్తితో భాగంగా తన ముద్దుల యిల్లాలికి ప్రత్యేకంగా రాసిచ్చిన ఓ పదివేల పౌండ్ల చెక్కుని రావుగారి సొంత వకీలు వెండీకి రిజిస్టర్డ్ పోస్ట్‌లో పంపగా?

లంకంత లోగిలితో పాటు తను గడించిన ఆస్తిపాస్తులు, యిన్సూరెన్స్ డబ్బులు అంతా కలిపి ఓ పదిలక్షల పౌండ్లకు పైగా వుంటుందని ముందే గుర్తించి, ఆ సంపాదనంతా భారతీదేవి తరపు వారికీ, తనతో బుట్టువులికీ చెందేటట్లు ఎప్పుడో ఓ పెద్ద వీలునామా రాసిపెట్టి రహస్యంగా దాచి వుంచారు శంకరరావుగారు తన లాయర్‌తో లౌకికంగా లాలూచీపడి!

తన కష్టార్జితం చేరవలసిన చోటుకి చేరుకుంటోదని ఆ చంచలవతికి అంతకుముందే తెలిస్తే తనకంటే ముందు తన ఆస్తిని ఎలా హరించివేయగలదో ఆ అఘాంతకురాలు ఆయనకి బాగా తెలుసు. అందుకే కుక్క కాటుకి చెప్పు దెబ్బే మంచిదన్న సామెతని నిరూపించిపోయారు రావుగారు.

కనీసం పరలోకంలో అయినా పొరపాటున భారతీదేవి ఎదురై నిలదీసి అడిగితే నేరస్థుడిలా నసగాల్సిన పని వుండదేమో ఆయనకి??!

(అయిపోయింది)





నేటి ఆదాయంలో పొదుపు
భవిష్యత్తులో బంగారు మలుపు
మీకు బిడ్డపుట్టగానే ఆరేళ్లపాటు ప్రతినెలా 50రూ॥ల
పొదుపు సర్టిఫికెట్లుకొని మరల ఆ మొత్తాన్ని 18ఏళ్ళు
అందులోనే దాచుకోండి. 19వఏటనుంచి ఆరేళ్లపాటు
ప్రతినెలాలభించే రూ.400/- మీ పాప ఉన్నతవిద్యకు
ఉపకరిస్తాయి.
వివరాలకు
కమీషనర్
స్మాల్ సేవింగ్స్
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
(ఫైనాన్స్ విభాగం)
హైదరాబాద్ - 500 022
ఫోన్: 224410,
222886




(గత సంచిక తరువాయి)

అనిత చక్రపురం వెళ్ళాక విజయ్‌కు తన సర్వస్వం కోల్పోయినట్లుగా వుంది.

అనితను కలుసుకొనే అవకాశం లేకుండా చేసుకున్నాడా? దిగులు

ఇల్లు వదిలి బైటికి రావడం లేదు ఆఫీసుకు గూడా కొన్నాళ్ళు రానని చెప్పాడు

అనిత ఇక్కడుంటే బాధ పడుతుందని పంపించాను కాని ఆమె ఈ ఊర్లో లేదనుకుంటే నాలో ఏదో భాగం లేనట్లుగా వుందిరా తనను చూసేందుకు వచ్చిన భార్గవతో అన్నాడు

అతడు ప్రొద్దుట నుండీ జ్వరంతో లేవటం లేదని నాయర్ ఫోన్ చేస్తే వచ్చాడు భార్గవ

పోనీ అనిత గారిని ఇక్కడికి రమ్మని చెప్పనా?

వద్దొద్దు కంగారుగా అన్నాడు విజయ్

అనిత ఇక్కడ వుండలేదు

"కాని నువ్వెన్నాళ్ళిలా బాధపడతావురా

నా బాధ వేరు అనిత బాధ వేరు అనితను ఈ లోకం మాటలతో హింసిస్తుంది

విజయ్ అభిమానంగా చూశాడు

"అనిత గారెంత అదృష్టవంతులురా ఆమె నిన్ను ద్వేషిస్తున్నా నీకు ఆమె మీద ప్రేమ తరగలేదు"

"భార్గవా, అనిత గురించి నీకు తెలియదు ఆమె ద్వేషించినా కోపించినా వాటి వెనుక ప్రేముందిరా అది ఎవ్వరికి కనిపించదు అనిత తనను ప్రేమించడం లేదంటే ఒప్పుకోడు విజయ్

ప్రేమ లేనప్పుడు ద్వేషం వుండదు కోపం వుండదు

భార్గవ ఏం మాట్లాడలేకపోయాడు

> **జరిగిన కథ :–** 9 అనిత విధవైనా ఆమెను ప్రేమించి పెళ్ళి చేసుకొంటాడు విజయ్ అనిత మేనత్త కొడుకు రమేష్ వల్ల వాళ్ళిద్దరి మధ్య అపోహలు తలెత్తాయి ఆఖరికి అనిత విజయ్‌ను వదిలేసి తండ్రి దగ్గరకు వచ్చేసింది అనిత తండ్రి యాక్సిడెంటులో మరణించారు అనిత, విజయ్‌ల మేరేజ్ డే నాడే ఎవరో ప్రముఖ రచయిత్రి అనితాదేవి అసలు రూపం" అని పేపర్లో వేయిస్తే ఆ పని విజయే చేసి ఉంటాడని అతడిని నిలదీసి అడుగుతుంది అనిత మారేజ్ డే నాడే పేపరులో ఇలాంటి వార్త రావటం చూసి అనిత ఎంత బాధ పడుతుందో అని తన స్నేహితులతో అంటాడు విజయ్ అతనికి ఇప్పటికీ భార్య అంటె అమితమైన ప్రేమ అనిత ఉద్యోగానికి రాజీనామా ఇచ్చింది అనిత బాధ చూడలేని విజయ్ ఆమెను చక్రపురానికి పంపిస్తే బాగుంటుందని మిత్రుల దగ్గర అంటాడు అనితను సుధాకర్ చక్రపురం తీసుకెళ్ళాడు కానీ ఆ ఊరి వాళ్ళు ఆదరించకపోగా వెక్కిరింతలతో మరింత బాధలకు గురి చేసారు ఆమెకు మతి భ్రమించింది

మాసిన గడ్డం లోతుకు పోయిన కళ్ళు విజయ్‌ను చూస్తుంటే జ్వరం కన్నా దిగులే ఎక్కువగా వుందనిపిస్తోంది

ఒక్కడివే వుంటె ఆలోచనలతో మనసు పాడు చేసుకుంటావు మా యింటికి వెళ్దాంరా అన్నాడు భార్గవ

లేదురా నేనెక్కడికీ రాలేను నువ్వెళ్ళు అనిత ఇంటి నుండి వెళ్ళినప్పుడే నేనేం కాలేదు ఇప్పుడెందుకు భయం? అన్నాడు విజయ్

భయం కాదురా బాధ నిన్నిలా చూస్తూ వూరుకోలేము

నేనేమీ కానురా నా కోసం బాధపడకు అన్నాడు విజయ్

జ్వరం తగ్గే వరకు నువ్వు మా యింట్లో వుంటె నాకు తృప్తిగా వుంటుంది భార్గవ బ్రతిమాలాడు

నాకు ఒంటరితనమే కావాలనిపిస్తోంది నన్ను ఇబ్బంది పెట్టకురా అన్నాడు విజయ్

భార్గవ ఇంటికి వచ్చి అతడి విషయం చెబుతోంటే వినలేని దానిలా చూసింది భారతి

వాడిక ఇలాగే వుంటే మనిషి దక్కకపోవచ్చు" విచారంగా అన్న అతడి మాటలు విని తృళ్ళిపడింది భారతి

ఏమిటన్నయ్యా ఆ మాటలు? కలవరాన్ని దాచుకుంటూ అంది

మాటలు కాదమ్మా వాడ్ని చూస్తే అలా అనిపిస్తోంది అనిత వస్తే తప్ప అతడు కోలుకోలేడేమో కాని ఆమె నెలా ఇక్కడికి తేవడం? ఆమె మొండి మనిషి విజయ్‌ను అర్థం చేసుకోలేదు

భారతి అతడి మాటలు వినడంలేదు

విజయ్ కేదైనా అయితే ఆ పాపానికి బాధ్యురాలు తనే గుండె దడ దడ మంటున్నది

విజయ్ అనురాగాన్ని ఏ రాతలు చేతలు గూడా భగ్నం చెయ్యలేక పోయాయి అతడి హృదయంలో అనిత స్థానం ఎవరూ పొందలేరు ఆ అనురాగ సౌధం అనిత స్వంతం

భార్గవ వెళ్ళాక తన గదిలోకి వచ్చింది భారతి

తను ఇలా జరుగుతుందనుకోలేదు విజయ్‌లో మార్పు వస్తుందని, అతడి బాధ దూరం అవుతుందని అనుకుంది కాని కాని తన స్వార్థం అతడ్ని బలిగొనబోతోంది తనింకా ఇలాగే చూస్తూ కూర్చోలేదు తన జీవితం ఏమైనా పరవాలేదు తనను అతడేమన్నా పరవాలేదు నిజం చెప్పెయ్యాలి కలం, కాగితం తీసుకొని టేబుల్ ముందు కూర్చుంది

అనిత గురించి పేపర్లో వచ్చిన రోజునుండి తనకి రోజావరకు శాంతి లేదు లెటర్ వ్రాస్తుంటే హృదయం తేలికౌతోంది

తన తప్పును దిద్దుకొనేందుకు ఇంతకన్నా మార్గంలేదు వ్రాయడం పూర్తికాగానే అమ్మా ఇప్పుడే వస్తాను అంటూ వంటింటి దగ్గరికి వచ్చి చెప్పి బైటికి నడిచింది

* * * *

విజయ్‌కు హార్లిక్స్ ఇచ్చేందుకు పైకి వెళుతున్న నాయర్ ఎవరో యువతి రావడం చూసి ఆగాడు

విజయ్ గారున్నారా? ఆమె లోపలికి వచ్చి అడిగింది

ఒంట్లో బాగోలేదు పడుకొని వున్నారు " అన్నాడు నాయర్

నేను అతడితో అర్జంట్‌గా మాట్లాడాలని చెప్పు ఆమె ముఖంలో ఆత్రం, ఆందోళన ఒకదానికొకటి పోటీ పడుతున్నాయి

"చెప్పొస్తాను " అంటూ నాయర్ పైకి వెళుతోంటే అతడి జవాబు కోసం ఎదురు చూడలేనన్నట్లుగా అతడి వెనుకే వెళ్ళిందామె

నాయర్ గదిలోకి వెళ్ళగానే చెప్పాడు "మీకోసం ఎవరో వచ్చారు తొందరగా మాట్లాడాలట "

"పైకి రమ్మనక పోయావా? విజయ్ మాట పూర్తికాక ముందే ఆ యువతి గదిలోకి ప్రవేశించింది

ఈమే మీకోసం వచ్చింది  నాయర్ చెప్పాడు

విజయ్ ఆమెవంక చూశాడు  ఎక్కడా చూసిన గుర్తు లేదు  ఎవరో ఎందుకు వచ్చిందో

అతడి చూపుల కర్థం తెలిసిన దానిలా  నా పేరు నళిని  నేను భారతి స్నేహితురాలిని  అందామె

కూర్చోండి  అన్నాడు విజయ్

లేదండి  కూర్చొని మాట్లాడే టైంలేదు  భారతి అఘాయిత్యమేదైనా చేసుకుంటుందేమోనని భయంగా వుంది

భారతి అఘాయిత్యం చేసుకోడమా? ఎందుకు? విస్మయంగా చూశాడు విజయ్

ఈ లెటర్ చూడండి  అంటూ లెటర్ అతడి చేతి కిచ్చింది

విజయ్ ఆత్రంగా కాగితం మడతలు విప్పాడు

విజయ్,

నేను స్వయంగా వచ్చి మీతో మాట్లాడాలను కున్నాను  కాని ధైర్యంలేక లెటర్ వ్రాస్తున్నాను  ఇది చూసి మీరు నన్ను అసహ్యించు కుంటారని తెలుసు  అయినా వ్రాయకుండా వుండలేక పోతున్నాను  నే నెప్పుడో  చెయ్యాల్సిన పని ఇది  ఆలోచన రాలేదు  మీ బాధ చూస్తూ వూరుకోలేనింక  నేను చేసిన తప్పు చెప్పేస్తాను  ఈ బారం దించుకుంటాను  విజయ్, నేను  మిమ్మల్ని కోరుకున్నాను  అది చదవగానే విజయ్ శిలా ప్రతిమే అయ్యాడు

భారతి తనను కోరడమా  ఆశ్చర్యంగా వుందతనికి  తనెప్పుడూ ఆమె కా వూహ కలిగేలా ప్రవర్తించలేదే!  చూపులు అక్షరాల వైపు మళ్ళించాడు మళ్ళీ

ఆశ్చర్య పడకండి విజయ్  నాకు బుద్ధి తెలిసి నప్పటి నుండి నాకు తెలియకుండానే మీరు నా హృదయంలో నిలిచారు  అలాగే మీ గుండెలో నేను నిలిచి వుంటానని, మీరే ఏదో ఒకరోజు ఆ విషయం బైట పెడతారని, లేకపోతే అన్నయ్యో ఈ విషయం కదుపుతాడని అనుకున్నాను  ఎన్నో కలలు గన్నాను  ఇంట్లో ఎవ్వరికి నా మనసు తెలపలేదు



# పసిడిబొమ్మ

మీరు ఎదురుగా వుంటే ఏదో తెలియని ఆనందం మీ చిరునవ్వు నా మదిలో రాగలతను పూయించేది విజయ్ కధి చదువుతుంటే భారతి ఎదురుగా వుండి చెబుతున్నట్లే వుంది

భారతి, నీవు నన్ను అన్నయ్యలా చూస్తున్నావనే అనుకున్నాను కాని నా మీద ఆశ పెంచుకుంటున్నావని తెలుసుకో లేదమ్మా తెలిసుంటే ఆ ఆశను అప్పుడే అణిచేసే వాణ్ని తోబుట్టువులు లేని నేను, నువ్వే చెల్లెలివనుకున్నాను నిట్టూర్చి చదవసాగాడు.

ఎప్పుడో ఆనందకరమైన వార్త వింటానను కుంటున్న నాకు మీరు అనితాదేవిని చేసుకో బోతున్నారని తెలియగానే ప్రపంచమే స్థంభించి పోయినట్లనిపించింది

నేను ఆరాధిస్తున్న వ్యక్తి మరొకరి స్వంతం కాబోతున్నాడంటే విజయ్ ఆబాధ చెప్పలేను అప్పుడే వచ్చి నా మనసు మీకు తెలుపుదామనుకున్నాను

కాని మీరు నన్ను కోరడం లేదని తెలిశాక అలా రావడంలో అర్ధం-లేదనిపించింది నేనా మాట చెబితే మీరు కోప్పడతారేమోనన్న భయంగూడా కలిగింది మరో వైపు అందుకే మీ దగ్గరికి రాలేదు

కాని అనితాదేవి మీనుండి విడిపోయాక నాలో అణగారిన కోరిక నిద్రలేచింది ఎలాగైనా మీదాన్ని కావాలన్న తహ తహ మొదలయింది రోజులు గడిచినా ఆమె మీ దగ్గరికి రాలేదు నాలో ఆశల అలలు లేచాయి

ఆ సమయంలో నా స్నేహితురాలొకామె నాకో సలహా ఇచ్చింది తనకు వెలుగు పత్రికలో తెలిసిన వాళ్ళున్నారని, ఆ పత్రికలో అనితాదేవి మీనుండి విడిపోయిన విషయం ప్రచురిస్తే ఆమె మిమ్మల్ని కలుసుకొనే అవకాశం వుంటుంది లేదా పూర్తిగా బంధాన్ని త్రెంచుకుంటారు అప్పుడు నేను నా కలను నిజం చేసుకునే ప్రయత్నం చెయ్యొచ్చునంది చాలా రోజులు దాని గురించి ఆలోచించాను

ఎందుకాలోచన? నువ్వు చేస్తున్నదేముంది? వాళ్ళిద్దరు విడిపోయే-వున్నారు అంటూ ఆమె ప్రోద్భలం చేసింది

నేను ఒప్పుకున్నాను

అదే నేను చేసిన తప్పు

అది మేము అనుకున్నట్లుగా ఒకరోజు ఆ వార్త ప్రచురించి ఆగలేదు అసలు మేము వ్రాసిన విధంగా కాకుండా మార్పుచేసి వ్రాశారు దానితో అనితాదేవి మీద అందరికీ అనుమానం కలిగింది ఆ విషయం అతడ్ని అడిగితే పాఠకు లందరికీ అర్ధం అయ్యేలా వ్రాశానన్నాడు

అతడితో ఇంకేం మాట్లాడినా ప్రమాదమేనని వెనక్కు వచ్చేశాము

మాటల సందర్భంలో ఎప్పుడో అనితాదేవిని ఆమె బంధువు, విదేశంలో వుండివచ్చినవాడు అయిన డాక్టర్ రమేష్ పెడద్రోవ పట్టిస్తున్నాడని అన్నాను ఆ మాట పట్టుకొని మేము వ్రాసిన దాన్ని మార్పుచేసి వ్రాశాడతడు రమేష్ పేరు అతడికి గుర్తులేదట అందుకే పేపరులో అతడి పేరు రాలేదు

ఆ పేపరు వార్త మిమ్మల్ని, అనితగారిని కలిపివుంటే నాకీ బాధ లేకపోవడమేకాదు చాలా సంతోషంగా వుండేది మీరు అనితా దేవిని కాదని నా వారు కావాలని నేనెప్పుడూ కోరుకోలేదు

నా దురదృష్టం ఆ పేరు వార్త నాకోరిక నేరవేర్పలేకపోగా, నాకు జీవితమే వద్దనిపించేట్లు చేసింది

ఆ వార్త పాఠక లోకంలో సంచలనం తెచ్చింది దానితో పత్రికల వాళ్ళో విషయ సేకరణకు పూనుకున్నారు

ఒకవార్తను అల్లుకొని ఎన్నో వార్తలు

రోజుకో విశేషం

నాకు రోజుకో కొత్త కఠిన శిక్ష అనుభవిస్తున్నట్లుగా వుండేది ఒకొక్కసారి







నన్ను నేనేచంపుకోవాలన్నంత బాధ కలిగేది.

నేనే వాటికి తట్టుకోలేక పోతున్నానంటే మీరు, అనితాదేవి ఎంత బాధ పడుతున్నారో.... అనుకుంటే దిగులు.... నామీద నాకే కోపం....

విజయ్, ఇంతబాధలోనూ నాకు ఆశ్చర్యం కలిగించే విషయం అనితాదేవి మీద మీ అనురాగం తరగక పోవడం....

ఎవరేమన్నా పత్రికలేం వ్రాసినా మీ గుండెలో అనితాదేవి స్థానం చెక్కు-చెదరలేదు. ఎంత మమత మీది! ఆ మమతకు అనితాదేవి దూరం కాకూడదు. అనితాగారిని మీ దగ్గరికి చేరుస్తాను. ఆ ప్రయత్నం మీదే వున్నానిప్పుడు. ఆమె మిమ్మల్ని నమ్మదన్న భయంలేదు నాకు. ఎందుకంటే ఈ లెటర్‌తో పాటే పత్రిక వాళ్ళకు గూడా లెటర్ వ్రాస్తున్నాను. రేపు పేపరులో వస్తుంది. అనితాదేవి తన తప్పు తెలుసుకుంటుంది. వుంటాను విజయ్...." చదవడం పూర్తి కాగానే విజయ్ మంచంమీదినుండి లేచాడు.

"భారతి ఎక్కడుందిప్పుడు?" ఆందోళనగా అడిగాడు.

"చక్రపురం వెళతానన్నది. నన్ను పత్రికల వాళ్ళకు లెటర్ ఇచ్చాకే మీ కివ్వమని ఒట్టువేయించుకుంది. కాని అనితాదేవిగారిని గురించి పేపరు కిచ్చిన అనుభవం గుర్తొచ్చి ఆ పని చెయ్యలేకపోయాను."

"అంటే పేపరులో వ్రాయించమన్నది నువ్వేనన్నమాట."

ఆ యువతి తల వంచుకుంది.

"ఇలా జరుగుతుందనుకోలేదు. క్షమాపణ చెప్పుకోవాలనే నేను వచ్చాను."

"మంచి పని చేశావు...." కోపంగా అని గది వెలుపలకి వస్తూ ఏదో గుర్తొచ్చిన వాడిలా వెనక్కు తిరిగి వెళ్ళి ఫోన్ రింగ్ చేశాడు.

"హలో భార్గవా.... నేను భారతిని తీసుకొని చక్రపురం వెళుతున్నాను. ఆమె కనిపించలేదని మీరు కంగారు పడతారని ఫోన్ చేస్తున్నాను. ఇప్పుడింతకన్నా ఏం చెప్పలేను. చక్రపురంనుండి రాగానే వివరంగా చెబుతాను." అని ఫోన్ పెట్టేసి బైటికి వచ్చాడు.

అతడికి దుస్తులు మార్చుకోవాలని కాని, తల దువ్వుకోవాలని కాని ఆలోచన రాలేదు.

'భారతి బస్టాండులో వుందో.... లేదో....' కలవరంగా వుంది. అంతవరకు నీరసంగా లేచేందుకు గూడా చేత గాకుండా వున్న అతడికి ఆ భయమే శక్తి నిచ్చినట్లుంది.

'భారతి బస్టాండులో లేకపోతే బస్సుదొరికి చక్రపురం వెళ్ళివుంటుంది. తను అక్కడికి వెళ్లాలి....' రేగిన జుత్తు, లాల్చీ పైజమాతోనే ప్రయాణమయ్యాడు. లోపల నళిని వుందన్న విషయమే మరిచాడు.

విజయ్ కారు వెళ్ళిపోగానే నళిని తేలిగ్గా శ్వాస తీసుకొని ఇంటిముఖం పట్టింది.

★ ★ ★ ★ ★ ★

బస్సుకోసం ఎదురు చూస్తున్న భారతి విజయ్ కారు చూడగానే అక్కడి-నుండి వెళ్ళబోయింది కాని అప్పటికే కారు ఆమెను సమీపించింది.

"భారతీ...." విజయ్ పిలవడంతో అడుగు ముందుకు వెయ్యలేకపోయింది.

'నళిని అప్పుడే అతడికి లెటర్ ఇచ్చిందా....' కోపం వచ్చింది. చక్రపురం వెళతానన్నట్లు గూడా చెప్పి వుంటుంది. అతడు అనారోగ్యంగా వున్నా తనకోసం వచ్చాడు. ఏమంటాడో....' భయంగా వుందామెకు.

"ఏమిటి ఇక్కడ నిల్చున్నావు?" అతడు కారుపై దిగకుండానే ఏం తెలియని వాడిలా అడిగేసరికి ఆమెలో భయం పారిపోయింది.

'తన లెటర్ చూసి వుంటే అతడలా మాట్లాడేవాడు కాదు. నళిని ఇంకా లెటర్ ఇచ్చి వుండదు.' అనుకొని "నేను మా స్నేహితురాలి ఊరు వెళుతున్నాను. మీరేమిటి ఒంట్లో బాగోలేకున్నా ఇలా వచ్చారు?" అంది భారతి.

"నేనో పనిమీద వెళుతూ ఇక్కడ నిన్ను చూసి వచ్చాను. నాకో చిన్నపని చేసిపెట్టి వెళుదువు గానిరా." అంటూ అవతలి డోర్ తెరిచాడు.

భారతి వచ్చి కూర్చుంది.

'అతడికి ఒంట్లో బాగోలేదు. ఏదో పని వుందంటే కాదనడం ఎలా?' అనుకుంది.

'తను భారతికి లెటర్ చూసి వచ్చినట్లుగా తెలిస్తే ఆమె రానంటుందేమో!' ఆమె కారెక్కాక ఆ విషయం మాట్లాడాలనుకున్నాడు విజయ్.

కారు వేగంగా పెంచుస్తూ "భారతీ నువ్వు ఇంటికి వెళతావా?" చక్రపురం వెళతావా?" అడిగాడు.

చాచి కొట్టినట్లయింది భారతికి.

"విజయ్.... మీరు...." అతడి మాటలు తన లెటర్ చూసినట్లు తెలుపుతోంటే మాటలు రావడంలేదు."

"నీ లెటర్ చూశాను. నీ స్నేహితురాలు నీవు అనితలా బాధపడగూడదని పత్రిక వాళ్ళకు లెటర్ ఇవ్వకుండా నా దగ్గరికి వచ్చింది."

భారతికి భూమి బ్రద్దలైతే బాగుండుననిపించింది.

అతడి ఎదురుగా కూర్చోలేకపోతోంది.

"విజయ్, నన్నిక్కడ వదిలెయ్యండి...." ఏం మాట్లాడలేని దానిలా దీనంగా అంది.

"లేదమ్మా, నిన్నిలా వదిలేసేందుకు తేవడంలేదు. నీ బాధ నాకు తెలుసు."

"అమ్మా...." అంటూ ఆప్యాయంగా అన్న అతడిమాట భారతి గుండెను బరువు చేసింది.

# ఈ ఉగాది అవనీయరాదు జ్వాలా చిత్రం

ఉదయం ముఖాన ముసుగుకప్పి అందంగా
ఊరేగించే ప్రయత్నం చేస్తున్నారు వీధుల్లో
ఇది ఏదో అలంకారం అనీ పదిమందీ
చుట్టూ చేరితే ఎవరూ కాదనడం లేదు.
ఏవేవో రంగులు మార్చి మార్చి
ఏ ఆలోచన రానీయకుండా ఉదయానికి
మూగిన చీకటి గుంపుల సంరంభం
తెలీని జనం కళ్ళకు రంగుల వల కల్పిస్తూ.
కోట గోడల్నీ ఇనుప గేట్లనీ దూకి
పోతున్నాయి ఎర్రబారిన చూపులు
ఇసుక దిబ్బల్నీ మైదానాల్నీ చుట్టి
వస్తున్నాయి అరుణ కాంతి తోరణాలై.
పల్లెలో నగరంలో ప్రవేశిస్తున్నాయి
పోయిన దారి పొడుగునా అడుగు జాడలు
మధ్య మధ్య విషాద కథలు లేంది చరిత్రలేదు
వెలుగూ చీకటీ అగ్నీ ధూళితోనే ఉంది బ్రతుకు.
చిన్న పిల్లలకు చేసే అందమైన వాగ్దానాలు
పంచి పెడుతున్నారు ఆకర్షకంగా నాయకులు
నిశ్శబ్ద గగనాన్ని రెండు చేతులా పట్టుకునేందుకు
చేస్తున్నారు తమకు తోచిన చిత్ర విచిత్ర ధ్వనులు
సెకండ్లను నిమిషాలూ నిమిషాల్ని గంటలూ
దాటి పరుగెత్తె తొందరలో ఉన్నాయి
కదులుతూంది కాలం లేత చివురు రెక్కలపై
నిలచే ఉంది ముసలి చెట్టు చేతిలో కట్టెపై
కిటికీ నుండి గాలి ఆగి ఆగి వీస్తోంది
మధ్య మధ్య జ్ఞాపకం వచ్చే పద్య పాదాలవలె
సరస్సులో కమలాల వలె మనస్సులో విశ్వాసాలు
చెట్లు కొమ్మల సందులో చీకటివలె వ్యూహాలు,
సుత్తె దెబ్బలకు అనుభవంలో ఎంత
శిల్ప రహస్యం ఆకృతి పొందినా జీవితంలో
రాగ రసం కోసం ప్రతి కణ కణమూ
తప్త మౌతుంది ప్రతీ హృదయం
నక్షత్రాలలో ఆకాశం వలె వెలగాలనే
ప్రతి చెట్టూ తహ తహ లాడుతుంది.
చివుళ్ళూ పూలూ చూచి ఆనందించడమే కాదు
పండ్ల కోసమూ ఆరాట పడుతుంది మనస్సు.
సూర్యుణ్ణీ చంద్రుణ్ణీ పలకరించి వచ్చే ఆలోచనలు
చేదూ వగరూ రుచి చూస్తున్నాయిప్పుడు
నిన్న ఉదయం వ్రాలిన విషాదం ఇంకా
ముఖాలపై రెక్కలు ముడిచి నిలచే వుంది.
ఈ ఉగాది మనసులో పచ్చదనం
అవకూడదు నర్తించే జ్వాలా చిత్రం.
ఈ ఉగాది మనిషిలో సృజన శక్తి
వహించాలి మానవతా మధురాగం.

— మాదిరాజు రంగారావు

## పసిడిబొమ్మ

'ఇతడ్ని తను.... ఛ. ఏం ఆలోచన్లు తనవి....'తనను తనే మందలించు-కుంది.

"నేను అనితగారిని చూడాలి." అతడు ఇంటికి తీసుకెళతాడేమోనని ధైర్యం కూడదీసుకొని చెప్పింది.

"నీవు ఆమెకీ విషయం చబితే నీ బాధ తగ్గుతుంది. కాబట్టే నేను వద్దనడం లేదు కాని నీ పేరు పేపరు కెక్కగూడదమ్మా అది జరిగితే బ్రతుకే భయంకర-మౌతుంది

"నా తప్పుకు శిక్ష అదే

'శిక్ష చిన్నగా నవ్వి ఆమె వంక చూశాడు

"పశ్చాత్తాపం అన్నింటినీ మించిన శిక్ష అది నువ్విప్పుడు అనుభవిస్తున్నావు ఇంకెందుకీ శిక్ష?

"నా కారణంగా మీకు అనితా దేవికి మధ్య అపార్థాలు పెరిపోయాయి ఫీరే ఆమె గురించి పెపర్లో వ్రాయించారనుకుంటోంది అనితాదేవి భారతి స్వరం గాద్గధిగ మయింది

'ఈ పాపానికి ప్రాయశ్చితం వుంటుందని నేను అనుకోడంలేదు

బాధ పడకమ్మా అనిత నీ మాటలు విని నన్ను ద్వేషించడం మానకున్నా అసహ్యించుకోకుండా వుంటుంది నీ చర్యవల్ల వచ్చిన నిందను నువ్వే తొలగించిన తృప్తి నీకుంటుంది అన్నాడు విజయ్

"మీరు జ్వరంతో వున్నారు. ఇంటికి వెళ్ళండి. నేను బస్సులో వెళతాను." కారు మలుపు తిరుగుతుండగా వద్దన్నట్టు స్టీరింగ్ మీద చెయ్యివేసి అంది భారతి.

"నేనేదో పెద్ద జబ్బుతో బాధపడుతున్నట్టు మాట్లాడుతున్నావు. కాస్త జ్వరానికే భయపడితే ఎలా?" అన్నాడు విజయ్.

అనితను చూడబోతున్న ఆనందం అతడికి బాధను తెలియనివ్వడంలేదని తెలుసు?

విజయ్ మౌనంగా కారు నడుపుతున్నాడు. అతడి మనసంతా అనిత దగ్గరే ఉంది

భారతితో ఈ మాట చెప్పించి తనను పిలుచుకెళ్లేందుకు వచ్చాడను-కుంటుందేమో

భారతి అనితతో ఎలా మాట్లాడాలో ఆలోచిస్తోంది

ఆమె ఏమన్నా పట్టించుకోగూడదు తను చేసిన పనికి ఎవరైనా ఆగ్రహించక మానరు ఇంటికి వెళ్లాక అమ్మా నాన్న అన్నయ్యలతో ఎన్ని అరుపులు తినె లో విజయ్ కనిపించకపోతే తన కథే వేరుగా వుండేది అనితతో మాట్లాడి తనెక్కడి-కైనా వెళ్లాలనుకుంది "ఆలోచిస్తోంటే ఆ జీవితం ఇంకా భయం అనిపిస్తోంది

ఎన్నాళ్ళు? ఎక్కడుంటుంది? చచ్చే ధైర్యం లేదు మాటలు బరించక తప్పదు?

కారు ఇంటిముందు ఆగింది




## పసిడిబొమ్మ

ఇద్దరు కారు దిగి ఇంటి వైపు చూశారు.

తలుపులు వేసి వున్నాయి.

గుమ్మం దగ్గరికి వెళ్లారు. కాని తలుపులు కొట్టాలంటే ఇద్దరికీ భయంగా వుంది.

కొద్దిసేపయ్యాక విజయ్ ధైర్యంచేసి త్రోశాడు.

తలుపులు భళ్ళున తెరచుకున్నాయి.

"ఎవరు?" వంటింట్లో నుండి వచ్చింది అనసూయమ్మ.

ముందు గదిలో నే స్తంభాన్నానుకొని కూర్చుని వుంది అనిత.

ఆమెకు వాళ్ళొచ్చిన విషయం తెలిసినట్లే లేదు. దూరానెటో చూస్తోంది.

"రండి బాబూ...." అనసూయమ్మ వాళ్ళిద్దర్నీ కూర్చోమన్నట్లు కుర్చీ చూపించింది.

విజయ్ కూర్చోలేదు.

"అనితా...." అనిత దగ్గరికి వెళుతోంటే "అమ్మగారు మనలో లేరు బాబు. నిన్న మధ్యాహ్నం ఇక్కడ బాగా గొడవ జరిగింది. ఇంటికి వచ్చాక పడుకుంటే బాధలో వున్నారనుకున్నాను. పలకరించలేదు. ప్రొద్దున లేచి అలాగే కూర్చున్నారు. నేనే ముఖం కడుక్కోమని పెరట్లోకి తీసుకెళ్లాను. చిన్నపిల్లలా నాతో నడిచి వచ్చారు. కాఫీ నోటి దగ్గర పెడితే తాగారు. అన్నం ముందు పెట్టి కంచంలో చెయ్యి పెడితే తిన్నారు. ఇలాగే వుంటే రేపొద్దునే అమ్మగారిని పిలుచుకుని హైదరాబాదు వచ్చేయ్యాలనుకున్నాను...." అంటూ నిన్న మధ్యాహ్నం ఊళ్లోవాళ్ళు చేసిన గోల చెప్పింది అనసూయమ్మ.

"అనీ...." విజయ్‌లో దుఃఖం కట్టలు త్రెంచుకొని వచ్చింది.

భారతి అనిత ప్రక్కన కూర్చుంది.

ఆమె నోట మాట రావడంలేదు.

అనితకు తనేదేదో చెప్పాలని వచ్చింది. కాని ఆమె ఏదీ వినిపించుకొనే స్థితిలో లేదు.

"బాబూ వూరుకోండి. ఏడ్చి చేసేదేముంది?" అనసూయమ్మ విజయ్ దగ్గరికి వచ్చి ఓదార్పుగా అంటుండగానే బైటినుండి బూట్ల శబ్దం వినిపించింది.

సుధాకర్, భార్గవ లోపలికి వచ్చి విజయ్ ఏడ్వడం చూసి కొద్దిసేపు అలాగే నిలబడిపోయారు.

విజయ్ అనుకోకుండా భారతిని తీసుకుని చక్రపురం వెళుతున్నాననగానే ఏం జరిగిందో నని ఆందోళనగా అప్పుడే బైలుదేరి వచ్చారు భార్గవ, సుధాకర్.

"ఏమిట్రా ఏమయింది?" భార్గవ విజయ్ దగ్గరకి వచ్చాడు.

"దీనికంతకూ కారణం నేనే అన్నయ్యా...." అన్నయ్యను చూడగానే భారతికి ఏడుపు వచ్చింది.

"ఆ పేపర్లో అనితగారిని గురించి వ్రాయించడంతో ఇంత అనర్థం జరిగింది...." తనేం మాటలు పడాల్సి వస్తుందోనని భయపడ్డ ఆమెకిప్పుడు ఆ భయమే లేదు. తన వల్ల జరిగిందన్న బాధ ఆ భయాన్ని మింగేసింది.

చెల్లెలు చెప్పిన మాటలు విని ఆశ్చర్యంగా చూశాడు భార్గవ.

"ఎంత పని చేశావు భారతీ...." భార్గవ ఇంకా ఏదో అనబోతుంటే "భార్గవా...." విజయ్ అతడి చెయ్యి పట్టుకున్నాడు మాట్లాడవద్దన్నట్టు.

"భారతి తప్పేం చేసింది? తనలో ఏదో అనుకుంది. తన కల పండే అవకాశం కనిపించింది. ఏదో చేసింది. ఇలా జరుగుతుందని ఎవరూహించగలరు?దెబ్బతిన్న ఆమె మనసునింకా బాధించకు" సమాధానపరుస్తున్నట్లుగా అన్నాడు విజయ్.

"భారతి నీ గురించి అలా అనుకోవడమే బాగోలేదు". భార్గవ ముఖం బాధగా పెట్టాడు.

"ఆమె మనసుకా కోరిక కలిగింది. ఇక ఆ విషయం మరిచిపో. ఇప్పుడామెకు అలాంటి వుద్దేశాలేం లేవు." అన్నాడు విజయ్.

అతడి మంచితనానికి మదిలో నే అంజలి ఘటించింది భారతి. "తన గురించి తెలిశాక అతడు తనను అసహ్యించుకుంటాడనుకుంది. కాని విజయ్ అందరిలాంటి వాడు కాదు."

విజయ్‌ను ప్రక్కకు రమ్మని అనితను పరీక్ష చేశారు భార్గవ, సుధాకర్.

"మెంటల్ షాక్. సైకియాట్రిస్ట్‌కు చూపించాలి." ఇద్దరు చర్చించుకుని విజయ్‌కు చెప్పారు.

"అనిత.... తన అనిత ఏ స్థితికి వచ్చింది...." విజయ్ ఆమె వైపు చూసి కన్నీరు కారుస్తోంటే "విజయ్, ఏమిటిది? అది నయంకాని జబ్బుకాదు." అంటూ అతడికి ధైర్యం చెప్పి, భార్గవతో కలిసి ప్రయాణానికి ఏర్పాట్లు చేస్తున్నాడు సుధాకర్.

విజయ్ నీరసంగా పడుకున్నాడొక వైపు.

ముందే జ్వరంతో బాధపడుతున్న అతడ్ని భార్య అనారోగ్య వార్త బాగా కృంగదీసింది.

భార్గవ, సుధాకరే అనితను నడిపించుకొని వచ్చి కారులో కూర్చోపెట్టారు.

విజయ్ వాళ్ల వెనుకే వెళ్లి కారెక్కాడు.

భార్గవ డ్రైవింగ్ చేస్తున్నాడు.

ఫ్రంట్ సీటులో కూర్చున్న ముగ్గురు....సుధాకర్, విజయ్, భార్గవ పైకి చెప్పకున్నా ఒకే విషయం గురించి ఆలోచిస్తున్నారు. అది అనితను ఏ హాస్పిటల్‌కు తీసుకెళ్లాలని.

వెనుక వైపు అనితకు అటు ఇటు కూర్చున్న భారతి, అనసూయమ్మ "ఆమె ఎప్పటికైనా మామూలు మనిషవుతుందా?" అని దిగులుగా చూస్తున్నారు.

అనిత ఒక్కతే ఈ ప్రపంచంతో తనకేం సంబంధం లేదన్నట్టుగా శూన్యంలోకి చూస్తోంది.

ఎక్కడైతే తన జీవితం సుఖంగా సాగుతుందనుకుందో అక్కడే మట్టి పాలుగొట్టుకుని వెళుతోంది.

ఆ ఘోరం చూడలేకేమో చంద్రుడు మబ్బుల చాటుకు వెళ్లాడు.

కొమ్మలు రెమ్మలు కదలికనే మరిచిపోయాయి.

కారులో నిశ్శబ్దం....చుట్టూ నిశ్శబ్దం.....

**(అయిపోయింది)**



# తిరుమల–తిరుపతి దేవస్థానము తిరుపతి

## తిరుమలపై శ్రీ వేంకటేశ్వరస్వామివారి భక్తులకు అన్నదానం చేయాలనుకొంటున్నారా ?

అన్నదాన సత్ఫలితాలను గురించిన కథలు గాథలు మన పురాణాలలో కోకొల్లలు. తిరుమల వంటి పుణ్య క్షేత్రంలో అన్నదానం విశేషించి ఫలప్రదం. శ్రీవారి ప్రసాద వినియోగంకూడా అంతటి శుభప్రదమైన సదాచారమే !

తిరుమలకు విచ్చేసే యాత్రిక మహాశయులకు అన్నదానం, ప్రసాద వినియోగం చేసేటందుకు గాను తిరుమల తిరుపతి దేస్థానం "శ్రీ వేంకటేశ్వర నిత్య ప్రసాద దాననిధి"ని నెలకొల్పింది.

ఈ నిధికి మీరు 500/రూ. విరాళం ఇచ్చినట్లయితే దానిపై ఏటావచ్చే వడ్డీతో 20 మందికి భోజన పొట్లాలనుగాని లేక 15 లడ్డులుగాని 15 వడలనుకాని, క్యూ లైనన్లలోని యాత్రికులకు ఏటేటా పంచడం జరుగుతుంది. సంవత్సరంలో మీరు కోరుకొన్న లేదా సూచించిన రోజున అంటే మీ పుట్టినరోజు. వివాహ వార్షికోత్సవరోజు, మీ అబ్బాయి లేక అమ్మాయి పుట్టినరోజు, మీ తండ్రి లేక తల్లిగారి శ్రాద్ధ దినం వంటి మీకు ప్రాముఖ్యతగల తేదీలలో ఈ కార్యక్రమం జరుపబడుతుంది.

ఒక దాత ఎన్ని విరాళాలనైనా సమర్పింపవచ్చును. ఒక్కొక్క విరాళం ఒక్కొక్క రోజుకు ఏర్పాటు చేసుకోవచ్చు. కనీసం 10 విరాళాలను సమర్పించిన వారికి ఐదుగురు కుటుంబ సభ్యులతో ఏడాదికొక పర్యాయం తమ పక్షాన ప్రసాదదానం జరిగే రోజున స్వామివారి ఉచిత దర్శన సౌకర్యం ఏర్పాటు చెయ్యబడుతుంది. (ఇప్పటి రేటునుబట్టి ఐదు ప్రత్యేక దర్శనం టికెట్ల విలువ 125 రూపాయలు).

అన్నదానం జరిగేరోజున శ్రీవారి కొలువులో దాత పేరు వెల్లడించ బడుతుంది.
ఈ దాననిధికి మీరిచ్చే విరాళం ఆదాయపుపన్ను నుంచి మినహాయింపు పొందుతుంది. మీ ఆదాయపుపన్ను మినహాయింపు అభ్యర్థన పత్రాలలో మీరు ఈ విషయం పేర్కొన వచ్చును.

దేశ మంతటా వున్న **ఆంధ్రా బ్యాంకు** శాఖలద్వారాగాని లేదా ఏ బ్యాంకు డిమాండ్ డ్రాఫ్టుల ద్వారాగాని కార్య నిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి పేరిట విరాళాలను మేనేజర్. ఆంధ్రా బ్యాంకు టి. టి. డి. ఎడ్మినిస్ట్రేటివ్ బిల్డింగ్, తిరుపతి-517501. అనే విలాసానికి పంపవలసి వుంటుంది మీ విరాళాలతోపాటు క్రింది వివరాలుకూడా పంపవలసి వుంటుంది.

1. చెల్లించినవారి పేరు చిరునామా :
2. అన్నదాన కర్త పేరు, చిరునామా :
3. ఆదాయపుపన్ను మినహాయింపు పత్రం పొంద దలచినవారి పేరు విలాసము :
4. అన్నదాత గోత్రం, వంశీ నామం :
5. అన్నదానం జరపదల్చుకున్న తేదీ :
6. పంచవలసిన పదార్థాలు : ఆహార పొట్లాలు/లడ్లు/వడలు
   (ఏదో ఒకటి మాత్రమే గుర్తించండి.)
7. విరాళం మొత్తం :

అన్నదానం జరపదలుచుకొన్న తేదీకి కనీసం 15 రోజులు ముందుగా మీ విరాళాలను అందజెయ్యవలసి వుంటుంది.

(సం) కార్య నిర్వహణాధికారి

# కీ. శే. కొమర్రాజు వేంకట లక్ష్మణరావు పంతులు

తెలుగు భాషకి ఘనంగా సేవచేసిన వారిలో గణించదగ్గవాడు శ్రీ లక్ష్మణరావు. తెలుగు సంస్కృతి ఈయన రచనలకి నేపథ్యంగా ఉండేది. ఆంధ్రులు ఆంధ్రభాష, ఆంధ్ర సారస్వతము, ఆంధ్ర చరిత్ర, ఆంధ్ర విజ్ఞానము, ఆంధ్రుల వ్యక్తిత్వము—వీటిని గురించే ఈయన నిత్యం ఆలోచించేవాడు. తెలుగు వాఙ్మయానికి చారిత్రక పరిశోధనని జతవేసి చరితార్థం చేసిన ధన్యజీవి లక్ష్మణరావు.



ఈయన లింగధారుడైన నియోగి బ్రాహ్మణుడు. అయితే తత్త్వ విమర్శన చేసేటప్పుడు మాత్రం బ్రహ్మసమాజిగా, ఆర్యసమాజిగా, శైవునిగా, వైష్ణవునిగా మతభేదం లేక వ్యక్తి దూషణ చేయక, నిరంతరాన్వేషకుడై—ప్రశాంత గంభీర వదనంతో అలరించే మనీషి శ్రీ రావు. నైజాము ఇలాకాకి చేరిన నందిగామ తాలూకాలోని పెనకంచిప్రోలు అనేచోట దాదాపు 108 సంవత్సరాల క్రితం పుట్టిన లక్ష్మణరావు భాషాసేవకునిగా ఇంకా సజీవుడే! నలభై ఆరేళ్లకే శివసాయుజ్యాన్ని పొందినా చిరకాలం స్మరించదగ్గ తెలుగు భాషాసేవని త్రికరణశుద్ధిగా చేసి ఆదర్శప్రాయుడైనవాడు లక్ష్మణరావు పంతులు.

1900లో సంస్కృతము, ఫిలాసఫీలలో బి.ఏ. పట్టాని 1901లో కలకత్తా విశ్వవిద్యాలయం నుంచి తత్త్వశాస్త్రంలో ఎం.ఏ. పట్టాని అందుకొన్న ప్రతిభాశాలి పంతులుగారు. ఈయన విద్వత్తుకి చదువు చెప్పేవారే ఆశ్చర్యపోయినారు. అసాధారణమైన తెలివితేటలకి పరిశ్రమ, కృషి, దీక్ష జతకలిసి రావుగారిని ఉన్నత పథంవైపుకి నడిపించుకొని వెళ్లాయి! 1897లోనే వివాహమైనా ఇతని జిజ్ఞాస, భాషాసేవపట్ల ఉన్నకాంక్ష ఏ మాత్రమూ తగ్గుముఖం పట్టలేదు.

తెలుగు భాషేకాదు, మహారాష్ట్ర, హిందీ, కర్నాటక భాషలతో పాటు ఆంగ్లంకూడ ఈయన సొత్తే! అయినప్పటికీ తెలుగు భాషకి అంకితమైపోయినవాడు శ్రీ రావు. మనకన్నా మహారాష్ట్రులకే ఈయన బాగా తెలుసు! శివాజీ చరిత్రము, హిందూ మహాయాగము, మహమ్మదీయ మహాయాగము వంటి గ్రంథాలు శ్రీ రావుకున్న బహుముఖ ప్రజ్ఞని స్ఫుటంగా ప్రకటిస్తాయి.

రాజకీయాలు కూడ ఈయనని బాగా ఆకర్షించేవి. సహాయ నిరాకరణోద్యమం పట్ల సదభిప్రాయం ఉన్నప్పటికీ విద్యాసంస్థలని మూయించడం ఈయనకి నచ్చలేదు. అవిద్యతో బాధపడుతున్న సమాజం పట్ల రావుగారికున్న చింత వలననే ఆయన అట్లా ప్రవర్తించాడని అనిపిస్తుంది. ఆది వాస్తవం కూడా!

గ్రంథకర్తగా, సంపాదకునిగా, విమర్శకునిగా, పరిశోధకునిగా, భాషా శాస్త్రజ్ఞునిగా శ్రీ రావు స్థానం అద్వితీయమైనది. తదేక దీక్షతో, తత్పరతతో తెలుగుభాషని సుసంపన్నం చేయటానికి రావుగారు ప్రయత్నించినట్లుగా మరెవరూ ప్రయత్నించలేదని ఎంతోమంది అంటారు. ఈయన ప్రకటించిన ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము తెలుగువారిపాలిట కల్పతరువే!

లక్ష్మణరావు సహృదయుడు. ఎంతో ఔదార్యం కలవాడు. ఈయన చేసిన గుప్తదానాలు పుచ్చుకున్న వారికి తప్ప వేరేవారికి తెలిసేవికావు. భావపరంగా మహోన్నతుడు. జీవితపరంగా సామాన్యుడు.

ఈయన ఎవరికైనా ఏకాలానికైనా మార్గదర్శకుడు!

**ఆంధ్రపత్రిక 18 జూలై 1923 సంచికలోపడిన శ్రీ వే.వి. శర్మ వ్యాసం ఆధారంగా**




# సైకిలు

శ్రీమతి. కె. భానుమతి

"ఎన్నిసార్లు చెప్పినాసరే, ఆ ముసలాయన చెవికెక్కదుకదా, ఈ డొక్కు సైకిలు అమ్మెయ్యండి, దీనివలన ఎవరికి ఉపయోగం, ఈ అద్దెకొంపల్లో 'అదికూడా చోటుమింగటానికి కాపోతే అంటూ–తెగ సణుక్కుంటూంది వాణీ, ఇల్లు ఊడుస్తూ!

ఆ సణుగుడు ఈ రోజుదికాదు, వాణీ కాపరానికి వచ్చిన రోజునుంచీ ఉన్నదే! వచ్చిన మరునాడు ఇల్లు ఊడుస్తూ– ఈ సైకిలు ఇంకదేనికి మామగారూ, ఉపయోగమా, ఏమయినానా అంది టైర్లలో గాలిలేక చప్పగా ఉన్న వాటికేసి చూస్తూ–– కొత్తరంగుపోయి, సగం తుప్పుపట్టి అసహ్యంగా కనపడుతున్న సైకిల్‌ని పక్కకి జరిపి తుడుస్తూ

పోనీలేమ్మా అదేం మనల్ని అన్నం అడిగిందా నీరు అడిగిందా– మనకు అవసరం అయితే బాగు-చేయించుకుంటే నిక్షేపంలా పనిచేస్తుంది లేకపోతే అలా ఓ మూలే ఉంటుంది అన్నారు పడక్కుర్చీలో కూర్చుని పేపరుచూస్తూ

ఊఁ అని ఇల్లు ఊడవటం పూర్తిచేసి లోపలకు వెళ్ళిపోయింది వాణి అది అంతటితో ఆగుతుందని మాధవరావుగారు అనుకున్నారు కానీ, అది ఆగలేదు సరికదా, రోజుకోసారయినా భర్త చెవిలో ఆ సైకిలు అమ్మకం గురించి ప్రస్తావన తీసుకువస్తేనే కానీ, భోజనం చేయదువాణి

ఎన్ని ఎన్ని ఏ గిపోయిన ఆయన మనసు ఈ రోజు వాణి ఉదయాన్నే అలా అనేసరికి కోపం వచ్చింది అందుకే విసురుగా– ఏమ్మా, ఆ సైకిల్‌పై నీకంత అసహ్యం, నన్ను వీధిలో పడేసిన తరువాత దాన్ని కూడా పడేయండి, అంతవరకూ అలా ఉండాల్సిందే అన్నారు ఖచ్చితమయిన స్వరంతో! పడక కుర్చీఎత్తి గోడ వారగాఉంచి బయటకు నడుస్తూ

ఆయనకు అంత కోపం వస్తుందని అనుకోని వాణి ఖంగారు పడిపోయి, మరి నోరెత్తలేదు

అలా విసురుగా బయటకు నడిచిన మాధవయ్య కాళ్ళు, శివాజీ కేఫ్ ముందు ఆగాయి లోపలకు నడిచి ఖాళీగా ఉన్న చోట ఓ కుర్చీ చూసుకుని కూర్చుని, ఓ కాఫీ పట్రావోయ్ అన్నారు అటుగా వచ్చిన సర్వర్‌ని ఉద్దేశించి

అయిదు నిముషాలయ్యాక వచ్చిన వేడి, వేడి కాఫీ తాగి బయటపడ్డారు పక్కనే ఉన్న కిళ్ళీ కొట్లో, ప్రభ పేపరు కొన్నారు

ఎన్ టి ఆర్ బర్తరఫ్' అన్న పెద్ద పెద్ద అక్షరాలతో ఉన్న వార్త చదివి ఆశ్చర్యపోయారు గబ, గబా అక్కడ ఉన్న బల్లపై కూర్చుని ముఖ్యాం-శాలను చదివి, పేపరు మడిచి చేత్తో పట్టుకుని ఇంటి దారిపట్టారు

ఇంట్లో అడుగుపెట్టగానే విన్నారా మామయ్యా ఎన్ టి ఆర్‌ని బర్తరఫ్ చేశారట అంది మాధవయ్యగారి చేతిలో పేపరు లాక్కుంటూ!

"అందులో వింత ఏముందమ్మా – నీకు సైకిలు అక్కడ ఉంచటం ఇష్టంలేక అమ్మేయమనలేదూ– అన్నాడు ద్వంద్వార్థం వచ్చేటట్లుగా

ఆ మాటతో వాణి మొహం చిట చిట లాడించు-కుంటూ లోపలకు నడిచింది పేపరుతో సహా

నాలుగు రోజుల అనంతరం వాణికి నొప్పులు ఆరంభం అయాయి అవి రాను రాను ఎక్కువ కాసాగాయి ఏంచేయాలో తెలీటంలేదు పక్క-వాళ్లను సహాయం అడుగుదామనుకుంటే, వాళ్ళు వూళ్ళో లేరు భర్త శంకరానికి తండ్రి తప్ప, పెద్ద చెప్పుకోతగ్గ దగ్గర చుట్టాలు ఎవరూ లేరు ఇంట్లో వున్న ఇద్దరు మగవాళ్ళకి, ఏం చేయాలో తెలీలేదు, వాణి కళ్ళలో నీరు తిరిగాయి

అపుడే గదిలోకి అడుగు పెట్టిన శంకరం, ఏం వాణీ బాధగా ఉందా, ఆస్పత్రికి వెళదామా, అన్నాడు

ఊఁ అంది, కళ్ళలో తిరిగిన నీరు తుడుచు-కుంటూ

శంకరం వీధిలోకి నడిచాడు రిక్షా ఏదయినా తీసుకువస్తే ఆస్పత్రికి తీసుకెళ్ళవచ్చు అని

అరగంట గడిచింది ఒళ్ళంతా చెమటతో తిరిగి వచ్చిన కొడుకుని చూసి, ఏరా శంకరం, తెచ్చావా రిక్షాని అన్నారు మాధవయ్య.

ప్చ్, ఒక్క రిక్షాకానీ, ఆటో కానీ దొరకలేదు నాన్నా, అన్నాడు నీరసంగా కుర్చీలో వాలి

అదేంరా అన్నాడు, ఖంగారుగా మాధవయ్య

"ఈ రోజు, ముఖ్యమంత్రి బర్తరఫ్‌కి నిరసనగా బంద్ చేస్తున్నారట, అందుకని ఒక్కడుకూడా రాలేదు" అన్నాడు, ఏంచేయాలో తెలీని అయోమయ స్థితిలో.

"హుఁ" అని ఒక నిట్టూర్పు విడిచి, మీ అత్తగారు వస్తానంది కదరా, ఇంకా రాలేదేం" అన్నారు

"ఏమోఁ అక్కడ వాళ్ళకేం ఇబ్బందులో, అన్నాడు; "ఇపుడీ ఇబ్బంది గడిచేది ఎలారా భగవంతుడా" అనుకుంటూ– మనసులో!

అయిదు నిముషాలు ఎవరి ఆలోచనలో వారున్నారు. "అమ్మా" అన్న వాణి కేకకి ఆలోచనల్లోంచి బయటపడి, ఏంచేద్దాం ఆలో-చించు, ఇంకా ఎక్కువయితే కష్టం" అన్నారు మాధవరావు.

"ఏం చెయ్యాలి" అన్న ప్రశ్నకి జవాబు దొరకక తండ్రికేసి దీనంగా చూశాడు శంకరం.

కొడుకు ముహంలోకి చూసిన ఆయనకు చటుక్కున ఒక ఆలోచన మెరుపులా వచ్చింది వెంటనే, "ఒరే, శంకరం అమ్మాయిని నా సైకిల్‌పై కూర్చోపెట్టి తీసుకువెళదాంరా" అన్నారు.

అంత ఖంగారులోను నవ్వు వచ్చింది శంకరానికి, తండ్రి మాటలకు "ఏదీ, ఆ డొక్కు సైకిలా" అన్నాడు.

కొడుకు మాటల్లో వ్యక్తం అయిన నిరసన్ని, పరికించి కూడా అదేం గమనించనివాడిలా, "అవునురా మొన్న కోడలు అన్న మాటలకు పౌరుషం వచ్చి, 40 రూ॥లు ఇచ్చి బాగు-చేయించాను; పని చేస్తుంది, అంతకన్నా ఇపుడు మార్గం ఏముంది" అన్నారు.

రెండు నిముషాలు ఆలోచించి, "సరే, వాణీని అడిగివస్తాను ఉండు, కూర్చోగలదేమో!" అంటూ లోపల గదిలో అడుగిడి, భార్యకి చెప్పాడు తండ్రి అభిప్రాయం, బయట వున్న వాతావరణం కూడా!

"ఆఁ సైకిలా–" అని, ఇంక తప్పదుకదా అనుకుని, "సరే పదండి, ఇంకా ఎక్కువ అయితే కూర్చోలేనేమో-కూడా" అంది, పక్కనే ఉన్న ప్లాస్టిక్ బుట్ట చేత్తో అందుకుంటూ–

ఈ లోపునే, మాధవయ్య సైకిల్ తీసి వీధిలో ఉంచారు. వాణీ మెల్లిగా వచ్చి సైకిలు దగ్గర నుంచుంది.

"ఎక్కమ్మా! నీకేం భయంలేదు." అన్న మావగారి మాటలతో, సైకిల్ వెనకాల కూర్చుంది.

ఇంతలో అంటి తాళం వేసి వచ్చిన శంకరంతో, అబ్బాయి, నువు వాణీని జాగ్రత్తగా పట్టుకో, నేను సైకిలు నడిపిస్తాను". అన్నారు.

"అలాగే నాన్నా" అని భార్యని ఒక చేత్తో పట్టుకుని సైకిల్ పక్కనే నడుస్తుండగా, మాధవరావుగారు, ఇద్దరి బరువు ఆపుకుంటూ– ఎంతో జాగ్రత్తగా ఆస్పత్రి ముందు సైకిల్ ఆపేసరికి, అరగంటపట్టింది.

భర్త చేయి ఆసరాతో కిందకి దిగింది. సైకిల్ స్టాండులో ఉంచి, ముగ్గురు లోపలకు నడిచారు.

డాక్టర్లతో మాట్లాడి, హాస్పటల్‌లో ఎడ్మిట్ చేసేసరికి మరో పావు గంట పట్టింది.

ఒక గంట తరువాత వాణికి పుట్టిన పండంటి మగ పిల్లాడిని చూడడానికి లోపలకు వచ్చిన మాధవయ్యతో 'మావయ్యా– క్షమించండి, నా అవివేకానికి, ఈ రోజుఆ సైకిల్ లేకపోతే, నేను ఏ స్థితిలో ఉండే-దాన్నో," అంది కృతజ్ఞత నిండిన కళ్ళతో, మామగారి వైపు చూస్తూ!

"దాన్దేముందమ్మా, ఏదో చిన్నతనంమూలాన అలా అన్నావు; పాత వాటి విలువ మీకు ఇంకా తెలీదమ్మా!" అన్నాడు, ముప్పయి ఏళ్ళు తనని నిరంతరం ఆఫీసుకు, ఇతర పనులకు మోసి, ఎంతో మేలు చేసిన సైకిల్ శ్రమని తలుచుకుని గర్వంగా! □

# ఇద్దరి పిల్లల మధ్య మూడు సంవత్సరాల ఎడాన్ని ఉంచండి



నిరోధ్ 'కాపర్ టి' ఓరల్ పిల్




## ఏ పద్ధతినైనా ఎంచుకోండి

davp 84/225

సీరియల్

# రాగసంధ్య

## కాశీనాథుని సువర్చలా దేవి

(గత సంచిక తరువాయి)

ఆ రాత్రి భోజనం స్పెషల్‌గా వుంది. రెండు స్వీట్లు, రెండు హాట్లు. రుచిగా కూడా వుంది. శ్రీకాంత్ ఏదో అంటూ తను నవ్వుతూ అందర్నీ నవ్విస్తున్నాడు. సుభద్రమ్మగారు దగ్గరుండి కొసరి కొసరి వడ్డించి మరీ తినిపించారు. ఎన్నడూ లేంది సంధ్యకూడా ఎక్కువగానే తినవలసివచ్చింది.

"ఏవమ్మా గీతా! మీ అక్కకు ఎంత సిగ్గో! ఎంత మొహమాటమో! అసలు నోరే విప్పదు – మొదటినుంచీ అంతేనా!" కొంత నిష్ఠూరం నిండిన గొంతుతో అడిగింది సుభద్రమ్మగారు.

గీత మాత్రం ఏం చెప్తుంది. ఎంత నవ్వులతో వాతావరణాన్ని నింపాలని చూసినా శ్రీకాంత్ ప్రయత్నం సగమే ఫలించింది. బలవంతంగా సంతోషాన్ని నటించినవాళ్ళేగాని మనస్ఫూర్తిగా నవ్విన వాళ్ళెవరూ లేరు. సుభద్రమ్మగారి మాటలతో కుహనా పారవశ్యంలో వున్న వాతావరణం ఒక్కసారిగా బిగుసుకు-పోయింది. అందరి ముఖాలూ గంభీరంగా మారినయి. సంధ్యకు అక్కడ్నుంచి పారి పోవాలనుంది శ్రీకాంత్ సంధ్యనే చూస్తున్నాడు.

"మూర్తీ! ఈ వానలో ఈ రాత్రికి నీ ప్రయాణం సాగదు ఇవ్వాళ వుండి రేపు వెళ్ళవుగానిలే!" సంభాషణ మారుస్తూ అన్నాడు శ్రీకాంత్.

"వానయితే తడుస్తానా! కారులో వెళ్లటమేకదా! ఇప్పటికే పదిహేను రోజులయింది వచ్చి! అక్కడి పరిస్థితులెట్లా వున్నయ్యో తెలియదు! ఎక్కడి-వక్కడ వదిలేసి వచ్చాను!" మూర్తి అన్నాడు.

"ఫరవాలేదులే! ఒక్క రోజులో మునిగిపోయిందేమీలేదు – ఇవ్వాళ వద్దు రేపు చూసుకోవచ్చు!"

శ్రీకాంత్ డ్రాయింగ్ రూమ్‌లోకి నడుస్తూ అన్నాడు మూర్తికి ఆ రాత్రికి వెళ్ళిపోవాలనుంది. రాధను ఆసుపత్రిలో చేరుస్తున్నప్పుడు అతని కెంతో బాధనిపించింది. తన శరీరంలో ఒక భాగమేదో ఎవరో లాగేసుకున్నట్టు ఫీలయ్యాడతను. తను రాధకేదో అన్యాయం చేస్తున్నట్టుగా అతని మనసు మూగగా రోదించింది. తను తన బాధ్యతనుండి తప్పించుకోవాలని చూడట వాలా అధర్మంగా కనపడుతుంది అతనికి. ఆసుపత్రిలో రాధను వాళ్ళెన్ని బాధ పెడ్తారో తనకు తెలుసు ఏమాత్రం అల్లరిపెట్టినా శిక్ష తీవ్రంగానే వుంటుం రోజూ స్నానం ఉండదు. అందమైన రాధ నల్లని జుట్టు తైల సంస్కారం లే అట్టలుకట్టిపోతుంది. తల్లి తన పోరు పడలేక తనని ఎదురుగా నిలబెట్టుక రాధకు తలదువ్వి జడవేసేది. కాసేపటికే రాధ జడ విప్పుకొనేది. తల్లి మ వేసేది. ఒక రోజు కొట్టబోయాడు కూడాను అప్పటినుంచీ రాధ తన ఎదురు జడ విప్పుకోదు. పసిపిల్లలా నయానా భయానా కాపాడుకోవలసినే రాధ ఆసుపత్రిపాలు చేసి వచ్చాడు! ఎందుకని? గీత కోసం! రాధను చూసేవాళ్ళు లే తప్పని పరిస్థితి! ఈ ఆసుపత్రి జీవితం తెలిసో తెలియకో రాధే తెచ్చుకుం అనుకోకుండా తల్లి మరణానికి కారకురాలయింది రాధ మీద తనకెందుకిం ప్రేమ! ప్రేమకాదు. భార్యగా ప్రేమిస్తున్నాడా! ఆమెనుంచి తానే రకమైన శారీ వాంఛా కోరటంలేదు. ఆమె మీద కేవలం జాలి! తాళి కట్టినందుకు తన ధర్మం! కనీసపు ధర్మం తను నెరవేర్చలేకపోతే తను మనిషి కాడన్నమాట! తనొక మృ కింద లెక్క! తను ఏ రకంగా గీత వైపు ఆకర్షితుడయినాడో తనకే తెలియద పాపం, గీత! అమాయకురాలు! కోరి ఈ నరకంలోకి వచ్చింది! ఏం సుఖపడిం పెళ్ళయి ఆరు నెలలు కావస్తున్నవి. భర్తనుంచి పొందవలసిన ఏ చి అనురాగమూ పొందలేకపోయింది. పైగా జీవితం మీద విరక్తి పుట్టటానికి ఏ పరిస్థితులు కావాలో అన్నీ చవిచూసింది భర్తనుంచి అనురాగం లేకపోయి అనురాగపూరితమైన చూపులు కూడా పొందలేకపోయింది. గీతను పెళ్లిచేసుకు తీరని ద్రోహం చేశాడు తను.

"మూర్తీ!" శ్రీకాంత్ పిలుపుతో ఈ లోకంలోకి వచ్చాడతను అక్కడెవ్వర లేరు. తనూ, శ్రీకాంత్ తప్ప.

"వీళ్లేరీ!"

"ఇప్పుడు టైము ఎంతయిందో తెలుసా! వాళ్ళీపాటికి నిద్రపోయే వుంటార నువ్వుకూడా లే. నాకు బాగా నిద్ర వస్తున్నది – "మూర్తికి గది చూపించి త వెళ్ళిపోయాడు. మూర్తి కారాత్రి వెళ్లిపోవాలని గట్టిగా వున్నా శ్రీకాంత్ మా కాదనలేకపోయాడు గదిలోకి అడుగుపెట్టిన అతను దిగ్భ్రాంతితో గుమ్మంలో ఆగిపోయాడు. పౌర్ణమినాడు ఆరు బయట మంచం వేసుకుని పడుకున్నట్టుం ఆ గదిలో. ఆ గదిలో వెలుగు వెన్నెల కాంతో విద్యుత్ కాంతో తెలియటంలేద అసలది గదో ఆరుబయలో తెలియకుండా వుంది. మూర్తి ఆలోచనలో ప లో పలికొచ్చాడు. అక్కడే మంచాల పక్కన కుర్చీలో ఆలోచనగా కూర్చున్నది గీ

"ఏమైనా డబ్బుతో ఏ సుఖాన్నైనా స్వంతం చేసుకోవచ్చుకదూ!" నుద్దేశించి అన్నాడు మూర్తి.

"మనసులో లేని సుఖం డబ్బులో వస్తుందా!"

"ఎందుకు రాదు. ఈ గది చూడు. ఇది అలంకరించిన పద్ధతి చూస్తుం నీకనిపించటం లేదూ డబ్బు ప్రధానమైన విషయమని! మనం ఎట్లాంటి ఇం వున్నాం. అసలు ఈ రకమైన సుఖాలు మనుషులు అనుభవిస్తారని మన తెలుసా!" మంచం మీద కూర్చుంటూ అన్నాడు మూర్తి. గీత నవ్వింది.

"డబ్బుతో అన్నీ కొనుక్కోగలమని అనుకోవటం ఎంత పిచ్చి! శ్రీకాంత్‌కి అ వున్నాయి. కాని, భార్యను ఎదురుగాపెట్టుకుని ఆయనెంత వ్యథ చెందుతున్నా మీకు తెలుసా! అక్క భర్తను భర్తగా ఆదరించదు. కనీసం స్నేహితుడుగా కూ అంగీకరించదు. ఆయనకేమో అక్కమీద పంచప్రాణాలు. ఈ వివాహం వాళ్ళ పరిష్కరించటానికి వీలులేని సమస్య! పాపం, ఆవిడ – అత్తగార్కు ఎం దిగులుపడుతుందో – ఒక్క కొడుకు సంసారం ఈ తీరుగా వుంది. చూస్తున్న నాకే అయోమయంగా వుంది."

గీత మాటలకు మూర్తి మనసుకూడా బాధపడింది.

"అది సరే, మధు ప్రవర్తన నాకు అర్థంకావటంలేదు. అసలెందుక నటించినట్టు? ఇతను మాత్రం మా అక్కను ఎందుకు చేసుకున్నట్టు? ఇష్టంలే

**జరిగిన కథ –8:** సంధ్య, మధులు ప్రేమించుకొన్నారు. మధు ఫ్రెండ్ శ్రీకాంత్ అంటె సంధ్యకు తగని చిరాకు, అసహ్యం. సంధ్య పిన్ని కూతురు గీత. గీతకు మూర్తి అంటె ఇష్టం. మధుకు నాగపూర్‌లో ఉద్యోగం వచ్చింది. మూర్తి తన భార్య పిచ్చిదని గీతతో చెప్పాడు. మధు చెల్లెలు భవిష్యత్తు బాగుకై మాధవిని పెళ్లి చేసుకోబోతున్నట్లు శ్రీకాంత్ సంధ్య వాళ్లతో చెప్పాడు. గీతను మూర్తి కిచ్చి పెళ్లి చేయమని సలహా ఇస్తాడు శ్రీకాంత్. మధు నుంచి సంధ్యకు వచ్చిన ఉత్తరం గీత చదువుతుంది. ఇష్టం లేకపోయినా గీత భవిష్యత్ కోసం శ్రీకాంత్‌ను పెళ్లి చేసుకోను ఒప్పుకుంటుంది సంధ్య. గీత, మూర్తి, సంధ్య, శ్రీకాంత్‌ల పెళ్లి జరిగి-పోయింది. మూర్తి భార్య పిచ్చి ఎక్కువయింది. ఆమె పిచ్చిలో తోయడం వల్ల మూర్తి తల్లి చనిపోయింది. మూర్తి భార్యను ఆసుపత్రిలో చేర్పించాలనుకొంటారు మూర్తి, శ్రీకాంత్. మూర్తి, గీత, శ్రీకాంత్ వాళ్లింటికి వచ్చారు. బాధ పడుతున్న సంధ్యను ఊరడిస్తాడు శ్రీకాంత్.

మీ అక్క ఈ పెళ్ళికి ఎందుకు ఒప్పుకున్నది?"

మూర్తి సందేహాలకి గీతకు నవ్వు వచ్చింది.

"మధు ప్రాక్టికల్ మనిషి! ఈ బీదరికం, కష్టాలు, త్యాగాలు, అందులో పడి ప్రేమ అనే ముసుగు తొడుక్కుని జీవితాన్ని వ్యర్థం చేసుకునేకంటే తెలివిగా జీవితాలు వున్నదాంట్లో సుఖపడే మార్గం వెతుక్కోవాలి అనే స్వభావం గల మనిషి! అవకాశం రాకపోతే చెయ్యగలిగింది లేదు. ప్రేమకోసం మధ్య తరగతి కుటుంబంతో సంతోషంగా గడిపేవాడే! కాని, అవకాశం వచ్చింది అదీకూడా ఈ ప్రేమ జీవితం తనతోనే కాక తన చెల్లెలుతో ముడిపడి వుంది. రమణికి చదువులేదు. పెద్ద అందంలేదు. చిన్నతనం నుంచీ ప్రేమ అంటే ఏమిటో తెలియకుండానే బ్రతికింది. అటువంటి రమణికి అదృష్టవశాత్తు యోగ్యుడు, ధనవంతుడు అయిన భర్త లభిస్తున్నప్పుడు తను "ప్రేమ" అని కూర్చుంటే రమణి జీవితం చేజేతులా పాడు చేసినట్లవదూ!"

"ఇక్కడ సంధ్య జీవితం పాడవలేదా!" కాస్త ఆవేశంగా అన్నాడు మూర్తి.

"ఏమోనండీ! బావగార్ని చూసిన తర్వాత నాకు మా అక్కదే తప్పేమో-ననిపిస్తున్నది. అక్కకు అర్థంలేని ఆవేశం. మధు పరిస్థితి కొంచెం కూడా అర్థంచేసు కుందామని ప్రయత్నించదు. ఇదేదో అవమానంగా తీసుకుంటున్నది. తన జీవితం పాడు చేసుకుంటున్నది. ఆయన జీవితం పాడు చేస్తున్నది-"

"గీతా నువ్వు ఇట్లా మాట్లాడుతుంటే ఆశ్చర్యంగా వుంది. నన్ను ప్రేమించానని ఎవరెన్ని చెప్పినా వినకుండా నన్ను చేసుకున్నావు! నీ ప్రేమలాంటిది కాదా మీ అక్క ప్రేమ! ప్రేమను గురించి తెలియనివాళ్ళు ఈ కబుర్లన్నీ చెప్తే బాగుంటుంది!గీత మాట్లాడకపోవడంతో మూర్తి మళ్ళీ అన్నాడు.

"మధుని మర్చిపోయి శ్రీకాంత్‌తో సంసారం చెయ్యమనటం చాలా అన్యాయం. నీ సంగతి నువ్వు మర్చిపోయి మీ అక్కను విమర్శిస్తున్నావు!" చింతు మీదకి వాలుతూ అన్నాడు మూర్తి.

"మీరు ఏమీ అనుకోనంటే మీతో కొన్ని విషయాలు చెప్తాను." సందేహంగా అంది గీత.

"చెప్పు! మనస్సులో వున్నవి చెప్తేనే బాగుంటుంది. అదే నాకు ఇష్టం-కూడా!"

"మీరు మాటకు పదిసార్లు నన్ను తీసుకువస్తున్నారు కాబట్టి చెప్తున్నాను. నా సంగతి వేరు. మీ పరిస్థితికి నేను జాలిపడ్డాను. మీతో మీ కష్టం పంచుకుని మీకు అండగా మీకు ధైర్యాన్నిస్తూ, తోడుగా వుండాలనుకున్నాను. అంతే కాకుండా పూట గడవడమే కష్టంగా వున్న ఆ ఇంట్లో నాకు పెళ్ళి చేసే తాహతు ఎవరికుంది? సంధ్యకు పెళ్ళయితే రమణి బాధ్యత వుంది. మధు, రమణి బాధ్యతా, నా బాధ్యతాకూడా తీసుకోగలడా! అమ్మ కోరికలు కొండలు దాటు తుండేవి! అక్కను ప్రతిదానికీ వేధించవలసిందే! మిమ్మల్నీ మీ పరిస్థితుల్నీ అర్థం చేసుకున్న నాకు మీమీద అభిమానం పెరగసాగింది. అందం, వయసు, ఉద్యోగం వున్న మీరు మీ జీవితాన్ని వృథా చేసుకోవటం భరించలేకపోయాను -" గీత కర్థం వస్తూ అన్నాడు మూర్తి

"అయితే నువ్వు నామీద జాలితో నన్ను పెళ్ళి చేసుకున్నావన్నమాట!" మూర్తి గొంతువిన్న గీత చిన్నగా నవ్వింది.

"నేను ముందే చెప్పాను! మనం ఫ్రాంక్‌గా మాట్లాడుకుంటున్నాం. మొదట మీమీద కలిగింది జాలే! తరువాత తరువాత మీ మీద ప్రేమను పెంచుకున్నాను. మెట్ల ఒక్కొక్క కలయిక మీ మీద నా ప్రేమను ఒక్కోమెట్టు ఎక్కించిందే తప్ప దించలేదు. మిమ్మల్ని ప్రేమించ గలుగుతున్నందుకు నాకు ఆనందంగా వుండేది. గర్వంగా వుండేది. కాని, నానమ్మకం నా ఆనందం నా గర్వం అన్నీ నన్ను మోసగించాయని మన పెళ్ళయిన ఆ రాత్రి -మీతో పంచుకోవలసిన ఆ రాత్రి తెలుసుకుని నాలో నేనే కుమిలిపోయాను. మీ మనసంతా రాధ నిండివుంది. అందులో నాకు కాదు కదా నా నీడకు కూడా చోటులేదని తెలిసింది-" గీత గొంతు బొంగురుపోయింది.

మూర్తి నిస్సహాయంగా అచేతనంగా వింటున్నాడు.

"నేను మిమ్మల్ని వివాహం చేసుకోవటం వేరు అమ్మకు ఆశ లెక్కువ. అక్క జీతం నెలంతా సరిపోయేది కాదు అమ్మ సినిమాలు, పురాణ కాలక్షేపాలు మానుకునేదికాదు. అడకత్తెరలో పోకలా అక్క నలిగిపోయేది మూర్ఖంగా అమ్మ నాకు ఎప్పైనా చిన్న చిన్న నగలు కొనాలని తాపత్రయ పడేది. నాకా ఇంట్లోంచి పారిపోవా లనిపించేది. శ్రీ కాంత్‌కి నన్ను కట్టబెట్టాలని అమ్మ నానా అవస్థలూ పడుతుంటే జాలిగా నవ్వుకునేదాన్ని ఆ సమయంలోనే మీతో పరిచయం కలిగింది. నేను ఆలోచించాను మీ పరిచయంతో నా హృదయంలో తొలిసారిగా స్పందన కలిగిన మాట వాస్తవమే అయినా పరిస్థితులతో జోడించి రాబోయే కష్టనష్టాలను బేరీజు వేసుకున్నాను. శ్రీకాంత్ అట్లాకాదు. అక్క లేకపోతే అతను బ్రతకలేడు. మధుతో ఎన్నోసార్లు మా ఇంటికి వచ్చేవాడు అతని కళ్ళల్లో ఆర్తి, ఆవేదన, ఆకాంక్ష - అక్కని చూస్తూ అతను సర్వస్వం మైమరచి నట్లుండేవాడు. అక్క కనబడకపోతే అతని కళ్ళు అణువణువూ అన్వేషిస్తుండేవి. అక్క కనబడితే అతని కళ్ళు వెలిగిపోతుండేవి ఆ కళ్ళల్లో ఆరాధన నాకు తెలుసు. మొదటినుంచీ నేను గమనిస్తూనే వున్నాను. మధు ఎన్నోసార్లనేవాడు. 'నా కివ్వాళ చాలా పనులున్నయి - రాను బాబూ అంటే ఈ మహానుభావుడు లాక్కొచ్చాడు, అని. అక్క చిరాకు పడేది. అతనికి అక్క పట్ల గొప్ప ఆరాధన! మధు అక్కను చేసుకోబోతున్నాడని తెలిసి ఏమి అనలేక నిస్సహాయుడై నిర్తేజంగా వుండటం నేను చూచాను అక్కను చూస్తూ, అతను జీవం పోసుకునేవాడు. అక్క మధుని చేసుకుంటే అతను జీవితాంతం అవివాహితుడుగానే మిగిలిపోయేవాడు. అతడు ప్రణయమూర్తి !అతని ప్రేమ ముందు నా ప్రేమ ఎంత? కావాలనుకుంటే అక్కను తలపక్క నాకు అతని పక్క కొమ్మేవాడు! అక్కకోసం తపస్సు చేశాడతను



## రాగసంధ్య

ఆటువంటి భర్త దొరకటం సామాన్యులకు లభ్యమయ్యేదికాదు. ఎంత అదృష్టమో - తిరస్కరించటం అంత దురదృష్టం - నాకు, బావగారికీ పొంతనలేదు. మామూలు ప్రేమ నాది - ఆయనది ప్రణయం -"

"గీతా! నీ లా జీవితాన్ని నేను చదవలేను కాని జీవితానికి అర్థం తెలుస్తున్న దిప్పుడే! నాకా ప్రేమలూ, ప్రణయాలూ తెలియవు. మామూలు సంసారినే - కాని, ఒక విషయంలో నువ్వు పొరబడ్డావు. నా మనసంతా రాధేనని - అందులో నీకు చోటు లేదనీ - అది అబద్ధం. రాధ పట్ల నా ధర్మం నేను నిర్వర్తిస్తున్నాను. నీ విషయమంటావా! ధర్మసంకటంతో నా మనసు ఎందుకో బలహీనంగా వుంది. ఏదో దిగులు! అయినా, నిన్నటితో ఆ సందేహమూ తీరిపోయింది!" గీత చెయ్యి తన చేతిలోకి తీసుకుంటూ అన్నాడు మూర్తి.

"రాధ పట్ల నా ధర్మం నిర్వర్తించటంలో నిన్ను నొప్పించాను - అందుకే నువ్వు ఇట్లా వ్యాట్లాడుతున్నావు! నీతో పాటు నేను కూడా బాధపడుతున్నాను గీతా! నన్నర్థం చేసుకో!"

మూర్తి మాటలు వింటూనే వుంది గీత. దూరంగా గడియారం టిక్కు టిక్కు-మన్న శబ్దం తప్ప వాతావరణం నిశ్శబ్దంగా వుంది. ఎంతో సేపటినుంచి కారు మబ్బులు కమ్ముకుని కుండపోతగా కురిసిన వర్షం వెలిసిపోయి ఆకాశం నిర్మలంగా మారింది. అకాల వర్షం కనుక చంద్రుడు మబ్బుల మధ్య నుంచి ఆత్రంగా బయటకు తొంగి చూచాడు. చంద్రుడి వెన్నెలను అనుభవించిన గీత కళ్ళు పరవశంతో మూసుకున్నాయి!

* * * * * * *

రాత్రి కురిసిన వాన గుర్తుగా గాలిలో చల్లదనం అట్లాగే వుంది. సంధ్య బద్ధకంగా కళ్ళు తెరచి అప్రయత్నంగానే కిందకి చూచింది.

ఆ పచ్చని ఆకులతో శ్రీకాంత్ తోటలోని చెట్లన్నీ వింత అందాలతో హొయలు పోతున్నాయి. తడితడిగా వున్న ఆకుల మీద సూర్యకిరణాలు పడి శ్రీకాంత్ తన వైభవ చిహ్నంగా ఆకుల మీద రవ్వలు పొదిగాడా అనిపిస్తున్నది. శ్రీకాంత్ నిర్మలమైన మనసులా భూమి ఆర్ద్రత పొంది వుంది. విరిసిన గులాబీలు, తెల్లని జాజులతో కలిసి - చెయ్యి తిరిగిన చిత్రకారుడు దిద్దిన రమణీయ దృశ్యంలాగా కన్నులను నిలబెట్టి మరీ తమ అందాన్ని ప్రదర్శిస్తున్నాయి. దిండు మీద పడుకున్న సంధ్య లేచి ముందుకు జరిగి మోచేతి మీద తల ఆన్చి కిటికీలోంచి కనబడుతున్న తోట అందాన్ని మరింతగా చూస్తున్నది. చూస్తున్న-కొద్దీ ఆమె మనసు ఉద్వేగం పొందుతున్నది. ఎంతైనా శ్రీకాంత్ గొప్ప కళాహృదయం కలవాడు! అందులో సందేహం లేదు. సంధ్య ఆలోచనా స్రవంతికి హఠాత్తుగా అంతరాయం కలిగింది. తను.... తను శ్రీకాంత్ గురించి ఆలోచిస్తున్నదా! అందులోనూ సృష్టిలోని అత్యంత రమణీయమైన వస్తువులతో పోల్చుకుంటున్నదా!విరిసిన గులాబీలలో, తెల్లని జాజులతో అతన్ని చూస్తున్నది. నో! ఇంపాజిబుల్!తనుకాదు- ఈ ఆలోచనలన్నీ తనవి కావు. తనలో ఏదో భూతం ప్రవేశించింది!లేకపోతే తనీ రకంగా ఆలోచించదు! దూరంగా చర్చి గంటలు మ్రోగినయి. అంటే ఎనిమిది అయింది కాబోలు! అవనీ, ఎంతయితేనేం! తను చెయ్యవలసిన పనేముంది గనుక! పదో- పదకొండో- ఎప్పుడో ఆఫీసుకు వెళ్ళి తను లీవ్ కాన్సిల్ చేసుకుంటున్నానని చెప్పి సోమవారం వెళ్ళి జాయిన్ అవటం- తిరిగి ఉద్యోగంలో జేరబోతున్నానన్న ఆలోచన రావటంతో సంధ్యకు ఎక్కడలేని ఉత్సాహం వచ్చింది. ఉద్యోగం చేసే రోజులు వింత హాయిగా గడిచిపోయినయి. ఇంట్లో ఇబ్బందులు ఎన్నివున్నా ఆఫీసులో ఉన్నంతసేపూ పని, మధును గురించిన ఆలోచనలు- సాయంత్రం మధుతో షికారు- సాయం సంధ్యాసమయంలో ప్రకృతి వింత అందాన్ని పరవశంతో తిలకించటం జీవితం రంగులమయంగా చిత్రించుకుని మధుతో భవిష్యత్తుని గురించిన సంభాషణలు- ఓ, జీవితం హాయిగా వేగంగా నడిచిపోయింది. కాని, చివరకు మధు ఉద్యోగం తన భవిష్యత్తుకు గొడ్డలిపెట్టయింది. ఊహించని విధంగా తన పెళ్ళి జరిగిపోయింది. శ్రీకాంత్‌ని జీవితాంతం శాపగ్రస్తుడ్ని చెయ్యటమే తన ధ్యేయం. ఏ అహంకారం తనని రెచ్చగొట్టిందో, ఆ అహంకారాన్ని అణచివేయాలి! అడుగడుగునా అతన్ని అవమానాలపాలు చెయ్యాలి! దీనికి మొదటి ప్రయత్నం తను తిరిగి ఉద్యోగంలో చేరటం. తను ఉద్యోగంలో చేరితే అతను తనని వద్దని వారిస్తాడా! పట్టనట్లు వూరుకుంటాడా! అతనేమంటేనేం! తను చేరుతుంది. సంధ్య తీరుబడిగా లేచి ముఖం కడుక్కొని, స్నానంచేసి తయారయి కిందకు వచ్చేసరికి పది గంట లయింది. డైనింగ్ హాలులోకి రాబోతున్నదల్లా లోపల సంభాషణకి కళ్ళెం వేసినట్లు ఆగిపోయింది.

శ్రీకాంత్ భోజనం చేస్తున్నట్టున్నాడు. సుభద్రమ్మగారు కొడుకు పక్కన కుర్చీలో కూర్చుని వడ్డిస్తున్నది.

"నువ్వేన్నయినా చెప్పు! నాకు నీ పెళ్ళాం విషయం బోధపడటం లేదు-" సుభద్రమ్మగారు అంటున్నది.

"ఏముందమ్మా బోధపడటానికి? సంధ్య నా పెళ్ళాం అని నువ్వంటున్నావు కదా! అంటే, ఈ ఇంట్లో తనకీ కొన్ని హక్కులు, కొంత స్వాతంత్ర్యము వున్నాయి కదా! ఏదో అయిపోయిందిగా-" శ్రీకాంత్ సర్ది చెప్తున్నాడు.

"శ్రీకాంత్! నీ వెఱ్ఱి చూస్తుంటే నాకు భయంగా వుంది. లోకంలో భార్యాభర్తల్నెందర్నో చూచాను. పెళ్ళాన్ని నెత్తికెక్కించుకున్న వాళ్ళని, పెళ్ళాంమాట వేదవాక్కుగా భావించే వాళ్ళని చూసాను కాని, ఈ నీ పిచ్చి వ్యామోహం చూస్తుంటే ఈ సంసారం ఏమవుతుందో నాకు తెలియటం లేదు. ఆ నీ పెళ్ళాం నీతో మాట్లాడదు- నీతో కలిసి వుండదు- నువ్వెందుకు ఈ పెళ్ళి చేసుకున్నావో నాకు అర్థం కావటం లేదు-" సుభద్రమ్మగారి గొంతు బొంగురు పోయింది.

"అమ్మా! నీ పిచ్చి ఆలోచనలతో నువ్వు బాధపడుతున్నావు! నన్ను బాధ పెడుతున్నావు! చెప్పానుగా, సంధ్య విచిత్రమైన మనిషి! సంధ్యకు నా అంత

## కథలు రాసేవారికి మనవి.....

**భారతిలో** ప్రచురణకి పరిశీలనార్థం చిన్న కథలు పంప వలసిందిగా రచయిత(త్రు) లకి మనవి చేస్తున్నాము.

రచనలు కాగితానికి ఒకవైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాయాలి

కథలు 12 అరరావు కాగితాలకి మించకుండా ఉంటే మంచిది

**అనువాదాలు,** అనుసరణలు పంపరాదు

ప్రచురణకి స్వీకరించని రచనలని త్రిప్పి పంపడానికి తగినన్ని తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామా గల కవరు జతపరచి పంపాలి

రచనలని సంపాదకుడు, భారతి, సాహిత్య మాసపత్రిక, ఆంధ్రపత్రిక కార్యాలయం, గాంధీనగరం, విజయవాడ – 520003. అన్న చిరునామాకి పంపాలి.

## రాగసంధ్య

కావాలి!అదిచ్చాను– అంతే– సంధ్యనుంచి నేను ఆశించేది లేదు. తను ఈ ఇంట్లో ఏ అశాంతీ లేకుండా హాయిగా వుండగలిగితే చాలు–"

బాగుంది– నే నీ సంసారం చూడలేను నేను వెళ్ళి కొన్నాళ్ళు తోటలో బంగళాలో వుంటాను నన్ను వెళ్ళనీ!

శ్రీకాంత్ నుంచి సమాధానం రాలేదు

నిన్న సంగతి తెలిసింది కదా! ఆ మహిళా మండలి వాళ్ళకి ముప్పైవేలు విరాళం ఇచ్చింది నేను మాట్లాడలేకపోయాను నువ్వు మాట్లాడావా! హాయిగా నవ్వి వూరుకున్నావు! అనాథ సేవా సమితికి ఎంతిస్తుందో ఫోను చేసి చెప్తుందిట ఈ రకంగా నీ కష్టమంతా హరించుకుపోతే–

పోనీ అమ్మా! డబ్బు దేముంది? మళ్ళీ సంపాదించుకోవచ్చు! సంధ్య స్వతంత్రంగా తనది అని ఖర్చుపెట్టింది నాకదే సంతోషంగా వుంది! సుబ్రమ్మ గారు నివ్వెరపోయింది

నీ కిదేం పిచ్చిరా! ఈ వేడిలో ఇట్లాగే వుంటుంది రేపు నీ సంసారం పెరిగితే అప్పుడు తెలుస్తుంది డబ్బు విలువ– అయినా నాకెందుకు?

శ్రీకాంత్ వాష్ బేసిన్ దగ్గర కెళ్తూ అన్నాడు

'మన ముగ్గురి కోసం ఎంత కావాలమ్మా! ఇదంతా అనుభవించే వాళ్ళు మాత్రం ఎవరున్నారు? సంధ్య ఇష్టం వచ్చినట్టు ఖర్చు చెయ్యనీ!

శ్రీకాంత్ టవల్‌తో చేతులు తుడుచుకుంటూ వరండాలోకి వచ్చాడు సంధ్యకు తప్పుకోవటానికి అవకాశం లేకపోయింది అతని చూపులలో చిక్కుకుపోయింది శ్రీకాంత్‌కి తెలిసి పోయింది, సంధ్య చాలాసేపటి నుంచీ అక్కడే వున్నదని!రెండు క్షణాలు శ్రీకాంత్ అక్కడే సంధ్య కభిముఖంగా నిల్చున్నాడు. సంధ్య అతని చూపులతో చూపులు కలిపి నిల్చుండి పోయింది. మరుక్షణం గిరుక్కున తిరిగి మేడమీదకు పారిపోయింది. కొంతసేపటికి తేరుకుని శ్రీకాంత్ కూడా పైకి వెళ్ళాడు. తన గదిలోకి వెళ్ళిన సంధ్య సరాసరి ముందువైపు బాల్కనీలో కెళ్ళి ఒక మూల కూలబడి పోయింది. ఆమెకు దుఃఖం రావటం లేదు.ఏదో తెలియని శూన్యత మనసంతా ఆవరించిపోయింది. తను ..... తను ధైర్యం కోల్పోతున్నది. శిలాకృతి పొందిన తన, హృదయం నెమ్మదిగా ద్రవీభూత మౌతున్నది. ఏదో గుండెల్లోంచి ప్రవాహంలా జారిపోతున్నది. అందులోనే కసి! శ్రీకాంత్ ఏమీ అనడేం? అతనేదైనా అంటే బాగుండు! అతను తనని నిందిస్తే తప్ప తనలో రోషం పెరగదు! ప్రతీకారం తీరదు! ఎంత అసహనమైన మనిషి అతను! అతని ప్రవర్తన తనలో

నిర్లిప్తతను పెంచుతున్నదే కసిని రెచ్చగొట్టటం లేదు ఎట్లా! ముందతన్ని రెచ్చగొట్టాలి! అప్పుడుగాని తిరుగుబాటు ప్రారంభం కాదు!

సంధ్యా! శ్రీకాంత్ పిలుపుకి తల తిప్పింది సంధ్య

ఈ అనర్థానికంతకూ కారణం మీరు పగబట్టిన త్రాచులాగ మొదటి నుంచి సమయం కోసం కాచుకొని కూర్చున్నారు సమయం దొరికింది! దొరికిందో, దొరికేటట్టుగా చేసుకున్నారో కాని మమ్మల్ని బాగా కాటు వేసారు–

శ్రీకాంత్ మాట్లాడలేదు సంధ్య ముందు నుంచే నడిచి పిట్టగోడ వైపు వెళ్ళి అక్కడ నిలబడి కిందకు దీక్షగా చూడసాగాడు సంధ్యకు అతని మౌనం బాగానే కోపం తెప్పించింది

మాట్లాడరేం! చేసిందంతా చేసి మాటాపలుకూ లేకుండా మౌనంగా ఉంటే సరిపోతుందనుకున్నారా! ఈ సర్వానర్థాలకూ కారణం మీరు – సంధ్య ఆయాసంగా ఆగింది

శ్రీకాంత్ తిరగకుండానే అన్నాడు.

"ఏ అనర్థాలకూ!"

"ఛీ, సిగ్గు లేకపోతేసరి!"

"నువ్వు సమాధానం చెప్పలేవు సంధ్యా! నీకూ తెలుసు – నేను నిరపరాధినని – నిజంగా మీకు అనర్థం కలిగించాలనుకుంటే మీ ప్రేమను సాగనిచ్చేవాడ్ని- కాదు. తెలిసి తెలిసి నిన్ను మధుకు మనస్ఫూర్తిగా ధారపోసేవాడ్నికాదు –"

పదకొండు గంటల తీవ్రమైన ఎండ బాల్కనీ అంతా పరుచుకున్నది. చురుక్కున కాలుస్తున్నా ఇద్దరి మనసులూ అగ్నిగోళాల్లా వుండటంచేత ఇద్దరూ అక్కడే వుండిపోయారు

ఎంత నటన! తేనెపూసిన కత్తి! విషబిందువులు నిండిన పాలకుంత! మంచితనమనే ముసుగు తొడుక్కున్న

శ్రీకాంత్ సంధ్య వైపు చురుగ్గా తిరగటంతో ఆగిపోయింది అతని దవడ ఎముకలు బిగుసుకున్నాయి కళ్ళు రక్తపు ముద్దల్లా ఎఱ్ఱగా వున్నాయి నుదుటి మీద ముత్యాల లాగ పోసిన చెమట బిందువులు చెవుల పక్క నుంచి సన్నని ప్రవాహంలా కారి మెడ మీద నుంచి షర్టులోకి ఇంకిపోతున్నాయి

సంధ్య క్షణకాలం భయపడింది

మీ ధనరాసులు ఖర్చయినయ్యని మీరేమీ దిగులు పడక్కరలేదు నా మీద పళ్ళు కొరకనక్కరలేదు మీరు మీ కోపమంతా ప్రదర్శిస్తే నేను బెదిరిపోతాననుకున్నారేమో! మీ స్టేటసు తెలిసిందిగా! ఇహ నుంచి మీ విరాళాలు అయిదు, పది ఇస్తాలేండి – గొంతు నిండా హేళన, వెగటు నింపుకుని అంది సంధ్య

ఛీ – అతను సంధ్య ముందు నుంచే గబగబా వెళ్ళిపోయాడు సంధ్య నిరుత్తరయింది

పొగరు – ఎంత అహంకారం ఈ మనిషికి –

**(ఇంకా ఉంది)**



# 'యమదంష్ట్రిక'

'అరుణ'

విజయనగర సేనలు కళ్యాణికోటను ముట్టడించి అప్పటికి ఇరవై రోజులయింది. కోటను వశం చేసుకోవటం అనుకున్నంత తేలిక కాదని అనిపిస్తున్నది. సుల్తానుల వంశంలో అధిక సంఖ్యలో ఫిరంగులు, తుపాకులు వున్నై. వాటితో రాగి ముక్కలు చిల్లరపైసలు దట్టించి నిప్పుముద్దలు శరపరంపరగా విజయనగర సేనలపై కురిపిస్తున్నారు. అప్పటికీ రాయల సేనలు పౌరుషంతో ముందుకు చొచ్చుకు పోతున్నై. కాని ఆ అగ్ని వర్షానికి తట్టుకోలేకపోతున్నై. తెగించి కోట సమీపించినవారిని సుల్తాను సేనలు కోటగోడల పైనించి కాగేనూనె కుమ్మరించి, రాళ్ళుపడదోసి ఈటెలు, బాణాలు విసిరి సంహరించి, వారు పడిపోగా ఆనంద పారవశ్యంతో కేరింతలు కొడుతున్నారు. రాయల సైనికుల పౌరుష పరాక్రమాలు వ్యర్థమైపోతున్నై.

బీజపూరు సుల్తాన్ అదిల్షా చెల్లాచెదరైన తన సేనను కూడ తీసుకుని అళియరామరాయల సేనని చుట్టుముట్టాడు. హిందూ సేనకి సరుకులూ, సహాయం అందకుండా అడ్డం తగులుతున్నారు. ఇంతేకాకుండా తన అశ్విక దళాన్ని చుట్టూచేర్చి విజయనగరసేనకు బయటి వారితో ఎటువంటి సంబంధాలు లేకుండా పూరిగా బంధించివేసేందుకు ప్రయత్నిస్తున్నాడు. దీంతో వీరికి ఆహార పానీయాల సరఫరా కూడా కష్టమైపోయింది.

వీరోత్సాహంతో ఉరకలు వేసుకుంటూ వచ్చిన విజయనగర సైన్యోత్సాహం సన్నగిలుతున్నది. అగ్నివర్షంతో క్షతగాత్రులు ఎక్కువైనారు. ఏనుగులు సహితం ముందుకు నడవటానికి వెనకాడుతున్నై. వాటిపైన నిప్పుముద్దలుపడి అవి భయంతో తమ సేనలనే నేలకేసి ముప్పగిస్తున్నై.

ఈ ముట్టడిలో రామరాయలకు కుడిభుజంగా నిలిచి పోరుతున్న కెళరిపుర ఇక్కేరి సదాశివ నాయకుడు అమిత పరాక్రమం చూపిస్తున్నాడు. కొత్త వ్యూహాలు పన్నుతున్నాడు. రెండేసి ఏనుగులపైన పెద్ద చెక్కబల్లలు పేర్పించి, వాటిని మట్టితో కప్పి వాటి మాటున సేనావాహినిని నడిపించాడు. ఈ మట్టి అటకలు కొంతవరకు అగ్నివర్షాన్ని అడ్డుకోకలిగినై. వాటి సహాయంతో కోటగోడను ఒకవైపు మందు

గుండుతో బీటలు వాయుగొట్టి అమితోత్సాహంతో ముందుకుపోతున్న ఈ సేనకి అనుకోకుండా అవాంతరం వచ్చింది. ఫిరంగి గుండొకటి ఏనుగుల్లో ఒకదానికి తగలడంతో అది బాధతో ఘీంకరిస్తూ పిచ్చిపట్టినట్లై వశంతప్పి చెక్కలని పడదోసి మిగతా ఏనుగులను కూడా వెనక్కు ఈడ్చుకుపోయింది.

ఇది ఇట్లావుండగా బీజాపూర్ సుల్తాన్‌కు వేరే సేనావాహిని తోడుగా చేరబోతున్నదన్నవార్త విజయనగర సేనలలో అలజడి రేపింది. అదేకనక జరిగితే కోటలోనివారికి, బైటి సుల్తాను సేనలకీ మధ్య వీరి పని అడకత్తెరలో పోకచెక్కవలే అవుతుంది. ఏమిటి చేయటం పాలుపోకుండా వుంది.

అందరూ ఖిన్నులై వున్నారు. సేనాపతులు దండ నాయకులు, సామంత నాయకులు సదాశివ నాయకుడు, వెంకటాద్రి, తిరుమల రాయలు, అనంత నాయకుడు, ఒకరేమిటి అందరూ ఏదేదో చర్చిస్తున్నారు. ఎవరికి తోచిన సలహా వారు అందిస్తున్నారు. ఆవేశాలు పెరుగుతున్నాయి. వారిలో వారికే స్పర్ధలు, మాటపట్టింపులు వస్తున్నాయి. రెండు పక్షాలుగా విడిపోయినారు. ఒక పక్షం నిరాశవాదులు. వారివాదం కళ్యాణికోట నిర్భేద్యం అని, పట్టనలవి కానిదని, దీనికితోడు కోట లోపలి శత్రుసేనలు, బైటచుట్టుకుని ఉన్న బిజాపూర్ సేనలమధ్య ఇరుక్కుపోయి ప్రాణాలతో బైటపడటం దుర్లభం అని అంటున్నారు. పైపెచ్చు ఆహారపదార్థాల నిలవ రోజు రోజుకీ క్షీణిస్తున్నది.కొత్త పదార్థాలు రావటంజరగదు. ఇవి చాలనట్టు బీజాపూర్‌వారికి అండగా కొత్త సేనలురాబోతున్నవి. అదేజరిగితే ఓటమి తప్పదు. నాశనం తప్పదని వారివాదన. కనక ఏదో విధంగా సంధి చేసుకోవటమే వుత్తమ మార్గమని వారు అభిప్రాయం వెలిబుచ్చారు.

రెండవ పక్షంవారు వీరినిచూసి అవహేళన ప్రారంభించారు. వీరు వుడుకు రక్తంతో వారిని పిరికిపందలని అనటం మొదలుపెట్టారు. కొత్త బలాలు వచ్చి చేరకముందే కోట నెట్లాగైనా వశం చేసుకోవాలని వీరి ఉద్దేశం. ఈ అభిప్రాయాన్ని ధృడపరచినవారు ఇక్కేరి సదాశివ నాయకుడు, ఫజాఫర్, కరీంబేగ్. ఇరువర్గాలకి సమాధానం కుదరటంలేదు.

అళియరామరాయలు విశ్రాంతికోసంవ్యాహ్యాళికి సాగాడు. అతడు చుట్టూ జరుగుతున్న వ్యవహారాలను పరిశీలిస్తూ నడుస్తున్నాడు. శిధిలమైన డేరాలు, క్షతగాత్రులై బాధపడుతున్న భటులని, జంతువులని చూశాడు. సంభరాలన్నీ తరిగిపోతూ వొట్టిపోతున్న సామానుకొట్లని గమనించాడు. కేవలం ఆకలిని తీర్చటానికే అన్నట్టుగా జరుగుతున్న వంటలని చూశాడు. సేనా

## "నా తెలుగు పలుకు !!"

సీ॥ పదపదంబున గొప్ప పావన తజిల్కగా
 పరిఢవిల్లిన యట్టి పసిడిపలుకు
అర్ధమెఱుగని యట్టి యన్యభాషియుల
 కును—మోహమును గూర్చుకొమరు పలుకు
ముక్కుమోమునులేని మొఱటు భాషల నెదు
 ర్కొని నిల్చినట్టి ప్రాకృతపుఁబలుకు
పండిమగ్గిన దోసపండు మాడ్కిని మెత్త
 నైసుధల్ తలపించునట్టి పలుకు

గీ॥ అమరభాషమ తల్లి స్వయముగ గోరు
ముద్దలిడి పెంప ముద్దులుమూట గట్టి
ఆంధ్రరస నాంచలముల వాహ్యాళిసేయు
తేనె యూటలఁజినుకు—నా తెలుగుపలుకు !!

సీ॥ తతబిదేలిమి: సుధా ధారాస్రవమ్ములొ
 పనసపండ్లకు నీడువచ్చునెద్ది ?
అపుడెఁదీసిన—పచ్చియారని డెందన
 శ్రీకిఁదోడై మించి వెలుగునెద్ది ?
పండు వెన్నెలలోని పారిజాతపుపూల
 పరిమళంబుల దోచి వరలు నెద్ది ?
గిరినిస్సరన్మనోహరప్రపుషజ్జల పాత
 మృదురావమున మ్రోగునదియు నెద్ది ?

వేదనాదంబు సంగీత స్వాదునాద
కోటిఁదనలోన జీర్ణించుకొన్న దెద్ది ?
అదియె మా కావ్యవీధి వాహ్యాళిసేయు
తేనెయూటల జినుకు—నా తెలుగు పలుకు !!

**- ఖులుసు వేంకటేశ్వర్లు**

స్రవంతితో వచ్చిన అనుబంధ తండాలు కనిపించినాయి. ఆయుధాలు బాగుచేస్తున్నారు. కొంత మంది డేరాలు మళ్ళీ కుడుతున్నారు మరి కొంత మంది. కాని ఎవరిలోను మునపటి ఉత్సాహం కనపడటంలేదు. ఆశాభావం లేదు. నిర్లిప్తత, నిర్జీవంగా తిరగటమే కనపడుతున్నది. చూస్తున్న కొద్దీ రాయలు ఖిన్నుడౌతున్నాడు.

తను విజయనగరంలో దండయాత్రకు బయలుదేరినప్పుడు ఏమి సంబరం, ఎంతకోలాహలం! ఎక్కడ చూసినా మంగళ వాద్యాలు, మంగళహారతులు· సేనలకు ఎదురుగా అలంకృత కన్యలు పూర్ణకుంభాలతో, మంగళ హారతులతో ఎదురొచ్చారు. వీరగంధాలు పూశారు, నుదుట విజయతిలకాలు దిద్దారు· మెడల్లో హారాలు వేసి విజయంతో తిరిగిరమ్మన్నారు. పట్టపుటేనుగను సింగారించి ముందునడిపించారు అబ్బ ఏమి ఉత్సాహం! మత్తగజాల ఘీంకారాలు, పంచ కళ్యాణుల సకిలింపులు, భూమిపై కాలు నిలుపలేని ఆత్రుత సైనికుల వీరాలాపాలు చెప్పనలవి కాదు. రణభేరీల మోతలకి చెవులు గింగిర్లుఎత్తినై అవన్నీ ఇప్పుడేమైనై? ఈ దండయాత్ర విజయవంతం కాగలదని సిద్ధాంతులు పెట్టిన ముహూర్తం ఏమయింది ?

ఆ స్మృతులతో బాధపడుతూ నడుస్తున్న రాయలు తన అనుచరులని ఆగిపొమ్మని ఒక్కడే ఇంకొంచెం దూరం సాగి అక్కడొక రాతిమీద కూర్చున్నాడు ఆలోచనాపరుడై. కొంత సేపటికి అతడికి మాటలు లీలగా వినిపించినై ఇద్దరు సైనికులు మాట్లాడుకోడం విన్నాడు.

"ఒరే రంగా ఈ యుద్ధం నుంచి మనం ఇంటికి చేరతామని అనిపించటం లేదురా".

"అదేంటి పిన్నయ్యా, ఆ మాటలనవాక, హాయిగా ఇంటికెళ్తాం, ఈపాటి గాయాలు నీకెప్పుడూ తగల్లేదా ఏం?"

"పోరారంగా తాతకు దగ్గునేర్పుతావా? నేనేది ఈ గాయాల మాట కాదురా. అది సరే కాని నేనిప్పుడు చెప్పేది సరిగ్గా వినరా, నా దగ్గర మొన్న నాయకుడు మెచ్చి ఇచ్చిన ఈ హారం ఉంది. కొన్ని వరహాలున్నై. ఈ మధ్య తిమ్మరాజు చచ్చిపోతే నేను తీసుకున్న ఈ పచ్చల పిడి కత్తి వుంది. అన్నిటికన్నా ముఖ్యం నా మెడలోని

బంగారుతాడు. దానికి వేలాడే విరూపాక్షస్వామి మొహరు వున్నదిరా రంగా. ఈ విరూపాక్షుడి మొహరు మా కుల దైవం. మమ్మల్ని కాపాడే మా దైవం. అది పోతే ఆపద కలుగుతుందని మా నమ్మకం. ఈ మొహరు వంశానుగతంగా వస్తున్నది. నాకు తెలిసి మా ముత్తాత మా తాతకి, మా తాత నా తండ్రికి ఇచ్చాడు. జాగ్రత్తగా వాడుకోమంటూ నా తండ్రి నాకిచ్చాడు. నేను నా కొడుక్కివ్వాలి. ఈ దండయాత్రకి బయల్దేరేటప్పుడే ఇద్దామనుకున్నా. కాని మీ పిన్నమ్మ నాకిది రక్షణగా వుంటుందని వుంచుకోమని బలవంతం చేసింది, తియ్యనియ్యలేదు. నాకు ఇది చక్కటి ఒక ఎత్తు. ఆస్తి అంతా ఒక ఎత్తురా, అందుకని ఒకవేళ నే చచ్చిపోతే నా ఈ సొత్తులో నీకేది ధర్మంగా తోస్తే అది నువ్వుంచుకో. కాని మా వంశానుగతంగా వచ్చిన ఈ దండ మొహరు మాత్రం నా కొడుక్కివ్వు రంగా అంతేరా, చేస్తానని నాకు మాట ఇవ్వు అంటూ చేతిలో చెయ్యి వేయమన్నాడు, కళ్ళు తుడుచుకుంటూ.

"అట్లాగే పిన్నయ్యా, కాని నీ దండ నీ కొడుక్కి నువ్వే ఇచ్చుకుంటావు. మనం గెలుస్తాం చూడు" అని ఓదారుస్తూ చేతిలో చెయ్యి వేశాడు.

"ఏమోరా రంగా నాకానమ్మకం లేదు" అంటూ నిట్టూర్చిన శబ్దం వినవచ్చింది.

## యమదంష్ట్రిక

రామరాయలు ఇదంతా వింటూ కొంత వరకు చూస్తూ వున్నాడు ముఖంలో ఒక వింత నవ్వు మెరిసింది కళ్ళల్లో కొత్తకాంతి ప్రవేశించింది. తన గుడారానికి తిరుగుముఖం పట్టాడు. అడుగులు బలంగా చురుగ్గా పడుతున్నాయి. మనసు తేలికపడ్డది. కొండంత దిగులుతో వెళ్ళిన అళియరాయలు తేలిక పడ్డ మనసుతో వస్తున్నాడు. దారిలో ఒక డేరాముందు బుర్రకథ చెప్తున్న ఇద్దర్ని చూశాడు. "అప్పుడే మయిందంటే తందానా.. ...మొగకాకి తన బిడ్డలు పాముపాత పడటం చూచి దుఃఖించి, తన భార్య దిగులు చూడలేక ఉపాయంగా రాజకుమారి ముత్యాలహారాన్ని ఆమె చూస్తూ వుండగా ముక్కున కరుచుకుని చెలికత్తెలు తనని అనుసరిస్తున్నట్టు గమనిస్తూ పుట్టదగ్గరికి ఎగురుతూవెళ్ళి పుట్టలో జారవిడిచింది... తందానా తానితందనా" అంటూ చెప్పడం విన్నాడు.

రామరాయలకు వుత్సాహం పురకలువేసింది. కాలు భూమిపై ఆనలేదు. తనవార్ని చేరాలన్న ఆతృతతో గబగబా నడుస్తున్నాడు. అప్రయత్నంగా కుడిచెయ్యి తన మొలనవున్న కటారి "యమదంష్ట్రిక" మీద పడ్డది. ఎడమచెయ్యి కోరమీసాలను పైకి మెలపెట్టింది.

అమితోత్సాహంతో తనవారిని చేరుకున్నాడు అందర్ని సమావేశపరిచాడు. ప్రస్తుతపరిస్థితుల్లో ఏమిచేయాలో వారి అభిప్రాయాలు చెప్పమన్నాడు. ఇరుపక్షాలవారి వ్యతిరేక అభిప్రాయాలనువిన్నాడు. కెళది సదాశివుడు, షెజాఫర్, కరీంబేగ్ యుద్ధానికి తొందరపడుతున్నారు వీరు తర్క వితర్కాలలో మునిగితేలుతుండగా ఒక విచిత్రంజరిగింది. వింత నవ్వొకటి ముఖాన ద్యోతక మవుతుండగా అళియ రామరాయలు తన సహజమైన దుందుడుకు తనంతో మొలలో వేలాడుతున్న కరవాలం "యమదంష్ట్రికను" సర్రున బైటకి లాగి, దానిలో తాపడంచేసిన వజ్రవైడూర్యాలు, పచ్చలు నీలాలు మిరుమిట్లు గొల్పుతూ వుండగా ఆకాశాన ఒక మెఱుపు మెరిసిన చందాన దాన్ని బలంకొద్దీ కోటలోకి విసిరివేశాడు.

ఇది చూసిన అక్కడి విజయనగర సేనావాహిని యావత్తు నోట మాటరాక శిలాప్రతిమలై నిలిచారు. ఏమిటి ఈ రామరాయల వుద్దేశం? ఈ కరవాలంగురుదేవులు విద్యారణ్యుల వారు దైవాశీర్వాదంతో బుక్కరాజు చేతుల్లో పెట్టినది. ఇప్పుడు దీనిని ఈ తురుష్కుల కోటలోకి ఎందుకు విసిరివేసినట్టు అని ప్రాన్పడి చూడసాగారు.

చేష్టలుదక్కి నుంచున్న తన సేనావాహినిని చూసి రామరాయలు చిరునవ్వు చెదరకుండా 'సేనాపతులారా, దండనాథులారా, సామంత


ACTION AND GAIN
జీవన్‌టోన్ క్రియాశీలత మరియు ప్రయోజనం
బలహీనమైన, అనారోగ్యమైన కణాలకు మరింత రక్తప్రసారం జరిపి ఆరోగ్యం కల్పిస్తుంది. శక్తిని పెంచి కండరాల పెరుగులకు దోహదం చేస్తుంది. ఒక సీసా ఔషధం సేవించిన తర్వాత మీ ఆరోగ్య అవసరాలకు మరెన్ని సీసాలు సేవించాలో మీరే నిర్ణయించవచ్చు. మీ ఆరోగ్యం సరిగా లేకపోతే ఎన్నో జబ్బులు వస్తాయి. మీకు చక్కటి ఆరోగ్యం, బలం, దారుఢ్యం. కండరాలు సమకూరిన తర్వాత ఈ ఔషధాన్ని సేవించడం నిలిపివేయడం మంచిది.
JEEVANTONE PRODUCTS P. B. 880
17/2 Cambridge Road, Bangalore-8
Sole Distributor
Sanjeevini Pharmaceuticals
39/188, Vaddigeri Kurnool — 1
JEEVANTONE
Ask for one 85
Picture Calendar

# యమదంష్ట్రిక

ప్రభువులారా, సోదర వీరాగ్రేసరులారా ఏమిటంత వింతగా చూస్తున్నారు ? విజయనగరరాజుల సింహాసన కిరీటాలతోపాటు వంశానుగతంగా అందుకుంటున్న దైవదత్తమైన ఆ వీరఖడ్గాన్ని నేను కోటలోకి విసిరింది చూశారుగా ? మీలో ఎవరు ఆ వీరఖడ్గాన్ని నాకు తెచ్చి ఇవ్వగలరు? ఆ గౌరవం ఎవరు దక్కించుకుంటారు?'' అన్నాడు

ఎవరు సమాధానం ఇవ్వలేదు. ఆ పని మాటలతో జరిగే పనికాదు కోట స్వాధీనమైతేనే ఆ యమదంష్ట్రిక తేవటం జరుగుతుంది. అది జరగకనే కదా ఇప్పుడీ చర్చలు. దీనికెవరు సమాధానం చెప్పగలరు ?

రామరాయలు వారి ముఖాలను తేరి చూస్తున్నాడు. ఒక్కొక్కరి ముఖమే రాయల చూపులు ఎదుర్కోలేక కిందికి వంగిపోతున్నవి.

రామరాయ భూవరుడి కళ్లు కెంపుడాలు తిరుగుతున్నై. ముఖం గంభీరంగా మారుతున్నది. వారి నుద్దేశించి ఏమిటీవింత ! మీలో ఆనాటి ధీరులు లేరా ? వీరాగ్రేసరులు లేరా ? విజయనగర సామ్రాజ్యసేనలు నిర్వీర్యమైపోయినయ్యా? విజయనగర సామ్రాజ్య ఔన్నత్యం అడుగంటిపోవాల్సిందేనా? మీలో ఏ ఒక్కరికి ఆ ఖడ్గాన్ని తేగల ధైర్యసాహసాలు, పరాక్రమంలేదా? చేవచచ్చి కూర్చున్నారా...''

రాయల మాటలు కొరడాదెబ్బలవలె ఛల్లు ఛల్లుమని తగుల్తున్నై. వంగిపోయిన ముఖాలు ఒకటొకటే పౌరుషంతో పైకి లేస్తున్నై కళ్లు ఎర్రబారుతున్నయ్.

అంతలో అందర్ని నెట్టుకుంటూ కెళది ప్రభువు ఇక్కేరి సదాశివ నాయకుడు ముందుకొచ్చాడు. ''ప్రభువులు దయతో ఈ కార్యం నా భుజస్కందాలపై పెట్టాలని నా ప్రార్థన. రేపు సూర్యుడు కుంక ముందు ప్రభువుల మొలను వ్రేలిన ఆ వీరఖడ్గాన్ని యధాస్థానం చేరుస్తానని మాట ఇస్తున్నాను. రేపు సూర్యాస్తమయవేళకు ప్రభువులవద్దకు ఖడ్గమో, నా మస్తకమో చేరుస్తాను'' అన్నాడు.

''భళిభళి సదాశివ నాయకా నీ మాటలు నాకు మహదానందాన్ని కలిగించినై. మీ కెళది ప్రభువుల ధైర్య సాహసాలు, స్వామి భక్తి ఇంకొకమాటు చాటుకునే అవకాశంనీ చేజిక్కించుకున్నావు. ''శత్రుసప్తాంగ హరుడివి'' ఈ పని నీకెంతపాటిది. ఈ కార్య దురంధరులుగా మీకు తాంబూలమిస్తున్నాను. పుచ్చుకోవలిసింది'' అని సదాశివనాయకుడికి ''విజయోస్తు'' అంటూ తాంబూలమిచ్చాడు. మిగిలినవారివైపు చూస్తూ ''అయ్యలూ మిమ్మలను అవమానపరచటానికి నేనామాటలు అనలేదు. మీలో దాగివున్న పౌరుషాన్ని రెచ్చగొట్టాలనే అన్నాను. మీరందరూ ఒకటై సదాశివ నాయకునికి ఆసరాగా నిలిచి మాకు విజయం చేకూర్చాలని కోరుతున్నాను'' అన్నాడు.

రామరాయలకు జై. విరూపాక్షునికి జై అంటూ సదాశివనాయకుని తోడుగా అందరూ నిష్క్రమించారు.

కోటగోడలపైన అక్కడక్కడ కాగడాలు వెలుగుతూ ఆరుతూ వున్నయ్. దూరంగా రాయలసేనకు ఆవాసమైన గుడారాల్లో చాలాసేపు చెక్కలు కూరుస్తున్న మోతలు వినపడ్డయ్. దీపాల వెలుగు కనపడ్డది.

కోట చుట్టూ అంధకారం అలముకున్నది శత్రు శిబిరాలలో అంతసేపు దీపాలు వెలగడం చూసి కోటగోడలపైన సిపాయిలు కలవరపడ్డారు. చుట్టూ గాడాంధకారంతో కోటగోడల కింద ఏమి జరుగుతున్నదో కనిపెట్టటం కష్టంగావుంది. శత్రువులకి వెలుగులోవున్న తాము కనపడతారేకాని వాళ్లు తమకి కనపడరు.

విజయనగర సేనలు తమని ఎదిరించటానికి ఆయత్తమై వస్తున్న సూచనలు కనపడుతున్నాయ్. ఆ చీకటిలో ఏమిటి చెయ్యడమా అనుకుంటూ ఎడమదిశ కోటగోడదుర్భేద్యమనుకొని అక్కడి సేనలను తమకు అండగా తెచ్చుకున్నారు. ఇదే అదననుకున్న విజయనగర సేనలు ఆ పక్కనే ప్రేలుడు మందుపెట్టి గోడను పడగొట్టే యత్నాలు చేశారు.

కోట గోడలపైన దీపాలుదించి ఎత్తేలోపల ఎడమపక్క కోటగోడ వద్ద మందు గుండు ప్రేలిన శబ్దం వినవచ్చింది. కోటగోడల పైన కోటలోపలవున్న సిపాయిలు వైపు పరిగెత్తుతున్నారు. బురుజులపైని ఫిరంగులను ఎడమవైపుకి తిప్పి కాలుస్తున్నారు. ఇంతలో పెళపెళమంటూ ఆకాశం విచ్చినట్లు భూమి దద్దరిల్లేటట్టు మోతలు వినపడ్డాయ్. ఏమయిందో చూసేలోపలే కుంభస్థలాలు చిట్లె నెత్తుర్లు చిమ్ముతున్న గజదళం పెద్ద దుంగలతో ఢీకొట్టి కోట తలుపులు, గోడలు పడగొట్టి ఆవుసికి ఆగలేక ఎదురైన వాళ్ళను నేలరాస్తూ కోట లోపలికి పరుగు తీసినై.

వాటి వెనుక జయజయ ఘోషలుసలుదిశలు నిండగా విజయనగర సేనావాహిని కోట లోపలకు చొరపడ్డది. అనుకోని ఈ హఠాత్ సంఘటనకి మ్రాన్పడిన కోటలోని సైన్యానికి ఆయుధాలు ధరించే అవకాశం కూడా లేకుండా పోయింది. కొంతమంది తెగించి ఎదురుతిరిగినా వారిది కింద చెయ్యి కావటానికి ఎంతోసేపు పట్టలేదు. కోట అంతా జయధ్వానాలతో మారు మ్రోగింది. ఆనందోత్సాహాలు వెల్లి విరిసిన్నై. కళ్లు మిరుమిట్లు కొలుపుతూ దీపాలు వెలిగి కారుచీకట్లను పారద్రోలి దీపావళిని గుర్తుకుతెచ్చింది.

మరుసటి ఉదయం రామరాయలు అనుచరులతో విజయసభ తీర్చాడు. అందరు కనిపించారు కాని సదాశివ నాయకుడే లేడు. అందరి ముఖాలు ఆందోళన వెలిబుచ్చుతున్నాయ్. ఇంతలో బంగారు పశ్శైరంలో ముఖమల్ వస్త్రిలమధ్యహరివిల్లేమోనని భ్రమ కలిగిస్తూ మెరుపులా మెరిసిపోతున్న ''యమదంష్ట్రిక'' కొలువై వుండగా హస్తార పదంగా సకల మర్యాదలతో దాన్ని పట్టుకొని సదాశివ నాయకుడు రామరాయలముందు అవీనత శిరస్కుడై నిలిచాడు. రామరాయలు అమితానందముతో ఖడ్గాన్ని తీసుకుని కనులకద్దుకుని వరలో జొనిపి సదాశివనాయకుని గుచ్చి కౌగిలించుకున్నాడు, ''శభాష్ సదాశివనాయకా. మా గౌరవాన్ని, విజయనగర ఔన్నత్యాన్ని నిలపెట్టిన వీరుడివి. కళ్యాణికోట గెలిచిన ''కోటి కోలాహలుడివి.'' నీ వంటి వారు వుండుటచేతనే విజయనగర సామ్రాజ్యం నేడింత ఉచ్ఛదశలో ఉన్నదంటూ మెచ్చుకొని విరివిగా ధన కనకవస్తు వాహనాలు బహూకరించి సన్మానించాడు.

ఆనందోత్సాహాలలో ఓలలాడుతున్న తన అనుచరుల మధ్యనుంచుని ఇనుమడించినదర్పంతో కుడిచేయి ''యమదంష్ట్రిక'' మీదవేసిన ఠీవిగా నుంచున్నాడు రామరాయలు. □






Sobhagya/RCF/U/83

# సాహిత్యంలో ప్రగతి సాధన

గత శతాబ్ది చరమదశలోనే తెలుగు సాహిత్యంలో విభిన్న ప్రక్రియలు ప్రారంభమయాయి. అంతకుపూర్వం కావ్యాలే కాకుండా శాస్త్రీయ విషయాలు కూడా పద్యరూపంగానే వుండేవి. విషయం పద్యంలోనే ఉండినా వివరణం వ్యావహారిక వదనంలోనే ఉండేది. అప్పటిలో గ్రాంధిక వ్యావహారిక భాషా వివాదాలు లేవు. తెలుగులో నవలలూ, నాటికలూ, కథలూ, చరిత్రలూ, స్వీయ చరిత్రలూ నూతన యుగకర్త వీరేశలింగం పంతులుగారితోనే ప్రారంభమయినాయని చెప్ప వచ్చును.

నాటక రచనకు సంస్కృతంలో పాత్రోచితంగా వ్యావహారికమైన ప్రాకృతం కూడా వాడ బడినా తెలుగులో మాత్రం మొదట్లో అన్ని పాత్రలకు గ్రాంధిక భాష మాత్రమే వాడ బడేది. వేదం వెంకటరాయశాస్త్రిగారి వంటి వారు మాత్రం పాత్రోచిత భాషవాడి మార్గ దర్శకులయినారు.

ఈ శతాబ్ది ప్రారంభంలోనే గ్రాంధిక వ్యవహారిక భాషా వివాదాలు ప్రారంభమై కొంతకాలం తీవ్రంగా కొనసాగాయి. వివిధ శాస్త్ర విషయాల గ్రంథాలు, నవలలు, చరిత్రలు ప్రకటించే విజ్ఞాన చంద్రికా గ్రంథమాలవారూ కేవలం నవలలనే ప్రకటిస్తూ ఉండిన ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాలవారూ గ్రాంథికభాషనే ఉపయోగించేవారు. ఆంధ్ర సాహిత్య పరిషత్తు గ్రాంధిక భాషకే అంకితమయింది.

వ్యావహారిక భాషా ప్రచారానికి వూనుకున్న గిడుగు—వెంకట రామమూర్తి పంతులుగారు 'తెలుగు' మాసపత్రికను స్థాపించి గ్రాంధిక వాదుల లక్షణ విరుద్ధ ప్రయోగాలను చూపుతూ వారి వితండవాదాన్ని ఖండించేవారు. శ్రీపాద—కృష్ణమూర్తిశాస్త్రిగారి 'వజ్రాయుధ' పత్రిక వ్యావహారిక భాషావాదాన్ని ఖండిస్తూ వున్నా క్రమక్రమంగా వ్యావహారిక భాష ఎక్కువ ప్రచారాన్నీ, ప్రజల ఆమోదాన్నీ పొందినది పత్రికలు ఆ భాషలో వార్తలను ప్రకటించడం ప్రారంభించాయి.

ఇది ఇలాగున ఉండగా పద్యకవిత్వంలో కూడా మార్పు వచ్చింది. ఆంగ్లభాషా సాంప్రదాయాన్ననుసరించి కవిత్వంలో పెద్ద మార్పు కలిగింది. కథాప్రధానం కాక భావప్రధానమైన కవిత్వం సులభశైలిలో, సులభ చ్ఛందస్సులో వచ్చి భావ కవిత్వంగా పేరుపడింది. దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారి మార్గదర్శకత్వంలో వెలువడిన ఆ కవితా పద్ధతిని చాలామంది యువకవులు అనుసరించారు. ఇందులో దైన్య, ప్రణయ, హృదయ స్పందనలు ప్రధానంగా ఉండినవి.

పదేళ్ళపాటు ఈ కవిత మంచి ప్రచారంలో ఉండినది. కాని అభ్యుదయ మార్గాన్వేషుల కవిత ముందుకురాగా, ఇది వెదుకపడింది. అభ్యుదయ కవితకూడా చాలాకాలం సాగలేదు. తర్వాత శ్రీశ్రీ 'మహా ప్రస్థానం'తో నూతన యుగం ప్రారంభమయింది. ఛందోనియమంతో ప్రమేయం లేని వచన పద్య కవిత ప్రచారంలోకి వచ్చింది. పీడిత జనానికిచ్చే తిరుగుబాటు ప్రోత్సాహం, ప్రజాసామాన్యాభ్యుదయ మార్గ ప్రచారం ముఖ్యలక్ష్యాలుగా ఇది ప్రచారం సాగిస్తున్నది. వచన కవితా ధోరణిలో ఎన్నో మినీ కవితలు పత్రికల్లోను, సాహితీ సమావేశాలలోనూ ప్రముఖ స్థానాన్ని ఆక్రమించాయి. సౌలభ్యం దీనికి కొంత కారణం కావచ్చు.

వ్యవహారిక భాషావ్యాప్తి కారణంగా రచయితలతో పాటు ఎందరో రచయిత్రులు రంగానికి వచ్చారు. నవలల్లోను, కథలలోనూ వారిదే పైచెయ్యి అని చెప్పవచ్చును. పాఠకలోకం పెరిగిన కొద్దీ పత్రికల సంఖ్య కూడా పెరుగుతున్నది. ఔత్సాహికులకో పత్రికలు ప్రోత్సాహాన్ని ఇస్తున్నవి. సాహితీరంగంలో ప్రగతికి దోహదం లభిస్తున్నది.

సాహిత్యసభలు, సమావేశాలు, గ్రంథావిష్కరణలు, కవితాగానాలు విరివిగా సాహిత్యాభ్యున్నతికి తోడ్పడుతున్నవి. సభలను, సమావేశాలను ఏర్పరచి, ప్రముఖులచే ఉ న్యాసాలిప్పించి, పెక్కు పరిశీలన గ్రంధాలను ప్రకటించుటలో యువ భారతిది అగ్రస్థానం. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రాచీన గ్రంథాలను ప్రకటిస్తూ చేస్తున్న సేవ అమోఘమైనది.

సాధారణంగా సమావేశాలలో ప్రముఖుల ఉపన్యాసాలకూ, కవితాగానాలకూ అభిమానులూ, ఆసక్తి కలవారూ మాత్రం హాజరవుతూ వుండడం, వాటిని విని ఎవరిమానాన వారు వెళ్ళిపోవడం జరుగుతూ ఉంటుంది. విద్యార్థులకు ప్రోత్సాహమిచ్చి, వీటిలో పాల్గొనేటట్లు చేస్తే ఇవి జనాన్ని ఇంకా ఆకర్షించగలవు. విద్యార్థులచే వ్యాసాలు వ్రాయించి చదివించడం, ఉపన్యాసాలిప్పించడం జరిగితే వారిలో ఉత్సాహం పెరుగుతుంది. ఆసక్తి కలుగుతుంది. వ్యాసరచనలో పోటీలు పెట్టి బహుమానాలివ్వడం కూడా మంచి పద్ధతి. ముఖ్యంగా ఇతర రంగాలలో వలెనే సాహితీరంగంలో కూడా ప్రగతిని సాధించడం వాళ్ళచేతిలోనే ఉంది. వాళ్ళువేదికలెక్కితే చూడడానికీ, వినడానికీ పెద్దలతోపాటు పిల్లలు కూడా చాలామంది వస్తారు. అందువల్ల సాహిత్యం కోసం కృషిచేసే సంఘాలు విద్యార్థులకు ప్రోత్సాహాన్ని యిస్తే ప్రగతిని సాధించగలవు.

— 'ఆంగీరస'

## మార్పు

గతము ఘోర తిమిరమైనను
ఆ గతము పట్ల ఆశలు పల్లవించు
మలిగిపోవుచునున్న ఇనుని కాంతిరేక
సుప్రభాతవేళ చిగురించునట్లు......

ఆరంభమమావాస్యయైన నేమి
రోజుకొక్క కళ పెంచుకొనుచున్న
ఇందుడాకస వీధిలో రాజుగాడె
పూర్ణచంద్రిక వెదజల్లి పులకలిడగ......

నిన్న మొన్నటి దనుక వట్టిమోడు
చిగురు సొగసులతోటి శబలమయ్యె
హేమంత శైత్యమావహిల్లిన వెల్ల
వాసంతి ధమ్మిల్ల మధివసించె......

తెల్లవోయిన నింగి పొబగులన్ని
నీలిమలు పులుముకొని నెరులచిమ్మె
దీన ముఖులైన నిన్నటి దిక్కులన్ని
సుమరజము జల్లుకొని నవ్వులుమిసె......

విధుర ఏకాంత సీమలో వేగినట్టి
పడుచు జంటల కలయిక పండుగ ఇది
వలపు పంటల పండించు నేస్తమిదియె
మతుల తొలితలపు తోటల ఋతువుగాగ

అరమోడ్పు కనులలో అలసటల్ ఒకవంక
బడలిపోయినమేని వివశత్వ మొకవంక
సోలుబడు అడుగుల తడబాటులొకవంక
ఋతువనారత మన్న వాంఛ వదిలినట్లు.....

పవన పత్రముపై వి గంధభయము
నింగిచుక్కలనేదియో వింత తళుకు
పూలజాతర చేయు పొదలగుంపు
సంతరించెను వాసంతి కనుల రుచులు

గున్న మామిడి కొమ్మలో గొంతెత్తి పికము
వన్నెచిన్నెలు చిలికె చిన్నిశుకము
పూల తేనెలు త్రాగి మత్తిల్లె తుమ్మెద
గుండె గుబులుకు చెదరె పరువాల పయ్యెద

— సాంధ్యశ్రీ

సీరియల్

# మౌన విప్లవం

ఆర్. పద్మజా చౌదరి

రిజల్ట్సు వచ్చి కొన్ని రోజులకు ఒక సాయంకాలం రామస్వామిగారు తీరిగ్గా రాధను ప్రశ్నించారు 'ముందేమి చేయాలనుకుంటున్నావు? ఎం ఏ ఎంట్రిన్సు వ్రాస్తావా?'

రాధ రెండు క్షణాలు దిక్కులు చూసి 'నాకావుద్దేశం లేదు నాన్నా అంది

ఆడపిల్లలు చదువుకోమని చెప్పారంటే పెళ్ళి చేయండని అర్థం" కృష్ణచైతన్య నవ్వుతూ అన్నా నిజమే చెప్పాడు

సంవత్సరం నుండీ చెప్తున్నాన్రా కృష్ణా సంబంధాలు చూడమని

ఇంతకాలం చదువుకుంటోందని తొందరపడలేదు ఇప్పుడే కదా తేల్చి చెప్పింది" అన్నారాయన భార్య మాటలకు జవాబుగా

జగన్నాధరావుగారి అన్న కొడుకు ఎం టెక్ పాసై సిద్ధార్థలో చేస్తున్నాడట క్వయిట్ హాండ్సమ్ పర్సనాలిటీ నేను కూడా చూశాను' అన్నారాయనే మళ్ళీ

రాధ తన అయిష్టాన్ని తెలియజేస్తూ లేచి వెళ్ళిపోయింది ఆ విషయాన్ని మరోలా అర్థం చేసుకున్న తల్లితండ్రులు "నువ్వేమంటావురా?" అన్నారు

'నాదేముంది రాధ అభిప్రాయం కనుక్కోండి

"ముందుగా మనం చర్చించుకుని మనకిష్టమైతే వారిని సంప్రదించి, అన్నీ అనుకూలంగా వుంటే రాధ యిష్ట ప్రకారమే చేద్దాం" అన్నారు

వారితో మాటాడబోయే ముందు రాధ వుద్దేశం తెలుసుకుంటే బాగుంటుంది '

అతని సలహా తల్లితండ్రులిరువురికీ నచ్చలేదు అన్నీ కుదిరాక ఆమె ఇష్టమైతేనే చేయవచ్చునన్నారు వారిద్దరూ ఆ విషయంలో ధృఢమైన యేకాభిప్రాయం కలిగివుండటం వలన కృష్ణచైతన్య యెక్కువగా వాదించలేదు

వ్యవహారమంతా తనకేమి పట్టనట్టుగా గమనిస్తూ వచ్చిన రాధ, పెళ్ళిచూపుల వరకూ వ్యవహారం రావడంతో ప్రేక్షకురాలిలా చూస్తూ వూరుకోలేకపోయింది పెండ్లి చూపుల యేర్పాటు గూర్చి మాట్లాడుకుంటున్న తల్లితండ్రుల వద్దకు విసురుగా వచ్చి "నేను చేసికోను" అంది

> **జరిగిన కథ –12:** అక్కకూతురు రాజ్యలక్ష్మి చనిపోవడంతో ఆమె కూతురు ప్రభాతను తన ఇంట్లోనే ఉంచుకొంటుంది ప్రభావతమ్మ రామస్వామి, ప్రభావతమ్మల పెద్దకొడుకు కృష్ణచైతన్య అతనికి ప్రభాతంటె అమితమైన అభిమానం కృష్ణచైతన్య తమ్ముడు నందకిశోర్ తనో కన్నడ అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నట్లు అన్నతో చెప్తాడు కృష్ణచైతన్య చిన్ననాటి స్నేహితుడు శరత్, రాధలు ఒకరి పట్ల ఒకరు ఆకర్షితులవుతారు తన డిపార్ట్‌మెంటు వారంతా అజంతా, ఎల్లోరా వెళుతూంటే రమేష్, ప్రభాతలను తమతో కూడా తీసుకెళ్ళిన కృష్ణచైతన్య అక్కడ వారికి డా విద్యను పరిచయం 'చేసాడు రాధ శరత్‌తో వెళ్ళడం చూసిన కృష్ణచైతన్య రాధకి ఇక పెళ్ళి చేయాలని తల్లితో చెపుతాడు రమేష్ తను డా విద్యను ప్రేమిస్తున్నట్లు కృష్ణచైతన్యకు ఉత్తరం రాస్తాడు కృష్ణచైతన్య ప్రభాత తనతో కూడా ఎగ్జిబిషన్‌కు తీసుకెళ్తాడు ఆమెకో మంచి చిత్రాన్ని కొని తెస్తాడు

విన్న వాళ్ళిద్దరూ విస్తుబోయారు

ఇంకా చదువుకుంటావా?"

" "

ఉద్యోగం చేయాలని వుందా?

" "

"ఈ సంబంధం నచ్చలేదా?"

"

"మరో సంబంధం చూడమంటావా?

"అప్పుడే చేసికోను?

ప్రభావతమ్మకు ఆమె పెంకితనం చూస్తే వెర్రెత్తిపోయింది ఏం చేద్దామనుకుంటున్నావేమిటి? అంది కోపంగా

రామస్వామిగారు ఆమెను వారిస్తున్నట్లుగా చూచి ఇప్పుడు చేసుకోవా?ఈ సంబంధం చేసుకోవా? స్పష్టంగా చెప్పు తల్లీ' అన్నారు

తండ్రి తనకు అంత స్వాతంత్ర్యం యిచ్చినా నిజం చెప్పలేకపోయింది ఆమెకు మహా ఉక్రోషంగా వుంది చంకలో పిల్లాడ్ని పెట్టుకుని వూరంతా వెతికినట్లు వీళ్ళు శరత్‌ను గూర్చి యెందుకు యోచన చేయరు? అతనికేమి తక్కువ? తల్లితండ్రులకు నోటితో చెపాల్సి వస్తుందని ఆమె వూహించుకోలేదు

తండ్రి ప్రశ్నకు జవాబేమీ ఇవ్వకుండా వార్ని అయోమయావస్థలో పడేసి వాళ్ళిద్దర్నీ కొరా కొరా చూచుకుంటూ, పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళిపోయింది

మతులు పోగొట్టుకుని కూర్చున్న వారి వద్ద నుండి అసలు విషయం తెలుసుకోవడానికి చాలా కష్టపడ్డాడు కృష్ణచైతన్య

"రాధ ఇంకేమీ చెప్పలేదా?" అన్నాడు అంతా విని

"ఆ రెండు ముక్కలే గోడకు చెప్పినట్లు చెప్పి విస విసా వెళ్ళిపోయింది" అంది ప్రభావతమ్మ

'నేను మాట్లాడతాలే, మీరు విచారించాల్సినంత యేమీలేదు '

గోళ్ళకు రంగువేసుకుంటున్న రాధ నీతో మాట్లాడాలి పైకి రా అన్న అన్నయ్యను అనుసరించింది జంకుతూ

తాను చెప్పబోయేది ప్రారంభించే ముందు ఆమెను పరిశీలనగా చూశాడు అతని చూపులకు తడబడక నిశ్చలంగా కూర్చుంది రాధ అతనెందుకు పిలిచాడో వూహించగలదు రెండు నిమిషాలకు ముందున్న జంకు కూడా యిప్పుడామెలో లేదు

రాధా నాన్నగారు నాకంతా చెప్పారు వారికి నీ వుద్దేశం యేమిటో అర్థం కావటం లేదు

నేను చెప్పాను కదా!

"చదువుకున్న దానివి స్వతంత్రభావాలు కలిగిన దానివి 'నేను పెళ్ళిచేసికోను అని ఒక స్టేట్‌మెంట్ పారేసి యింట్లో అలజడి సృష్టించి మౌనం వహించటం నీకు భావ్యంకాదు '

అలజడి యే ముందిందులో నాకిష్టంలేదు ఆ విషయమే చెప్పాను "

"బాధ్యతాయుతమైన వ్యక్తి చెప్పవల్సిన కబుర్లుకాదు రాధా ఈడొచ్చిన ఆడపిల్లకు పెద్దలు పెళ్ళి చేయాల్సిన బాధ్యత, చేసే సంప్రదాయమూ వున్న దేశంలో బ్రతుకుతున్నాం మనం పెండ్లి చేసికోను' అని వొక వాక్యం చెప్పేసి అంతటితో బాధ్యత తీరిందనుకోవడం సబబుగా వుందా? చిన్నతనం నుండీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలలో పెరిగావు ఆ స్వాతంత్ర్యాన్నీ, అది నీకిచ్చిన వ్యక్తిత్వాన్నీ నిరూపించుకుంటూ నీ అభిప్రాయం తెలియజేశావు బాగుంది అప్పుడే నీకు పెళ్ళి యెందుకు వద్దో, యెప్పుడు చేసికుంటావో, యెవర్ని చేసికోవాలను కుంటున్నావో గూడా చెప్పేసి నీ నిర్దుష్టమైన వ్యక్తిత్వాన్ని నిరూపించుకుంటే యింకా బాగుండేది ఏమాత్రం మానసిక పరిపక్వంలేని మామూలు వనితలా ప్రవర్తించావేమిటి?'

రాధ విభ్రాంతు రాలయ్యింది. అతడు యింత సూటిగా, వాడిగా ప్రశ్నిస్తాడని వూహించని ఆమె నిరుత్తర అయ్యింది. తానెంత అవివేకంగా ప్రవర్తించిందో తెలుసుకుని ఖిన్నురాలైంది.

చెప్పరాదా నేనేమైనా పొరపాటు మాట్లాడానా?

అబ్బే లేదన్నయ్యా తడబడింది.

ఇరవై సంవత్సరాలు నిండాక కూడా నీకంటూ నీ వివాహ విషయమై వొక అభిప్రాయం యేర్పడ లేదా?

అలా కాదన్నయ్యా

మరేమిటో చెప్పకుండా మాకెలా తెలుస్తుందని నీ కెవరి మీదనైనా యింట్రెస్టు వుందా?

రాధ తలవంచుకుంది.

వ్యక్తి స్వాతంత్రం, స్త్రీస్వేచ్ఛా అని వుపన్యసించే వారే ధైర్యంగా ప్రవర్తించలేరు సంకోచాన్ని వీడలేరు.

నువ్వు చెప్పకుండా యెలా తెలుస్తుంది?

రాధ చెప్పాలని శతవిధాల ప్రయత్నిస్తుండగానే మరో ప్రశ్న వేశాడు శరత్. వాళ్ళ నాన్నగారితో మాట్లాడమంటావా?

చివ్వున తలెత్తింది. ఆమె కళ్ళలో ఆశ్చర్యం, ఆనందం, కృతజ్ఞతా భావాలు పోటీ పడుతున్నాయి.

ఆమె మూగబోయింది.

అతను చిరునవ్వు నవ్వాడు.

"ఒ కె యీ రోజునుండీ ఆ ప్రయత్నంలో వుంటాము. వీలైనంత త్వరలో"

అతను మాట పూర్తిగాకముందే రాధ అక్కడ లేదు.

కృష్ణచైతన్య చెప్పింది విని తల్లిదండ్రులిద్దరూ నిశ్చేష్టులయ్యారు.

తమ కెందుకా ఆలోచన రాలేదు' అనుకున్నారు.

కొంచెం ఆలస్యంగా ప్రభావతమ్మకు అనుమానం వచ్చింది. వాళ్ళిద్దరూ అర్థోక్తితో ఆపేసింది.

ఆ తరువాత శరత్ వారింటికి వచ్చినప్పుడు తనకు జరుగుతున్న నూతన సత్కారానికి కారణం తెలియక తికమక పడ్డాడు. పూర్వంలేని మర్యాదలు పొందడానికి యిబ్బంది పడ్డాడు. రాధకు అతని అవస్థ చూస్తే నవ్వొస్తుంది. ఎవ్వరూ లేని సమయం చూచి అసలు విషయం అతని చెవిలో వూదింది.

"నాన్నగార్ని చూచి చాలా కాలం అయింది. ఒకసారి వెళ్ళాలను కుంటున్నానోయ్" అన్నారు రామస్వామిగారు.

నాన్నగారు కూడా అలాగే వ్రాస్తున్నారు. ఆదివారాలు వస్తే చాలు ఆయనకు జర్దకం. నువ్వే కదిలించి తీసికు రావాలి అని వ్రాశారు.

దాంతో ఆయన అసలు విషయం మర్చిపోయి ఆదివారం తనకెంత ప్రీతికరమైనదో, మిగిలిన ఆరు రోజుల అలసట నుండీ యెలా విశ్రాంతి పొందుతారో వివరించ సాగారు.

ప్రభావతమ్మ యిలా లాభం లేదని తనే కలుగ చేసికుని. యెప్పుడు వెళ్దామంటావు?" అంది.

"మీ యిష్టమండీ. నాన్నగారు నందకిశోర్, జయశ్రీ వచ్చినపుడు వార్నికూడా తీసికు రమ్మని వ్రాశారు.

వాళ్ళిద్దరూ ఒకేసారి రావడమంటే యెప్పటికీ "

"అబ్బే వాళ్ళొచ్చే వరకూ ఆగమనికాదు. అందర్నీ రమ్మనమని ఆహ్వానం."

"అందరూ మరోసారి వస్తాం. ముందు నేను, మీ ఆంటీ వస్తాము '

అదేమిటి కృష్ణా నువ్వు రావూ? రాధ వూరుకుంటుందా తనను వదిలి వెళ్తే "

"దానికి ఆరోగ్యం అంత బాగాలేదు "–ప్రభావతమ్మ.

"నాకు యూనివర్సిటీలో కొంచెం పనుంది. మరోసారి వస్తాను" కృష్ణచైతన్య.

అనుకున్న ప్రకారం వొక ఆదివారం ఉదయమే రామస్వామి గారు, ప్రభావతమ్మ శరత్‌తో కలసి కార్లో నిజామాబాద్ వెళారు. అక్కడ నాగేశ్వరరావు గారింటికి చేరేసరికి భోజనం సమయం అయ్యింది. ముందుగానే శరత్ ట్రంకాల్ చేసి చెప్పడం వలన ఆయన, కమలమ్మ వారి కోసం నిరీక్షిస్తున్నారు.

బహుకాలం తరువాత కలుసుకున్న ఆ మిత్రుల్ని శరత్ మౌనంగా తిలకిస్తూ వుండిపోయాడు. వారిలో కలిగిన ఆనందం, వుద్వేగం నిర్వచనీయం.

కృష్ణ, రాధ రానందుకు బాధపడ్డారు వారు.

ఊరుకు మీ యిల్లు శాంపిల్ అన్నారు రామస్వామిగారు.

అదేమిటి?

ఊరెంతో అభివృద్ధి చెందింది. అలాగే మీ ఇల్లు.

అందరూ నవ్వుకున్నారు. రామస్వామిగారు చెప్పింది సత్యం. నాగేశ్వరరావు గారు యింటిని ఎంతో పెద్దది చేశారు. ఇల్లంతా ఖరీదైన వస్తువులతో నిండి వున్నది. ఆయన వ్యాపారంలో ఎంత అభివృద్ధి చెందారో ఆయన యిల్లే చాటి చెపోతుంది.

అంత యింట్లో వారిద్దరూ, యిద్దరు పెద్ద కొడుకు సంతానం, పనివారు మాత్రం వుంటారు. ఉద్యోగాల నిమిత్తమై తలావొక దిక్కు వెళ్ళిన పిల్లలు ఎప్పుడో వచ్చి పోతుంటారు. పెద్ద కొడుకు నార్తులో వుంటున్నాడు. అతని కొడుకు, కూతురు, తాతా, నాన్నమ్మల వద్ద వుండి చదువుకుంటున్నారు. శెలవులకని తల్లిదండ్రుల వద్దకు పంపానని చెప్తూ ఆ పిల్లలిద్దరూ లేకపోతే మనసు పూర్తిగా ఖాళీ ఐపోయేది" అన్నారాయన.



# పాడిందే పాట!

పాడిందే పాడినా గొంతు మార్చి పాడినా
గుణములేని పాటలతో జాతి గణనకెక్కునా ?
రాసిందే రాసినా సిరా మార్చి రాసినా
వాసిలేని రాతలతో జాతిరీతి మారునా ?
కోతిగూడ రాముడితో నీతి కొరకు నిలబడితే
ఆ కోతికి వారసుడు మనిషి జాతినీతి నిలపడేమి ?

రాసినారు రాసినారు రాజుల కాలాన్నుండి
ప్రజలేపట్టం గట్టిపట్టుబట్టి రాసినారు
పట్టుబట్టి రాసినా తిట్టిమొట్టి రాసినా
మారని ఈ జాతి కతను కోరని ఈ జాతివెతను
చెప్పలేను చెప్పలేను గుండె విప్పిచెప్పలేను !

గుండె లెదురొడ్డినారు గుండ్లకెదురు నిలిచినారు
కొంపాగోడొదిలిపెట్టి జైళ్ళల్లో కుమిలినారు
ఉద్యమాలకూపిరొసగ ఉరి కంబాలెక్కినారు
నెత్తురంత నేలరాల వెక్కివెక్కి ఏడ్చినారు
ఈ గాలి ఈ వెలుతురు ఈ నేల ఈ నీళ్ళు
నీ దేశం నీదేనని నీదేనని నమ్మి అప్పగించినారు
సమతా మమతలు జాతికి ప్రగతి మార్గమన్నారు
జాతికీర్తి శ్రమశక్తికి సాక్షిభూతమన్నారు
అయినా జాతి కీర్తి కిరీటాలు కొందరికే పరిమితాలు !

మతం మత్తు మింగినాము గత చరిత్ర మరచినాము
కులం రొంపిలో జొరబడి వొళ్లంతా కుళ్ళినాము
ప్రాంతీయత చాటులోన మాటువేసి నిలిచినాము
మన సంస్కృతి సంస్కారం మట్టిగొట్టుకొని పోతే
మానవాళి మనుగడకే మట్టుబెట్టు ఘనత మనది
నేతి బీరకాయలోని నేతి బొట్టు కీర్తి మనది !

బుద్ధుడు జిన చైతన్యులు మనజాతికి పెద్దలు
కత్తివదును తడిమిచూడ వెనుకాడవు మన బుద్ధులు'!

ఆడి తప్పనట్టి హరిశ్చంద్రుడే మనవాడు
ఊరికొక్క కోర్టున్నది ఎందుకురా నేడు ?
తండ్రిమాట జవదాటని తనయుడు శ్రీరాముడు
తండ్రీ బిడ్డల మధ్య వద్ది కేడరా నేడు ?
అబలల చెరగొన్న హీనులొక్కరిద్దరానాడు
వీధికొక్క ఊరికొక్క అఘోరించెరా నేడు !
అహింసకే మారుపేరు అలనాడు గాంధీజీ
అడుగు బడుగువర్గాల బాంధవిరా ఇందిరాజీ !
గాంధీలు యిద్దరైతే గాడ్సేలు ఎందరురా ?
జాతికి తలవంపులుగా జాతర చేస్తున్నార్రా !

వంచిన నడు'నెత్తకుండా వెన్న పట్టుచీరనేసి
చెమట బొట్ల పూలరైక చిత్తారీ నేతనేసి
పుడమితల్లి కర్పించే కర్తవ్యం మనకుంటే
నెత్తురు మరకలు చేసే నీచత్వం వద్దురా !
వల్లమాలినంత సేవ నల్లకాకి చేస్తుండే
తెల్లగుడ్డ కట్టిగూడ తెలుసుకోవెందుకురా ?

శాస్త్రీజీ సర్దార్జీ జానూభానూరా మను
విభేదాలు విస్మరించి జాతి విలువ నిలపరా !
భారతాంబ బిడ్డలమని బాగొప్పగ చాటురా !
చచ్చినా బ్రతికినా సార్థకత చెట్టుజన్మ
చెట్టుచావు చస్తేనే చరితార్థం మనిషి జన్మ !

ఈ జన్మకు మరుజన్మం నాకంటూ ఒకటుంటే
పుట్టతాను పుట్టతాను భారతాంబ కడుపులోనె
కర్ణుడి కవచకుండలాలవోలె కవితతోనె పుట్టతాను
పట్టతాను పట్టతాను పదునైన కలమునపుడు
నా జాతి కీర్తిప్రభలు నలుదిక్కుల నింపుతాను !

(కొత్త ఢిల్లీ, ఆకాశవాణి నిర్వహించిన జాతీయ కవి సమ్మేళనంలో చదివిన కవిత—ఆకాశవాణి సౌజన్యంతో)

- పులికంటి కృష్ణారెడ్డి

## మౌనవిపంచి

నమలమ్మ చకచకా వడ్డన ప్రారంభించింది.

మీరు కూడా కూర్చోండమ్మా అందరం కలిసే చేద్దాం అన్నారు రామస్వామి గారు

వంటవాడు వడ్డిస్తుంటే అందరూ కలసి భోజనం చేశారు

రాత్రి భోజనాలు కూడా పూర్తయ్యాక గానీ వచ్చిన విషయం చెప్పలేక పోయారు రామస్వామిగారు

పెద్దల్లుడు నర్సింగ్ హోం పెట్టుకుంటుంటే అతనికి అంతా క్యాష్ యిచ్చాను రాద క్కూడా అలాగే యివ్వాలంటే రెండు మాసాలు గడువులో డబ్బు ఇవ్వం చేయగలను కాదు పొలం కావాలంటే పొలం యిస్తాను లేదంటారా, హైద్రాబాద్‌లో ఫ్లాట్ వుంది మంచి యిల్లు కట్టిస్తాను. మీరు చెప్పండి" అన్నారు.

"బాంధవ్యాలను వ్యాపార దృష్ట్యా నేను ఆలోచించను. మీ విషయాలు నాకు తెలుసు. నా వివరాలు మీకూ తెలుసు ఇచ్చిపుచ్చుకోవడాలంటారా, మీ యిష్టం మీ అమ్మాయి యిష్టం నేను ఏ కోడలి వద్దా నాకింత కావాలని పుచ్చుకోలేదు వాళ్ళు తెచ్చుకున్నది వాళ్ళే అనుభవిస్తున్నారు ఇక సంబంధం మాటంటావా మీతో వియ్యమందటం నాకెంతో యిష్టం అబ్బాయి యిక్కడే వున్నాడు మీరే అడగండి

"మీతో మాట్లాడటం సాంప్రదాయం. అందువలన ఇంతవరకూ శరత్‌కు మేమెందుకు వస్తున్నామో గూడా తెలియజెయ్యలేదు. మీరే అతడ్ని కనుక్కుని చెప్పండి."

"శరత్...."

"తొందరేముంది. మీరు అతడితో ప్రైవేట్‌గా మాట్లాడండి. అతనేమైనా యిబ్బంది పడవచ్చునేమో."

"వాడేమీ ఆడపిల్లకాదు. సిగ్గుపడను. ఒకేమాట ఎస్ ఆర్ నో."

పిల్చారా అంటూ వచ్చిన శరత్‌తో "రాధను చూశావా" అన్నారు. తల వూపాడు.

"అంకుల్ రాధను నీకిస్తామంటున్నారు. నీ అభిప్రాయం చెప్పు."

"ఇష్టంలేక పోవడానికి కారణం యేముంటుంది?"

లేచి వెళ్ళిపోయాడు లోపలకు.

"నువ్వేమంటావు?" అని భార్య వైపు తిరిగాడు.

"మీ ఇష్టం" అనిగాక ఆమె యెప్పుడైనా యేమంది కనుక?" విన్నారుగా బావగారు" అన్నారాయన.

"మీరొకసారి వచ్చి అమ్మాయిని చూచుకోండి బావగారు" అంది ప్రభావతమ్మ.

"ఎందుకమ్మా అవసరంలేని ఆనవాయితీలు. రాధ మాకు తెలియనిదా? అయినా అసలు వాడు చూశాడు కదా. మీ మిత్రురాలికి ఆత్రుతగావుంటే వీలైనప్పుడు వచ్చి చూచుకుంటుంది."

"ఆయన మాటలకేమి. అమ్మాయికి చీర.... అదీ పెట్టొద్దూ. వీలుచూచుకుని వస్తాను" అంది కమలమ్మ.

"ఆమె తనకు తీరినప్పుడు చీర పట్టుకుని వస్తుంది కానీ మీరు అందుకోసం ఆగకుండా మంచిరోజు చూచి నిర్ణయించండి. లగ్నాలు పెట్టేసుకుందాం" అన్నారు.

ప్రభావతమ్మకు సినిమా చూస్తున్నానా అన్న అనుమానం వచ్చింది. ఆడపిల్లల పెళ్ళిళ్లకు సంవత్సరాలు వేచివుండాల్సి వస్తోంది. ఒకొక్క సంబంధం విషయం తేలాలంటే మాసాలకు మాసాల సమయం గడచిపోతోంది. అలాటి పరిస్థితుల్లో నాగేశ్వరరావుగారు క్షణాలమీద సంబంధం ఖాయం చేస్తుంటే విచిత్రంగా, ఆనందంగా వుందామెకు.

* * * * * *

రాధ పెండ్లి శ్రావణమాసంలో అత్యంత వైభవంగా జరిగింది. 'మ్యారేజ్‌హాల్ తీసుకుందామన్న రామస్వామిగారి ప్రతిపాదనను కృష్ణచైతన్య' కొట్టేశాడు.

"మనం యీ యిల్లు కట్టకున్నాక మొదటి శుభకార్యం యీ యింట్లోనే జరగాలి" అన్నాడు. అతని హడావిడిని వర్ణించను మాటలే లేవు. కళ్యాణ మండపం విషయంలో అత్యంత శ్రద్ధ తీసుకున్నాడు. ఎంత ఖర్చయినా ఫర్వాలేదని మల్లెలు కుప్పలుగా తెప్పించి పోయించాడు. గులాబీలకు అంతేలేదు. మండపం కనుల విందుగా వుండటమే కాకుండా విపరీతమైన మల్లెలు, గులాబీలతో అలంకరించటం వలన ఆ సువాసనతో పందిరంతా నిండిపోయింది.

రాధ పెండ్లికి ఆమె స్నేహితులు, కృష్ణ కొలీగ్స్, మిత్రులు, రామస్వామిగారి స్టాఫ్, ఆయన పరిచయస్తులూ, వొకరేమిటి? ఎందరో.... అసంఖ్యాకంగా విచ్చేశారు.

ప్రభావతమ్మ బంధువులు, రామస్వామిగారి బంధువులు దూరాభారాన్ని గణించకనే వచ్చారు. దగ్గరి బంధువులు నాలుగురోజులు ముందుగానే వచ్చారు. రామస్వామిగారి బంధువులకు ప్రభాత తెలియదు. ఇటీవల రామస్వామిగారి అన్న వచ్చివెళ్లారు గానీ యింట్లో వున్న క్రొత్త అమ్మాయి యెవరో తెలుసుకునే ఆసక్తి









అయనకు లేకపోయింది పోతే ప్రభావతమ్మ తరపు బంధుకోటికి కామేశ్వరి మనుమరాలు అంటే లేచిపోయిన రాజ్యలక్ష్మి కూతుర్ని ప్రభావతమ్మ చేర దీసిందన్న విషయం తెలుసు వచ్చిన వారందరిలోనూ రాధపెళ్ళి చూడాలన్న వుద్దేశంకన్నా ప్రభావతమ్మ ప్రభాతను యే విధంగా ట్రీట్ చేస్తోందో పరీక్షించి తరించాలన్న ఆసక్తి మెండు

వారంతా ముందుగా ప్రభాతను చూపులతో నే పరీక్షించారు

"అంతా తల్లి పోలికే."

"దాని పోలికెక్కడ? అన్నీ వాడివే "

"అసలు ఇంతకీ రాజ్యం లేచిపోయింది వాడితో నే నంటావా?"

"వాడి తండ్రి మన కెవరకూ తెలియకుండా వెళ్ళి అప్పుడప్పుడు కొడుకును చూచి వచ్చేవాడట

"మొత్తానికి యీ పిల్ల అదృష్టవంతురాలు చల్లని నీడన చేరింది "

ప్రభాతను గూర్చిన చర్చ ప్రభావతమ్మను జూచి ఆపేవారు కానీ ప్రభాతను మాత్రం లక్ష్యంచేసేవారు కాదు ప్రభాత పని హడావుడిలో పెద్దగా వారి మాటను పట్టించుకోలేదు. ఒక మధ్యాహ్నం భోజనాలు ముగించుకుని విశ్రాంతిగా కూర్చున్న తరుణంలో ప్రభాతను పిలిచారు ఆమె వచ్చాక యింటర్వ్యూ మొదలయ్యింది

మొదటి ప్రశ్న మాత్రం యిబ్బందికరంగా లేదు

"నీ పేరేమిటి? అన్నారు

ప్రభాత చెప్పింది

రెండు, మూడు ప్రశ్నలు సాధారణమైనవి వేశాక కష్టతరమైన యింటర్వ్యూ ప్రారంభమైంది

ఆ వూర్లో మీరే కులం అని చెప్పుకునే వాళ్ళు?

మీ అమ్మ మీ నాన్నను యేమని పిలిచేది?

'ఈమెవరో తెలుసా? మీ అమ్మకు మేనమామ భార్య అంటే నీకు "

"ఇక వరుసలు కలపకు ఆక్షేపించిందామె ప్రభాతతో బంధుత్వాన్ని యేమాత్రం సహించలేనట్లు

ఇలా వారు ఆమెను రకరకాలుగా వేధిస్తూ, చిత్రహింసకు గురిచేస్తుండగా కృష్ణచైతన్య ఆ ప్రక్కగా వచ్చాడు అతనికి వ్యవహారం వెంటనే అర్థమైపోగా ప్రభా నిన్ను నేను ఆ బట్టలు తీసికు రమ్మంటే యిక్కడేం చేస్తున్నావు? పద పద అని తొందర చేశాడు

అప్పటివరకూ శిలలా నిల్చున్న ప్రభాతలో చలనం కలిగి అతన్ననుసరించింది పెనుగాలికి కొట్టుకుంటున్న చెట్టుకొమ్మలా ఆమె మనసు గిలగిల్లాడింది

'వారి మాటలను మన్నించి వారికి లేని గొప్పతనాన్ని ఆపాదించకు" అనాన్నడు

అసలు మా వూర్లో యెవరూ వెక్కిరించలేదు అందరికీ మా అమ్మంటే యిష్టం చెక్కిలి మీదుగా జేరిన కన్నీటి బిందువు కొనగోట తుడుచుకుంది

చెప్పాను కదా వారి మాటల విలువ లేనివని నువ్వు కళ్ళు తుడుచుకో

అతడు చూపుతున్న అనురాగం, అప్యాయతలతో ఆమెకు మరింత దుఃఖం కలిగింది వారి అమానుషత్వంనుండీ రక్షించిన అతని పట్ల కృతజ్ఞతా బావం పొంగి పొర్లింది

నేను కూడా యేడవనా?'

ప్రభాతకు పొరలు పొరలుగా నవ్వొచ్చింది అతడేమీ జోక్ చేయలేదు తనకోసం తాపత్రయ పడే మరో మనసును గుర్తించటంవలన, విచారం వెనుక కలిగిన ఆనందావేశంలో తనను తాను మర్చిపోయి చేసిన భావ ప్రకటన ఆ నవ్వు

ఆమె నవ్వు పసిపాప బోసి నవ్వులవలె నిష్కల్మషమై మనసుకు ఆనందాన్ని కలిగిస్తుంటే ముగ్ధుడై చూశాడు

నువ్వెళ్ళు అటు వెళ్లకు, వేరే పనేదైనా చూచుకో" అన్నాడు

రాధ పెళ్ళి సందర్భంగా ప్రభాతకు చేతినిండా పని క్షణం తీరిక లేదు ప్రతి నిమిషం, ప్రతి పనికి ప్రభావతమ్మో, కృష్ణచైతన్యో ఆమెను కేక వేస్తూనే వుంటారు ప్రభావతమ్మ రాధ, జయశ్రీలతో సమానమైన చీరె కొంది ప్రభాతకు అతి ఖరీదైన చెరెను ప్రభాతకని తెల్సుకున్నవారి మతులుపోయాయి

అయితే ప్రభావతి, నువ్వా పిల్లను కోడలిగా చేసికుంటావా? అని అడిగింది ఆమె పెద్ద వొదిన

ఆమె జవాబివ్వడానికి తడుముకోవడం గమనించి, నువ్వేమీ అనుకోకు ఆ పిల్ల మీ యింట్లో కలసిపోయిన తీరుకు అడిగాను" అందామె మరల'

మనుమరాలు యింటి మనిషిలాగాక పరాయి పిల్లలా యెలా వుంటుందొదినా?

నిజమేననుకోగానీ ప్రభావతీ, వచ్చిన దగ్గర్నుండీ చూస్తున్నాము ఆ అమ్మాయి లేకపోతే నువ్వుకానీ కృష్ణగానీ అంగుళం కూడా కదల్లేరేమో, విసమెత్తైనా పని చేయలేరేమో అనిపించింది" మరొకరు

వయసు తేడా కనుపిస్తున్నా చూడ ముచ్చటగా వున్నారు

నగలు చూడ లేదు కదా మీరు చూపిస్తానుండండి అంటూ " ప్రభాతా!" అని కేక వేయబోయి ఆగిపోయి తనే లేచి వెళ్ళింది

రాధను సర్వాలంకరణలతో నూతన వధువుగా సింగారించారు ఆమెను చూచిన శరత్ వుత్తేజితుడైనాడు అతని కనుల మెరుపులో ఆమె తన భావి జీవితాన్ని కనుగొన్నది

వివాహం జరిగిన రాత్రే నవవధువును తీసికుని వెళ్ళిపోయారు పెళ్ళివారు రాధను అత్తవారికి అప్పగించి పంపాక అందరి హృదయాలూ బరువెక్కాయి

# మౌనవిపంచి

"ఎందుకలా యేడుస్తావు? ఎల్లుండి మనం వెళుతున్నాము. మూడు రోజుల ఎమ్మట వస్తుంది. మన కళ్లెదుటే వుంటుంది కదా!" భార్యను వోదార్చినప్పటికీ ఆయన మాత్రం అల్లారు ముద్దుగా చూచుకున్న తనయను అత్తగారికి అప్పజెప్పాక కలిగే హృదయ వేదనను అనుభవించటంలేదని యెవరనగలరు?

స్వగ్రామంనుండీ వచ్చాక శరత్ తన సన్నిహితులకు చిన్న పార్టీ యిచ్చాడు. ఆ రాత్రే వారిద్దరి హనీమూన్ ప్రయాణం.

హనీమూన్‌కు యెక్కడకు వెళ్తోందీ చెప్పనేలేదు శరత్.

తలావొక రకంగా వూహాగానాలు చేశారు.

"కనీసం మా రాధకైనా తెలుసా?" అంది జయశ్రీ.

"ఏమి రాధా, స్త్రీ స్వాతంత్రం, వ్యక్తిత్వం యేమయ్యాయి. కనీసం నువ్వెక్కడికి వెళుతున్నావో కూడా నీకు తెలియదు" కృష్ణచైతన్య వుడికించాడు.

అతడు కోరుకున్న రియాక్షన్ వచ్చింది రాధలో.

నాకెందుకు తెలియదు" అంది రోషంగా.

"నిజంగా తెలిస్తే యెందుకు చెప్పవులే."

"నాకు తెలుసు కానీ నేను చేప్పను."

కొందరు ఆమె మాటలు నమ్మారు. కొందరు "అంతా వొఠ్ఠిదే. దానికి తెలియదు" అన్నారు.

నాకు తెలుసు శరత్. నువ్వు బుక్ చేసింది బొంబె ఫ్లైట్‌కు" –కృష్ణచైతన్య.

"మేము బొంబేలో రెండు రోజులు మాత్రమే వుంటాము. తరువాత...... ఊహుఁ! చెప్పను."

అన్ని పనులూ అనుకూలంగా జరిగిపోయాయి. కూతురూ, అల్లుడూ హనీమూన్ వెళ్ళారు. రామస్వామిగారికి తృప్తిగా వుంది. నందకిషోర్, జయశ్రీ మరి రెండు రోజులు వుండి వొకరి తరువాత వొకరు శెలవు తీసికున్నారు. జయశ్రీ వెళూత తల్లిని ప్రశ్నించింది.

"అన్నయ్య పెళ్ళి మాటేమిటమ్మా?"

ప్రభావతమ్మకు కళ్ళ నీళ్ళు తిరిగాయి. వచ్చిన బంధువులంతా యిదే ప్రశ్న వేశారు.

ఆమె మౌనాన్నే జవాబుగా మార్చింది.

"నేనేం చెయ్యను. వాడు కొరుకుడు పడకుండా వున్నాడు" అంది బాధను దాచుకోలేక.

"ఎవరి నైనా ప్రేమించాడేమో!"

"అలాగైనా బాగుండేది."

"అమ్మా నిన్నో మాట అడగనా?"

"అడుగు."

"ప్రభాతను పెద్దన్నయ్యకు చేసికోవాలని వుందా నీకు?"

ప్రభావతమ్మ నిరుత్తర అయ్యింది.

"అలా తెల్లబోకమ్మా. అన్నయ్యకు అభ్యంతరం వుండదు."

"నాదేముంది? మీ నాన్న......"

"నాన్న, నువ్వూ, అన్నయ్య గట్టిగా అంటే యేది కాదన్నారమ్మా? బెండకాయలా అన్నయ్య ముదిరిపోతే యేం బాగుంటుంది. అన్నయ్యకు ప్రభాత మీద యిష్టంగావుంది. నువ్వు యిన్నాళ్ళుగా గమనించని విషయమేమీ కాదిది. ఆలస్యంగానైనా అన్నయ్య మనసు వొక స్త్రీ మీద "లగ్నమైనందుకు ఆనందించు."

జయశ్రీ సలహాను ప్రభావతమ్మ తేలిగ్గా కొట్టి వేయలేక పోయింది.

రాధ హనీమూన్ వెళ్ళిన రెండు రోజులకు మద్రాసు నుండి రమేష్ లెటరు వ్రాశాడు. ఆమెను అభినందిస్తూ, ఆశీర్వదిస్తూ వ్రాయడమే కాక పెళ్ళికానుకగా ఆమెకో పార్సెల్ కూడా పంపాడు. అదే రోజు కృష్ణచైతన్య కూడా అతని వద్దనుండి వుత్తరం అందుకున్నాడు.



# ధర్మపథం
# అన్నదానం

ఆకలితో బాధపడుతున్నవారికి అన్నం పెట్టే వారు దైవ సమానులంటారు. దానాలన్నింటిలో అన్నదానమే ముఖ్యమైనది. దేవుణ్ణి పూజించటంకంటే అతిధిని గౌరవించడమే గొప్పది. ఎంత ఉత్తముడని పేరుతెచ్చుకున్నా, ఏ దానధర్మాలు చేసినా అన్నదానం చెయ్యకపోతే ప్రయోజనం ఉండదు.

పూర్వం సుదేవుడనే రాజు ఉండేవాడు. ఆయనకు శ్వేతుడు, సురథుడు అని యిద్దరు కుమారులు! తండ్రి అనంతరం శ్వేతుడు రాజ్యానికి అధిపతి అయి ప్రజలను న్యాయంగా పాలించాడు. శత్రువులను జయించి, గొప్పకీర్తి సంపాదించాడు. చాలాకాలం రాజ్యం చేసినతర్వాత తమ్మునికి రాజ్యం అప్పగించి తాను తపోవనానికి తపస్సు చేయుటకు వెళ్ళిపోయాడు.

శ్వేతుడు ఘోరమైన తపస్సుచేసి, ఆ తపస్సునకు ఫలంగా దేవత్వాన్ని పొందాడు. స్వర్గలోక నివాసి అయినాడు. దేవతల గౌరవం పొందాడు. ఎందరో అప్సరసలు అతనికి వివిధ సేవలు చేస్తూ ఉండేవారు. ఇంద్ర భోగాలను అనుభవిస్తూ ఉన్నా, దేవతలకులేని ఆకలి అతనిని మిక్కిలి బాధిస్తూ ఉండినది. ఆ బాధను అతడు భరించలేకపోయాడు. తనకు ఆకలి ఉండడం అతనికే ఆశ్చర్యం కలిగించినది. అతడు బ్రహ్మ దగ్గరకు పోయి, ఆయన కాళ్లపయిపడి పితామహా! నాకు దేవత్వం లభించినా, దేవతలకు ఉండని ఆకలి నన్నెంతో బాధిస్తున్నది. దీనికి కారణమేమిటి? ఇది ఎలా పోతుంది ? చెప్పవలె" నని ప్రార్థించాడు. బ్రహ్మ "ఓయీ ! నీవు రాజుగా ఉన్నప్పుడు ఎన్ని దానధర్మాలు చేసినా అన్నదానం చెయ్యలేదు. ఎవ్వరికీ పట్టెడు మెతుకులుపెట్టి ఇన్ని నీళ్లు పొయ్యలేదు. అందువల్ల నీకు దేవత్వం లభించినా, ఆకలి నిన్ను విడువలేదు. ఇది పోవాలంటే నీవు ప్రతిదినం దండకారణ్యంలో, ఒక సరస్సు తీరాన పడిఉన్న ఒక శవాన్నికోసి కొన్ని కండలు తిని, సరస్సులోని నీరు తాగాలి. నాటికి ఆకలి ఉండదు. ప్రతిదినం ఇలా చెయ్యి. కండలు కోసినా, ఆ శవం మరునాడు మామూలుగానే చెక్కుచెదరక ఉంటుంది. ఏ మాత్రం చెడిపోదు. అన్నదానం చేయనందున నీకు ఇది తప్పనిసరి అవుతున్నది. కొంతకాలానికి అగస్త్య మహర్షి అక్కడికి రాగలడు. ఆయనను చూచి మాటలాడిన వెంటనే నీ ఆకలి పోతుంది. అని చెప్పాడు. శ్వేతుడు అప్సరసలు తన్ను సేవించగా ప్రతిదినమూ అక్కడికి వెళ్లి శవమాంసం భక్షించి, ఆకలి తీర్చుకునేవాడు. అగస్త్య మహర్షి అక్కడికి వచ్చి అతనితో మాట్లాడిన తర్వాతనే అతని ఆకలి పోయింది. ఆ శవం కూడా మాయమయింది!

దీనివల్ల అన్నదాన ప్రభావం ఎట్టిదో తెలుస్తున్నది.

**- బులుసు వెంకటరమణయ్య**

కృష్ణా!

ఇన్నాళ్ళ నీ మూగనోము, నేను నిన్ను కోరుకున్న విషయ ఫలిత ' తెలియచేస్తోందిరా. ఎందుకురా నాకు 'కాదు' అన్న జవాబివ్వడానికి అంత భయపడ్డావు. నేనేమైనా దేవదాసునైపోతా ననుకున్నావా? లేక రోమియోలా మరణాన్ని ఆహ్వానిస్తాననుకున్నావా?

జీవితం చాలా విలువైనదని నాకు తెలుసు. సాధ్యమైనంత వరకూ శాంతియుతమైన, సుఖప్రదమైన జీవితానికే నేను బాట వేసుకుంటాను ఆ ప్రయత్నంలో నే ఆమెను నా జీవితంలోకి ఆహ్వానించాను.

జీవితంలో కోరుకున్నవన్నీ పొందలేము. అంతమాత్రాన, ఆ ఓటమినే ఆధారం చేసుకుని జీవితాన్ని మలచుకోలేము.

ఇంటిదగ్గరనుండి పోరు అధిక మయ్యింది. త్వరలో నే యింటి కోసారి వెళ్తాను. నా యీ వొంటరి బ్రతుకు తోడును కాంక్షిస్తోందిరా

రాధ పెళ్ళికి రావాలని శతవిధాల ప్రయత్నించాను. నీవు దొరకలేదు. ఏదియేమైనా నువ్వు నాకొక లెటర్ వ్రాస్తే సంతోషిస్తాను.

ఉంటాన్రా కృష్ణా
రమేష్.

(ఇంకా ఉంది.)

# 'క్రోధన'లో మీ నక్షత్రఫలం-రాశిబలం

**మేషరాశి :**— ఈ యుగాది నుండి క్రోధన సంవత్సరం ముఖ్య గ్రహాలు రాశిలో రాహువు, సప్తమాన కేతువు అష్టమంలో శనిగ్రహం, దశమంలో గురుడుస్థితులు. వత్సరమంతా వీరి సంచారం, రాశిఫలానికి బలం చేకూర్చుటలేదు. అట్లని 'వత్సరమంతా వ్యర్థం, నిష్ప్రయోజనం అని అనుకోరాదు. రవి, బుధ, శుక్రులు లాంటి గ్రహాలు మేలుచేయగలవనీ, మధ్యమధ్య ఆదాయం, అధికారమందు పెంపు, ఆనందం, ఆశించినదానికన్న అధిక ప్రయోజనం, కార్యానుకూలం చేకూరగలదనీ, 'ఏప్రిల్, మే, ఆగస్టు, నవంబరు' నెలలు ధనలబ్ధికి అనుకూలమనీ, ఉద్యోగమందు కించిత్తు మేలు చేకూరుట నిశ్చయమనీ గ్రహించాలి. స్త్రీలకు ఒక్క ఆరోగ్య విషయము తప్ప తక్కిన రంగాలలో, సర్వానుకూలత, ముఖ్యంగా, కళారంగాన నూతనావకాశాలు లభ్యం కాగలవు.

సంవత్సరఫలం సంగరం, ఆదాయం 2, వ్యయం 8 పాళ్ళు.

**వృషభరాశి :**- 'క్రోధన' అందంగా ఆనందంగా, సుందరంగా, శోభాయమానంగా శుభకార్యానుకూల ప్రదాయకంగా, నూత్నోత్సాహంతో, నూతన మిత్రసంపర్కంతో, నూతన విషయాల అవగాహనంతో హాయిగాగడిచిపోతుంది. కొందరకు హఠాత్తుగా ఊడిపోయిన ఉద్యోగాలు లభించటం, ఉద్యోగవృత్తులందు పెంపు కనిపించటం, ప్రత్యర్థులు లొంగి యుండటం, నూతన వ్యాపార ప్రారంభానికి నాంది పల్కటం, అధికారమందు వృద్ధి చేకూరటం, చేసే వ్యాపారంలో 'యింతకాలానికి ఒక మెట్టు ఎక్కా'మని ఆనంద పరవశులుకావటం సంభవం. ఇంతకూ భాగ్యమందున్న గురుడు, సప్తమరాశి యందు శనిగ్రహాలు కారకులు, మిగతా గ్రహానుకూల్యతకూడ చేకూరగలదు. ధనాదాయానికి ఏ మాత్రం లోపంరాదు. స్త్రీలకు పదిమందిలో పేరుపెంపులు, నూతనంగా ఉద్యోగ ప్రవేశం, నగలు, వస్త్రాలు కొనుగోలు చేయుటకు, ఆనందంగా వత్సరం గడుస్తుందనే నిబ్బరం గల్గుతుంది.

ఆదాయం 11, వ్యయం 14పాళ్ళు.

**మిథునరాశి :** రాశికి గ్రహానుకూల్యత చెప్పదగినంత బలాఢ్యం, చక్కని ధనాదాయం ఆశింపవచ్చు. కొంతకాలంగా వెనుకముందులతో త్రొక్కిసలాడే వ్యవహారాలు ఒక రేవునకురాగలవు. మంచి హోదాలలో ఉన్నవారి పరిచయం భాగ్యమబ్బుతుంది. అనుకొనని రీతిని ఆదాయం అందుపుచ్చుకొన్న లాగున అమరగలదు. వ్యాపార రీత్యా మీ అభీష్టం నెరవేరనున్నది. ధనాదాయమందు చెప్పదగిన పెంపు కనిపించటంతో ఆనందమతిశయిస్తుంది. ఉద్యోగమందు ఆశించిన 'ప్రమోషన్' వత్సరమధ్య భాగాన లభ్యం కావటంలో ఆక్షేపణ లేదు. శుభకార్యానుకూలత, ఆరోగ్యాభివృద్ధి గలుగును. స్త్రీలకు: కుటుంబానందం, నూతనోద్యోగప్రాప్తి, నూతనాంశాలు గ్రహించటం. నూత్న మిత్ర సంపర్కానికి అవకాశం, వ్యవహార విజయయానికి ఆస్కారం, శనిషష్ఠమస్థితియే కారణం, అకారణ వైరముంటుందేమో జాగ్రత్త!

ఆదాయం 14, వ్యయం 11పాళ్ళు.

> ## ఉగాది కాలం
>
> ఉగాది అంటే యుగాది  
> సృష్టి ప్రారంభకాలంలో  
> మొదటిరోజు అది  
> లెక్కలు వేస్తే ఆ రోజు  
> ఆదివారం అయిందట  
> దానిని స్మరించుకుంటూ  
> మనం ఉగాది పండుగ చేసుకుంటున్నాం.
>
> అది వసంత ఋతువుతో ప్రారంభం  
> చెట్లు చిగురుస్తాయి  
> పూలు పూస్తాయి  
> కోకిలలు కూస్తాయి  
> జీవులు నూతన  
> తేజస్సు పొందుతారు  
> కవులు అన్నీ వర్ణిస్తారు.
>
> దానిని క్రొత్తవత్సరం అంటారు  
> అంతా క్రొత్తే—కొత్తబట్టలు  
> కడతారు—షడ్రసోపేతంగా  
> విందులు చేస్తారు  
> అందులో చేదు ఒకరుచి  
> అదే క్రిమిసంహారకం అంటారు
>
> జీవితం అంతా ఉగాదిగా  
> ఉండాలనీ సర్వుల ఆకాంక్ష  
> గడిచిన సంవత్సరానికి  
> రాబోయే సంవత్సరానికి  
> అది సంధికాలం  
> సంధికాలం ఒక మహాపర్వం  
> వసంత నవరాత్రులు ప్రారంభం  
> శ్రీరామ నవమితో సమాప్తం  
> అది యోగుల ఉపాసనాకాలం  
> ఉగాది పర్వం వంటి పర్వం  
> ఎక్కడుంది సృష్టిలో.
>
> **- ఎం.ఎస్.ఎమ్.**

**కర్కాటకరాశి :** 'క్రోధన' యందు విలక్షణమైన సన్నివేశాలు ఏర్పడటం, వినూత్న రీతులందు ధనాదాయం చేకూరటం, వివిధ రీతులలో సదవకాశాలు లభ్యంకావటం, విద్యావిషయమందు పెంపు కనిపించటం, విదేశయానానికి కొందరకు అవకాశమేర్పడటం గమనించగలుగుతారు, గనులందు, కార్ఖానాలందు, కాయకష్టం చేసేవారికి, వస్త్రవ్యాపారస్థులకు, భారీఎత్తున వ్యాపారం కొనగల్గటం గమనింపగలుగుతారు. బంధుమిత్రసంపద అతిశయించుటకవకాశం ఏర్పడుతుంది. ఏమయినా తులయందున్న కేతువు, దశమంలోరాహువు, మకరమందున్న నీచ గురువులవలన మధ్యమధ్య కార్యవిలంబన, విఘ్నాలు కలుగుట కవకాశం, అధిక వ్యయం చెప్పదగిన అంశాలు. స్త్రీలకు కుటుంబ కలతలుగాని, ఉద్యోగమందున్న యిబ్బందులుగాని, వ్యాపారరీత్యాగల ఆటంకాలు సమసిపోగలవు.

ఆదాయం 8, వ్యయం 11పాళ్ళు.

**సింహం :** నూతన సంవత్సరం సర్వ విధాలా శోభాదాయకంగా, ఆనందోత్సాహాలున్నా; ఆశించిన పదవి లభ్యం కాకపోవటంతో, రాజకీయంగా నిరుత్సాహం కల్గడంతో, విద్యార్జన యందు ఆటంకాలు రావటంతో, చేసే వ్యాపారమందు నిరుత్సాహత ఏర్పడడంతో 'పోయిన సంవత్సరమే మేలుగదా!' అని, అనిపిస్తుంది. వాహన ప్రమాదమో, రోడ్డుప్రమాదమో కొందరకు చెప్పవీలున్నది. చతుర్థస్థితుడు 'శని' 'అర్ధాష్టమే' శని క్రింద పరిగణన, పైగా ఆదిశత్రుక్షేత్రం ఆరోగ్యరీత్యా చాలా జాగ్రత్తపడవలె. అధికారవర్గంతో జాగ్రత్తగా మెలగవలె. ఆదాయం అధికంగా అందుకోవాలని ఆశా భంగానికి గురికారాదు. కార్యదీక్ష విడనాడరాదు. స్త్రీలకు: ఉద్యోగరీత్యా జాగరూకతకావలె. చిక్కిన కళాసాహితీ రంగావకాశాలు సద్వినియోగం చేసుకోవలె. ఆరోగ్యరీత్యా జాగ్రత్తపడవలె.

ఆదాయం 11, వ్యయం 5పాళ్ళు.

**కన్యారాశి :** అనేక విధాల 'క్రోధన' ఉపయోగకరమనీ, ఆశీస్సులు కురిపించనున్నదని ప్రారంభంలోనే గ్రహిస్తారు. ధనాదాయం, వ్యాపారానుకూలం, కళలందు ప్రవేశం గల వారికి సకల విధాలా సౌకర్యాలు ఏర్పడటం, తద్వారా ధనాదాయ ముంటుంది. స్థిరాస్తి పెంపు చేయుటకు నూతన వ్యాపారంభానికి ఉద్యోగస్తులకు, ప్రమోషన్ సంవత్సరాదిలోనేసమకూడుతుంది స్త్రీలకు కుటుంబానందానికి. శుభ కార్యాలు జరుగుటకు రచనా విధానాన పెంపు, చక్కటి ఆదాయం, నిర్మాతలకు చలనచిత్రరంగానుభవంగల మహిళామణులకు సదవకాశాలు లభ్యంకాగలవు. సర్వే సర్వత్రా, స్త్రీలకూ 7 1/2 సం. శనిబాధ తొలగటం, రాశికి పంచమస్థితి గురునకు కల్గటం, శ్రేయోదాయకం క్రోధనకోటి విధాల మేలు చేయగలదని ఈ రాశి జాతకులు గ్రహిస్తారు. ఆనందిస్తారు.

ఆదాయం 14, వ్యయం 11 పాళ్ళు.

**తులారాశి :** ఎన్ని విధాలా ఆలోచించినా, ఒకటి రెండు ముఖ్య గ్రహాలు అనుకూలంగా ఉన్నా, ఏవో ఆందోళనకరమైన పరిస్థితులు, మానశిక వ్యధ, పదిమందిలో ప్రతిష్ట భంగం కావటం, రాజకీయంగా ఆశాభంగం, వ్యాపారంలో స్వల్పమైన అడ్డంకులేర్పడటం, సాహితీమార్గాన మాత్రం కొంత అనుకూలత, నిర్మాతలు, భారీ వ్యాపారస్థులు పత్రికా వ్యాపారస్థులు ఎంతో జాగరూకతతో ప్రవర్తించాలి. చేతులు కాలిన వెనుక ఆకులు పట్టుకోర్దాదు· 'పగటి కలలు కనరాదు', కాలం అనుకూలం గాదని గ్రహించాలి. శారీరకంగా బాగా బాధపడటం, కొందరు వత్సరారంభంలోనే గ్రహింపనున్నారు· ఔషధసేవ తప్పదు, కొందరకు 'ఆపరేషన్' ప్రశక్తి కూడ ఏర్పడగలదు. స్త్రీలకు విదేశయాసం కొందరకు, కళారంగప్రతిష్ట కొందరకు, వస్తువాహనసంపత్తి కొందరకు నూత్నవత్సర ప్రసాదమని గ్రహించాలి. నిబ్బరంగా కార్యసాధన గావించాలి.

ఆదాయం 11, వ్యయం 14 పాళ్ళు.

## ఉగాది లక్ష్మి

1\. తే॥ గీ॥ శ్రీకరంబుగ నూత్నమై వెలుగు చున్న
క్రోధనా నామ సంవత్సరోదయమున
అందుకొనుము మా స్వాగతం బాత్మయలర
అరుగు దెంచుము వేగ ఉగాది లక్ష్మి !

2\. చం॥ అరకలు కట్టి కర్షక జనాళి గదా ! శకునంబుఁజూచుచున్
అరమర లేఖ నేడు పొలమందున తప్పక దున్ను చుంద్రు, యే
కొరతయు లేక వారి నిజ కోర్కెలఁ దీర్చి, శుభంబు గూర్చు మో
పరమ ఉగాది లక్ష్మి ! తగు భాగ్యము లిచ్చుచు సూక్తిఁదెల్పుచున్!

3\. చం॥ ధనమును, ధర్మమున్, హితవు, ధాన్యపురాసులు, కార్యసిద్ధియున్
అనయము దీరతిన్, యశము, నభ్యుదయంబును, శాంతుదాంతులన్,
ఒనరగఁజేసి మాకొక మహోన్నత భావపుబాట జూపుమో
జనని యుగాది లక్ష్మి ! జయ సౌఖ్యము లిచ్చుచు రక్షఁజేయుచున్

-డాక్టర్ బెజవాడ కోటివీరాచారి

**వృశ్చికం :** రాశియందు శని స్థితి, మూడింట గురుస్థితి, ఆరింట రాహు గ్రహస్థితి బాగా శ్రమకరమైన వత్సరంగా కనిపిస్తుంది. గతకాలము మేలువచ్చు కాలము కంటెన్, అని కూడా గ్రహింపగలుగుతారు. రాజకీయంగా సాంఘికంగా కొందరకు నిరుత్సాహత ఏర్పడుతుంది. మతిమరపు అధికం కావచ్చు, ఇంట దొంగతనం జరుగవచ్చు. నూతన విషయాలు తలనొప్పి పుట్టించవచ్చు. శరీరరుగ్మత కనిపించవచ్చు. స్త్రీలకు : యత్న కార్యవిలంబన, కార్యాచరణమందు తామసం, అందినవనుకొన్న ఫలాలు అపరూపం కావటం, మిత్ర విరోధం యిలాంటి అనానుకూలతలకు ఆకరం క్రోధన వత్సరం..

ఆదాయం 2, వ్యయం 8 పాళ్ళు.

**ధనురాశి :** కొంతలో కొంత మేలున్నదని తెలిసికొంటారు. గ్రామ జీవితమందు ఆసక్తి జనించటం, పదవీబాధ్యతలు అధికం కావటం గ్రహిస్తారు, కాని 7 1/2 సం. శని బాధ ప్రారంభమయినది, ద్వితీయ గురుస్థితి కూడా పెద్దగా ఉపకరించునదిగాదు. తగాదా తంటాలు, రాబడికన్న వ్యయం హెచ్చు కావటం, చిలిపి జగడాలతో సతమతం కావటం, వ్యవహారం ఎదురు తిరగటం, సాహితీరంగాన వచ్చిన అవకాశాలు కూడ మాయం కావటం గమనింపగలుగుదురు. వాహన ప్రమాద సూచనమున్నది. స్త్రీలకు: అవరోధములు తొలగి, అడ్డంకులు ఒకరీతి దాటుకొని, పట్టుదలతో కార్య సాధనకు, ధనార్జనకు దిగగలుగుతారు. రచయితలకు ఉత్సాహ జనక వత్సరం.

ఆదాయం 5, వ్యయం 14 పాళ్ళు.

**మకరం :** మకరరాశి జాతకులు సత్ఫలములను చూరగొననున్నారు. సకలవిధాల శనిగ్రహానుకూల్యతగలవత్సరం. సర్వేగ్రహా ఏకాదశస్థాన ఫలం వరదాభవంతు' అమన్యాయము పట్టినరాశి. నల్లవస్తు వ్యాపారులకు. గనులు, కార్ఖానాలు గల వారికి చలనచిత్ర రంగపరిశ్రమ యందు నిష్ణాతులైనవారికి విజయమున్నది· పట్టుబట్టి ఈ రాశి

# కానుక

1. ప్రాణ సమానమ్మైన యను
రాగము, ప్రేమము, మోహమున్, హృదో
ద్యాన వనమ్ములో మొలక
లై చివురించి యదృష్ట వృష్టిస
న్నానము బొంది, స్వర్గ కుసు
మమ్ములవోలె సదా వికాస రూ
పాన నిసర్గ సౌరభ మ
పారముగా వెదజల్లు నంచు నీ
మానస రాజహంస కభి
మానముతో విశదీకరింపగా
కానుకలిత్తునా ? ప్రణయ
గాథల నెల్ల లిఖించి పంపనా ?
గాన సతీ సహాయమున
కామితముల్ వెలిబుత్తునా ? పర
ధ్యానముగా నటించి హృద
య స్థితి సర్వము నీకు దెల్పనా ?

2. గురుతర యోచనాంబుధి న
కుంఠిత రీతి మునింగి, వీచికా
తరణ తమో నివారణ వి
ధానము సూక్ష్మముగా గ్రహించి, నే
నరుదగు బాటలో పరిచ
యమ్మొనరించి, తదానువర్తినై
యరుగగ నిశ్చయించి, రయ
మారగ నా పథ మాశ్రయించితిన్.

3. చీరలు, భూషణమ్ముల, ప
సిండినగల్, వెలలేవి వస్తు సం
భారములన్ విశేషముగ
పత్ని కొసంగుట మానవుల్ సదా
చారముగా గ్రహించినను
శాశ్వతమే యవి? కాలవాహినీ
నీరములన్ దగుల్కొని, ము
నింగి స్వరూపము బాయకుండునే ?

4. స్థిరమా పెండిలి నాటి వీక్షణ గిథ
స్థి పూర్శ మేల్కాంచి, స
త్వరమత్యద్భుత లీల నల్దెసలు వా
ప్తంబై, చిరస్థాయియై,
తిరమై, శాశ్వతమై, యపారమగు "ప
త్నీప్రేమ" వాక్రుచ్చగా
నరయన్ బుద్బుద తుల్యమౌ నగల శ
క్యంబే యధార్థమ్ముగన్ ?

5. ఇది శరచ్చంద్ర చంద్రికా హేమ కిరణ
మధు కణా స్వాదమున నూత్న పథముద్రొక్కి,
కేవ లాహ్వాన రాగ సంభావనముల
దేల్చి క్రీడింపజేయు నుత్కృష్ట ప్రేమ.

6. ఇది మనోజ్ఞ లతావళీ హృదయ జనిత
సౌమ్యకోమల కుసుమ ప్రసార నిగిడ
సౌరభాఘ్రాణమున చిరస్థాయి యగుచు
అంతులేకుండ వ్యాపించునట్టి ప్రేమ.

7. ఇది వసంత యుషఃకాల హిత సుగంధ
బాల పవన ప్రశస్త విశాల మధుర
వీచికా డోలికల నూగి వివిధ గతుల
నలరి వర్ధిల్లు నిర్మలమ్మైన ప్రేమ

8. ఇది పరబ్రహ్మ వసుధ సృష్టించి నపుడు
భిన్న మొనరించిన పరాత్పరోన్న తాంశ
భాగముల రెండింటిని చేర్చి భక్తితోడ
నేకమొనరించు శక్తి వహించు ప్రేమ.

9. తాపత్రయా భీల దావాగ్ను లార్పగా
విమల శీతల సుధా వృష్టియయ్యె,
సంసార భీకర సాగరంబు తరింప
గా విశాలంబైన నావయయ్యె !
ఇహలోకమున కృతకృత్యులై తనరగా
బహు సాధనాది ప్రదాత
అరి శత్రువులబట్టి పరిమార్చియార్పగా
సామర్థ్యమిడు మహాశక్తి యయ్యె,
శుష్కల్మషంబయ్యె నిష్కళంక
మయ్యె, నిత్యాభివృద్ధి యొనట్టి ప్రేమ
తెలుపగా నట్టి గుణములు కలిగినట్టి
శాశ్వతంబైన కానుకలొసంగ వలదె ?

10. జన సామాన్యముగా జలించుట విశే
ష ప్రజ్ఞ కాదంచు, మా
తన మార్గానుగమం బపారహృద యో
త్సాహ పహమ్మంచు, నా
యనివార్యంబగు ప్రేమ కల్పిత మనో
వ్యాపార మందందు దా
ల్చిన పుష్ప ప్రకర స్వరూపముం సం
క్షేపించి చేకూర్చితిన్.

11. దినదిన మాత్మలో బొదలు
తీయని కాంక్షలు, వాంఛ లాశలున్
దమవడి పుష్పరూపములు
దాల్చిన తోడనె, భక్తి మీర చే
కొని మృదు ప్రేమ సూత్రమున
గ్రుచ్చితి సుందర కంఠమాలగా,
వనితరో! నీకొసంగితి, శు
భంబగు కానుక పరిగ్రహింపుమా !

12. వెలలేని తులలేని యలతి లభ్యముగాని
సురపారిజాత ప్రసూనములును,
రమణీయ గణనీయ కమనీయ స్వర్ణ రూ
పసులైన కేతకీ కుసుమములును,
అరుణోదయ చ్ఛాయ నలరి సౌరభమొల్కు
మృదుమనోజ్ఞ గులాబి మదవిరులును
మలయ మారుత వీచికల వాసనలు బంపి
ముదము గూర్చెడు మల్లె పుష్పములును,
ఎంత సౌరభయుతమై, సహింపరాని
ప్రేంఖిత విషాద తిమిర పరీత హృదయ
తాప పరిహార శక్తియుక్తంబులైన,
కాలగతి తీవ్ర ధాటికి తాళవేవు.

13. నా లలిత ప్రసవమ్ములు
సొలక యిసుమంత చెడక, శుష్కింపకయే,
రాలక వాడక చెదరక
తూలక సౌరభయశమ్ములో రాజిల్లున్

14. సురపూజా క్రియ కనువగు
విరులును, సురలోకమందు విరిసెడు విరులున్
వరలు విధమ్మున దనరుచు
విరతము శోభిల్లు కుసుమ నికరము సుమ్మీ !

- వసంతరావు వేంకటరావు

---

జాతకాలలో కొందరు విదేశ ప్రయాణానుకూలత సాధింపనున్నారు. సాహితీ మార్గాన కొందరకు ధనలబ్ధి, రాజకీయంగా ఉత్తమ ఫలసాధనం క్రోధన వత్సరం. స్త్రీలకు : శుభ సంబంధంగా యింతకు ముందేర్పడిన చికాకులుతొలగుతాయి, దైవకార్యతత్పరత, నూత్నవస్తు సేకరణకు అనుకూలం, కార్యానుకూలం.

ఆదాయం 8, వ్యయం కూడా 8 పాళ్ళే.

**కుంభరాశి :** వ్యయస్థానమందుబలహీనుడై గురుడు, దశమ స్థానమున శని, భాగ్యాన కేతువులు ఎలాంటి మేలు చేయబోరు, కాలమంతా గడ్డుగా, ప్రతిదానికి అడ్డంకిగా, చుట్టు ప్రక్కల గొడవలతో ప్రశాంతత కోలుపోతారు. చేసినపనినే మరలా చేయవలసివస్తుంది. అప్పులవారి బెడద కొంత ప్రశాంతతకు భంగకారి, కాగలదు. ప్రయాణాలందు ప్రమాదాలు చెప్ప వీలున్నది, కాన జాగ్రత్త పడుట ఎంతైనా అవసరం. అన్ని రంగాలలో సదవకాశాలు కనిపించి ఎండమావుల వలె అదృశ్యమవుతాయి. అలాంటప్పుడు వత్సరం ఎలా బాగున్నట్లు? అయినా తక్కిన గ్రహాలు వలన, అడపా దడపా అంతో యింతో మేలు చేకూరుతుంది. స్త్రీలకు: ఉద్యోగంలో అనవసరంగా యిబ్బందులు రాకుండా చూచుకోవాలి. వస్తు సేకరణయందు అప్రమత్తతతో వ్యవహరించాలి, ప్రయాణమందు అధిక జాగ్రత్త అవసరం.

ఆదాయం 8, వ్యయం 8 పాళ్ళు.

**మీనరాశి :** ఈ రాశి జాతకులకు గురుగ్రహాశీర్వచనమున్నది. భాగ్యంలో 'శని' ద్వితీయ రాహువు. అష్టమకేతు గ్రహస్థితి. ఇంట శుభ కార్యం జరుగుటకు, వ్యాపారంగా బాహాటంగా సాగుటకు, గృహంకాని. వాహనం గాని, తోటలు దొడ్లు కొనుగోలు చేయుటకుగాని, రాజకీయ సాంఘీక వ్యవహారాలందు పేరుపొందుటకు గాని అనుకూలం· శుభమూలంగా ధనం విశేషంగా వ్యయం కానున్నది· రాబడియు హెచ్చే, నటగాయక నాట్య సంప్రదాయజ్ఞులకు సత్ఫలదాయక వత్సరం. 'ఏప్రెల్, మే, నవంబరు' నెలలు చాల విధాల యోగాఢ్యములు. స్త్రీలకు : సత్సంగం నూతనోద్యోకప్రాప్తికి, ఉద్యోగమందు పెంపునకు, 'ప్రమోషన్' లభ్యం కావటానికి రాజకీయంగా ఒక మెట్టు పైకెక్కుటకు, స్థిరాస్తి పెంపునకు అనుకూలంగా క్రోధననామ సంవత్సరం జరిగిపోతుంది.

ఆదాయం 5, వ్యయం 14 పాళ్ళు.
గ్రహించి వత్సరం గడపాలి.

—శుభం భూయాత్—

విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

## దొంగ స్వామి దివ్య బోధ!

తమిళనాడు వో నూరుకు చెందిన మత్త్మే అనే గ్రామానికి కొన్నేళ్ళ క్రితం ప్రభారాజన్ అనే ఒకతను వచ్చి స్థిరపడి, ఆనక సన్యాసిగా మారి, స్వామీజీగా రూపాంతరం చెందాడట. ఆనక అతని మాటలకు ఆకర్షితులైన జనం అతని ఆశ్రమానికి వెళ్ళ నారంభించారట. అక్కడ ఆ స్వామి అందమైన అమ్మాయిలను, వయస్సులో వున్న అందమైన వివాహితలను విడిగా పిలిచి, తీర్థం యిచ్చే వాడట. ఆ తీర్థంలో గంజాయి పాలు అధికంగా వుండడం వల్ల వారు మైకంలో పడే సరికి ఆ స్వామి తన కామ దాహం తీర్చుకుని వారు తెప్పరిల్లాక ఈ విషయం చెపితే నీ పరువే పోతుంది. స్వామి వారితో కామ కార్యం కేవలం దైవ కార్యం లాటిది అని అరవంలో బోధించే వాడట. బెంగుళూరు నుంచి కొంచ రాడవాళ్ళు వచ్చి యీ స్వామి వుచ్చులో పడబోయి, తప్పించు కోడమే గాక, ఆతన్ని పోలీసులకు పట్టిచ్చారట– బిళ్ళకెలసా!

## నల్లమందుకి అలవాటు పడ్డ కోతులు!

గణపూరు జిల్లాలో నల్లమందు తయారు చేసే వో కంపెనీ ఫ్యాక్టరీ నుంచి బయటకు వచ్చే వ్యర్థ పదార్థాలను కోతులు మహా యిష్టంగా తింటూ ఎగిరి ఆనందంతో గంతులు వేస్తున్నాయట ఈ వ్యర్థ పదార్థం వదిలే సమయానికి కోతులు గుంపులుగా వచ్చి నిరీక్షిస్తాయట ఆ పదార్థంలో కొంత మోతాదులో నల్లమందు వున్నదట. ఈ నిషాకోసం కోతులు పడిగాపులు పడుతున్నాయట.

## జైల్లో మానభంగం!

తిరువణ్ణామలైకు చెందిన 16 ఏళ్ళ పుష్పరాణి అనే అమ్మాయిని వో సారాయి కేసులో అరెస్టు చేసి, వేలూరు జైలుకు పంపారట అక్కడ జైలు వార్డను 35 ఏళ్ళ శాంతకుమారు ఆమెను ఆ రాత్రి చెరచి, తన కామ దాహం తీర్చు కున్నాడట– ఆడదానిని వంటరిగా చూస్తే మగ శవమైనా తక్కున లేచి తన కామ వాంఛ తీర్చుకు, ఆనక తీరుబడిగా తిరిగి పడి చస్తుందని కాబోలు.

## కారు పందాలలో ఘన విజయం!

బెంగుళూరులో జరిగిన అంతర్జాతీయ కారు పందాలలో జహంగీరు నికల్సన్ అనే 70 ఏళ్ళ వుత్సాహ వంతుడు పాల్గొని విజయం పొందాడట. ఈయన తన ఫియట్ కారును గంటకు 175 కిలో మీటర్ల వేగంతో నడిపి విదేశ కారులను అతి సునాయాసంగా వోడించారట.

## ఇంగ్లీషు భాష విశిష్టత!

ప్రపంచంలోని 460 కోట్ల జనాభాలో కనీసం 210 కోట్ల మందయినా ఇంగ్లీషు భాషను అర్థం చేసుకో గలుగు తున్నారని, ప్రపంచ భాషల్లో ఇంగ్లీషు బహుళ వ్యాప్తిలో వున్న భాష అనీ, యీ భాష అతి సుందర మైనదనీ 'ఇంగ్లీష్ టు డే' పత్రిక సంపాదకుడు టాయే మెకర్తర్ తన సంపాదకీయంలో వ్రాశారట.

## సముద్రగర్భంలో నల్లధనం– విదేశీ వస్తువులు!

బొంబాయిలో నిఘా విభాగం అధికారులు సముద్రం మీద కన్ను వేసి, నాలుగు రోజులు సముద్రం అడుగు గాలించి రెండు గోనె సంచులు దొరికించు కున్నారట. ఓ గోనె సంచిలో 1565 బంగారు బిస్కట్లు, 12 కడ్డీలు దొరికాయట. మరో సంచిలో జపాను చేతి గడియారాలు, వగైరాలు దొరికాయట. గత పదేళ్ళ కాలంలో యింత పెద్ద మొత్తంలో నల్ల ధనం– విదేశీ వస్తువులు పట్టుబడడం యిదే మొదటి సారట– సముద్రంలో దాచడం యిది మొదటి కేసుట– అలనాడు హిరణ్యాక్షుడే సముద్రపు గొప్పదనం కనిపెట్టాడు.

## కల్తీ నేరానికి శిక్ష!

ఆదోనిలో కల్తీ ఐస్ క్రీము తయారు చేసి ప్రజలకు అమ్మిన నేరానికి షరీఫ్ అనే వో ఐస్‌క్రీం ఫ్యాక్టరీ యజమానికి ఆదోని కోర్టు ఒక ఏడు కఠిన కారాగార శిక్ష, వెయ్యి రూపాయలు జరిమానా విధించిందట.

## రౌడీల కామ దాహానికి బలైన మరో వనిత!

కళ్ళకురిచ్చికి చెందిన 21 ఏళ్ళ దవులత్ అనే ఆమె తన భర్త వుద్యోగాన్వేషణలో ఆంధ్రదేశం వెళ్ళే సరికి తాను వంటరిగా ఆ వూళ్ళో వుండడం మంచిది కాదని తిరుపత్తూరులో వున్న తన అక్క గారింటికి వెళ్ళిందట వో రాత్రి రెండో ఆట సినిమా చూసి యింటికి వస్తుండగా దారిలో కొంత మంది రౌడీ లామెను గలాటా చేయబోయారట. వారు అంతతో ఆగక ఆ రాత్రి ఆ యింటి తలుపులు పగలేసి, అక్కయ్య పక్కలో పడుకుని వున్న దవులత్‌ను ఎత్తుకు పోతుండగా ఆమె గోల గోలగా అరిచిందట. ఆ అరుపుకు ఆమె అక్కా, బావగారూ లేచి వారిమీద కలబడితే వారా యిద్దర్నీ చితుక బాది, ఆమెను వో స్కూలుకు తీసుకు పోయి, తమ కామ దాహాన్ని తీర్చుకుని, స్పృహ తప్పినామెను అక్కడే వదిలి, చక్కాపోయారట. □











## వి. ఎ. — వెంకటగిరి

నాకు 48 సంవత్సరములు. 2 సంవత్సరముల క్రిందట నాకు గుండెనెప్పి వస్తే స్పెషలిస్టుకు చూపించినాము. 40 రోజులు ట్రీట్మెంటు చేసి పంపినారు. వెసాప్రిన్, వెసార్బిల్ మాత్రలు వాడమని చెప్పినారు. కొంతకాలము నయముగా వుండినది. యిటీవల కొంచము యింటిపనులు చేసినప్పుడు, మనశ్శాంతి లేనప్పుడు గుండెలో కొంచెము నొప్పి వచ్చుచున్నది.

★ దీనిని యాంజైనా పెక్టోరిస్ అని అంటారు. దీనికి సరి అయిన మందులు మీరు వాడుతూ వున్నవే! ఆరునెలలకొకసారి ఇ. సి. జి. తీయించి నిపుణులైన కార్డియాలజిస్టులకి చూపించండి.

## కె. యమ్. - వుయ్యూరు

నాకు వెనుక పిరుదులు ఎత్తుగా వుంటాయి. అవి తగ్గటానికి ఏమన్నా సలహా ఇవ్వగలరు.

★ డయటింగ్ మినహా ప్రత్యేకమైన మార్గం ఏదీ లేదు. మామూలు శరీర వ్యాయామం చేస్తే చాలు.

## యం. ఆర్. కె.- టెక్కలి

తక్కువ వయసుగల యువకుడు ఎక్కువ వయసుగల స్త్రీతో రతిక్రియ జరపటం వలన ఆ యువకునికి నరాల బలహీనత వస్తుందా? అలాగే తక్కువ వయసుగల స్త్రీతో ఎక్కువ వయస్సుగల యువకుడు రతిలో పాల్గొంటే నరాలు బలహీనమైపోతాయా ?

★ వయస్సుకీ రతి క్రియ జరపటానికీ సంబంధం లేదు. అలా జరపటం వల్ల నరాల బలహీనతరాదు. మానసిక బలహీనత రావటం తథ్యం— అదే ఇలా జరగటానికి కారణం కూడా !

## పి. ఆర్. - మంగళగిరి

చూయింగమ్ నమలటం వలన ఏమైనా నష్టాలు, ఉపయోగాలు వున్నాయా ? లాలాజలం అధికంగా ఉత్పత్తి అవటం వలన జీర్ణక్రియ అధికంగా జరగటంకాని, లేక మరే యితర పరిణామాలు కానీ సంభవిస్తాయా ?

★ చూయింగ్ గమ్ నమలటం వల్ల లాభాలేవీలేవు. అది పొరపాటున గొంతులో అడ్డం పడితే ప్రాణ నష్టమే! లాలాజలం అధికంగా ఉత్పత్తి అవటం మూలంగా జీర్ణక్రియకి మేలేగాని హాని జరుగదు.

## వి. హెచ్. కె. — కాశిబుగ్గ

సుఖరోగాలు వచ్చినపుడు నడుము నొప్పివచ్చే అవకాశముందా ? వస్తే ఏ పరిస్థితులలో వస్తుంది ? దాని నివారణోపాయ మేమిటి ?

★ సుఖరోగాలు వచ్చిన వారికి ఆ రోగానన్నుసరించి లక్షణాలు కనబడతాయి. మనదేశంలో సామాన్యంగా అయిదు రకాల సుఖరోగాలు ఉన్నాయి. దేనివల్ల నయినా ఈ పరిస్థితిఏర్పడే అవకాశం ఉంటుంది. ఒక సుఖరోగాల వల్ల మాత్రమేగాకుండా చాలా కారణాల వల్ల నడుము నెప్పి రాగలదు. మీరు ఎస్.టి.డి.(సెక్సువరీ ట్రాన్స్ మిటెడ్ డిసీజ్) స్పెషలిస్టులను సంప్రదించి మీ అనుమానం నివృత్తి చేసుకోవటం మంచిది. వారే నివారణోపాయాన్ని కూడా చెపుతారు.

## కె. ఎల్. — గుంటూరు

నాకు ఎడమకంటిలో మెల్లవున్నది. ఆపరేషన్ చేయించుకోవాలని వుంది. నావయస్సు 28 సంవత్సరములు ఎంత వయసులో చేయించుకొనవచ్చును! ఇది జరిగితే కన్ను సరిగా వస్తుందా !

★ కండరాల బలహీనత వల్ల ఏర్పడిన మెల్లకన్నుకు, నరాల ప్రేరేపణవల్ల ఏర్పడిన మెల్లకన్నుకి శస్త్రచికిత్స వల్లలాభం ఉంటుంది. దీనికీ పెద్దగా వయస్సుతో ప్రమేయంలేదు. మీరు నిపుణులైన నేత్ర వైద్యులను కలుసుకొని సంప్రదించండి. ఆపరేషన్ సక్రమంగా జరిగితే మామూలు కన్నులాగానే ఉంటుంది.

## పి. యస్. — ఖాజీపేట

నా వయస్సు 18 సంవత్సరములు. నేను 13వ యేట పుష్పవతి నయ్యాను. దాదాపు అప్పటినుండి నా చర్మములో మార్పు అధికంగా వస్తున్నది. ముఖ్యంగా సూర్యరశ్మి పడుచోటబాగా నల్లగా అవుతున్నది. ఆ రంగు కూడా ఒక విధంగా మాడినట్లు వుంటున్నది. సూర్యరశ్మి తగలకుండా దుస్తులు ధరించిన చర్మము మీద బాగా తెలుపురంగు వుంటున్నది.

★ సూర్యరశ్మిలోని అల్ట్రా వయొలెట్ కిరణాల వల్ల శరీరం నల్ల రంగులో రావడం జరుగుతుంది. మన భారతదేశంలో సూర్యరశ్మిమెండుగా ఉండటం వల్ల ఈ లక్షణం సహజమే ! కాకపోతే కొందరి చర్మంపై ఈ కిరణాల ప్రభావం ఓ మోతాదు ఎక్కువగా ఉంటుంది.

మామూలు చిట్కాలు తప్ప దీనికి ప్రత్యేక చికిత్స లేదు. ●






# బొంబే డయింగ్

క్రొత్త సంవత్సరపు

# 15% తగ్గింపు అమ్మకం

Madhu Entps /BDM/85/4

బొంబే డయింగ్ వారి అన్నిరకాల వస్త్రాలపై

పాలియస్టర్, సూటింగులు షర్టింగులు

పాలియస్టర్, కాటన్ చీరలు, డ్రెస్ ప్రింట్లు, రూబియా, కేంబ్రిక్స్, లాన్స్.

ఫర్నిషింగులు, బ్లాంకెట్లు, దుప్పట్లు, తువ్వాళ్ళు, క్విల్ట్‌లు.

**ఈ తగ్గింపు కొద్ది కాలానికి మాత్రమే !**

శ్రీవెంకటేశ్వరా, చిక్కడపల్లి, కజానిస్ నాంపల్లి, ప్రెస్టేజి, గన్‌ఫౌండ్రి, రాజేష్, షీష్‌మహల్‌సమీపాన, అమీర్‌పేట, సూర్యాస్, బాలానగర్, జూలూరీస్, ఉస్మానియా మెడికల్ కాలేజి ఎదుట, కోఠి, హైదరాబాదు, కౌంటర్స్ హైదరాబాద్ & సికింద్రాబాద్, జూబారి సన్స్, జనరల్ బజార్, బుల్‌చంద్ ఎంటర్‌ప్రైజెస్, అబిడ్స్, ఎస్. యు. బుల్‌చంద్ & కం; ఎం. జి. రోడ్, సిల్వర్ లైన్, క్లాత్ సెలెక్షన్ సెంటర్, బాలాజీరైల్‌నిలయ సమీపాన, మచ్చబొల్లారం, రామ్‌టెక్స్, మెయిన్‌బజార్, బెల్లంపల్లి, శ్రీ జయలక్ష్మి, మార్కెట్‌రోడ్. భద్రాచలం, అపర్ణ, టవర్‌రోడ్, కరీంనగర్, బాలాజీసుభాష్‌రోడ్, కామారెడ్డి–సింగర్, బస్‌స్టాండ్ సమీపాన, నిర్మల్, బిందియ జవహర్‌రోడ్, నిజామాబాద్, జ్యోతి,వై. వి. స్ట్రీట్,కడప; లక్ష్మి సుభాష్‌రోడ్, అనంతపూర్; శారద, గాంధీరోడ్, తిరుపతి.

## యథార్థమైన తగ్గింపు, వాటాదార్ల కూపన్లు పై షోరూంలలో మాత్రమే అంగీకరింపబడును

# ఉత్తరాలు

( 4 వ పేజీ తరువాయి)

## ఆకట్టుకున్నది

లంచావతారం చిత్రంలోని నటి రజని ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రికలోని 'ఆ రాత్రి వారు వృధాచేసిన ఆఖరి క్షణం' కథ నా మనస్సును ఆకట్టుకున్నది. .

కోరాడ చక్రధరుడు,నరసన్నపేట.

## ముఖచిత్రం

"తెలుగుదేశం" పార్టీ స్థాపించి తెలుగునాడులో విజయభేరీ మ్రోగించి, రేపు, "భారతదేశం" పార్టీ స్థాపించి భరత భూమిలో విజయశంఖం పూరించనున్న నా తారక రాముని దివ్యమంగళ స్వరూపం చూడముచ్చటగానున్నది.

చిట్టూరి ఇంద్రయ్య, జగన్నాథపురం.

• • •

ఈ వారం ముఖ చిత్రం చూసి చాలా సంతోషించాను. (15-22 ఫిబ్రవరి) ఆంధ్రుల అన్న నందమూరి తారక రామారావు"గారు పత్రికకు నిండుదనం తెచ్చారు

పి. ఆర్. మూర్తి, కడప

• • •

ముఖ్య మంత్రిగారి ముఖచిత్రం అత్యద్భుతం.

రావిళ్ళ శ్రీనివాసరావు, బలిజేపల్లి.

• • •

మన ముఖ్యమంత్రిగారి ముఖచిత్రం వేసినందుకు థ్యాంక్యూ+అభినందనలు+కృతజ్ఞతలు.

గొట్టిపాటి శ్రీనివాసరావు, గుణదల.

## బాగుంది

మా అభిమాన నటి "ముచ్చర్ల అరుణ ముఖచిత్రంతో" వెలువడిన సంచిక చాలా బాగుంది.

అందరూ ఆలోచించండి: ఇది ఈ దేశం కథలు బాగున్నాయి

ఎస్. ఎం. గౌరీశంకర్, సన్యాసిరావు, కోరుకొండ.

## కథలు

మా అభిమాన నటి జయసుధ ముఖచిత్రంతో వెలువడిన ఈ వారం పత్రిక ఎంతో బాగుంది.

"మంటలు రేపిన నెలరాజు", "నల్ల డబ్బు" కథలు బాగున్నాయి.

పరాంకుశం రామనాథ్, ఇతరులు. పెదకాకాని.

## సీరియల్స్

పసిడిబొమ్మ – సీరియల్ రాను రాను ఉత్కంఠను పెంచుతోంది. శైలి, పాత్రల చిత్రీకరణ – వాటి మనస్తత్వాలు బావున్నాయ్. సీరియల్స్ ప్రచురించటంలో ఒక ప్రత్యేకత వుందని మరోసారి నిరూపించు కున్నారు.

కోలపల్లి ఈశ్వరరావు, నెల్లూరు.

## వ్యాసాలు

"కాకతీయ శిల్పకళా వైభవం" గురించి చాల చక్కగా వివరించారు

అపూర్వ శిల్ప సంపద ప్రభుత్వ ఆదరణ లేకపోతే క్రమేణా కనుమరుగవుతుంది.

బి. ప్రభాకరరావు, విశాఖపట్నం.

## అర్హతలని గురించి దుబాషీ

జనవరి 25–31 సంచికలో డా. జయదుబాషిగారి న్యూఢిల్లీ లేఖ "వింతైన ఎన్నికలు" వ్యాసంలో ఏమాత్రం అర్హత లేనటువంటి కొందరు వ్యక్తులకు అధికారం కట్టబెట్టడానికి మనం మూకుమ్మడిగా ఓటు చెయ్యడం సరైన పద్ధతేనా? అంటూ సినీ నటులు సునీల్‌దత్, వైజయంతిమాల, అమితాబ్ బచన్‌లను గురించి విమర్శ చేశారు. అసలు వారికి లేనటువంటి అర్హత ఎలాంటిది. సినిమా వాళ్ళనే ఉద్దేశ్యంతోనే ఏ అర్హత లేనట్టు, వంటివారు అన్నట్లు తోస్తుంది. అదే వారి ఉద్దేశ్యమైతే మరి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు గారి మాటేమిటి? డా. జయదుబాషిగారి దృష్టిలో ఆయన రాజకీయంగా ఏ అర్హత లేనివారు కాదా? వీరు కూడా ఆడే పాడే ఒక సినిమా-నటుడే కదా! శ్రీ రామారావుగారు కూడా మాకు తెలిసినంతవరకు ఉదారంగా ఏ ఒక్కటీ చెయ్యలేదు. రాజకీయాలలో ఓనమాలు కూడా తెలియని ఒక సినిమా నటుడుకి ఆరు కోట్లమంది ప్రజలుగల రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా అధికారం కట్టబెట్టగా లేనిది కేవలం కొన్ని లక్షలమందికి ప్రతినిధిగా పార్లమెంటుకి ఎన్నుకోవడంలో తప్పేమిటి?

దేశంలోని కోట్లాది ప్రజల భవిష్యత్తుకి సంబంధించిన నిర్ణయాలు తీసుకునే శక్తి వారికి ఎలా వస్తుంది అంటూ వారి వృత్తులను ఎత్తి చూపటం జరిగింది. ఇది సబబుగా లేదు

మంత్రదండం గాలిలో వూపినంత మాత్రాన, వానదేవుడి ముందు నృత్యం చేసినంత మాత్రాన సమస్యలను పరిష్కరించలేరు అన్నారు ఆ విధంగా పరిష్కరిస్తామని ఎవరన్నారు?

కాంగ్రెసు పార్టీ 400 మంది సభ్యులను పార్లమెంటుకి పంపి ఉండవచ్చు కాని ఎన్నికలలో ఓటు వేసినవారిలో సగానికి పైగా ఆ పార్టీకి వ్యతిరేకంగా ఓటు చేసారన్న విషయాన్ని వారు గుర్తుంచుకోవడం మంచిదన్నారు. 1977లో జనతా పార్టీ అధికారంలోకి వచ్చినపుడు కూడా ఓటర్లందరూ ఆ పార్టీకి అనుకూలంగా ఓటు చెయ్యలేదు కదా! ఇదీ అంతే.

యన్. మాధవరావు, రావిగుంటచెరువు

## హైదరాబాదు నోట్‌బుక్

### యోగవేదాంత మహాసభలు:

ఈ సంసారం సాగరంలో కొట్టుమిట్టాడుతూ, కష్టంలో పడిన ఈగల్లాగ గిజగిజలాడుతున్న బాధా సర్పదష్టులకు జనవరి 30 నుంచి ఫిబ్రవరి 5 వరకు పద్మారావు నగర్‌లోని శివానంద సత్సంగ భవన్‌లో జరిగిన యోగ వేదాంత మహాసభ ఎంతో ఊరట కలిగించింది. ఈ మహాసభలో ప్రపంచ దివ్యజీవన సంఘాధ్యక్షులు శ్రీ స్వామి చిదానందజీ మహారాజ్ తమ దివ్య సందేశంతో ఆస్తికులను, హేతువాదులనూ కూడ ఉత్తేజ పరచారు. ఐదు రోజుల పాటు తెల్లవారు జామున 4–30 నుంచి 5–00 వరకు బ్రాహ్మ ముహూర్త ప్రార్థనలు, విష్ణు సహస్రనామ పారాయణలు, తర్వాత ప్రభాత ఫేరీలు, ఏడవ సామూహిక ధ్యానం, యోగాసన ప్రదర్శనలు, గీతా ప్రవచనలు, భాగవత పారా యణం, లిఖితజపాలు – రామకోటి లేఖనం, భాగవత ప్రవచనం, శ్రీ మదష్టాక్షరీ మహామంత్ర జపయజ్ఞం, సాయంకాలం ప్రసంగాలు, రాత్రి వీడియో ఫిలిం ప్రదర్శనం, భక్తి సంగీతం సంతత ధారగా జరిగాయి. భాగవతసప్తాహాన్ని మహా విద్వాంసులు, వైయాకరణ సార్వభౌములు శ్రీ ఖండవల్లి నరసింహశాస్త్రి, సాహిత్య, వ్యాకరణ, వేదాంత విద్వాంసులు శ్రీ జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రి, సాహిత్య, వేదాంత, వ్యాకరణ విశారద డాక్టర్ మల్లాది గోపాల కృష్ణశర్మ నిర్వహించారు. ప్రపంచ దివ్య జీవన సంఘాధ్యక్షులు శ్రీ స్వామి చిదానందజీ మహారాజ్ ఉదయం ఆధ్యాత్మిక శిక్షణ ఇవ్వడమే కాక సాయంకాలం వివిధ విషయాలపై ప్రసంగించారు. యోగాసనాలను యోగచర్య శ్రీ సూరి రాఘవ దీక్షితులు నేర్పారు దివ్య జీవన సంఘం దక్షిణ భారత విభాగం కార్యదర్శిశ్రీ టి. వేణుగోపాలరెడ్డి ఐదురోజులూ సాయంకాలం భక్తి శ్రద్ధలతో సామూహిక నామ జప సంకీర్తన జరిపారు. 30 వ తేదీ ఉదయం మహాసభ శ్రీ స్వామి చిదానందజీ మహారాజ్ అధ్యక్షతన హరేరామ సంకీర్తనతో ప్రారంభమయింది. ఆనాటి ఉదయం డాక్టర్ మల్లాది గోపాల కృష్ణశర్మ భగవద్గీత ప్రథమాధ్యాయంపై ప్రవచనం చేశారు. అర్జునుడు తనకు కలిగిన మనస్సంక్షోభంతో ధర్మాధర్మ వివేచన చేయలేదు. గనుక కృష్ణుని శరణు వేడాడని ఆయన అన్నారు. సాయంకాలం శ్రీ చిదానందజీ 20వ శతాబ్దపు మానవుడు ఏమి కోరుకోవాలి అనే విషయమై ప్రసంగించారు. నేటి మానవ విజ్ఞానం ధర్మంపై ఆధారపడకపోతే, సర్వనాశనానికి దారి తీస్తుందన్నారు. రెండవనాటి ఉదయం డాక్టర్ మల్లాది గోపాలకృష్ణశర్మ భగవద్గీతలోని సాంఖ్య, కర్మయోగాలను గురించి ప్రసంగించారు. మానవుడు ఫలాపేక్షలేక కర్తవ్య బుద్ధితో ఈశ్వరార్పణంగా కర్మలు చేయాలని ఆయన వివరించారు. సాయంకాలం శ్రీ ఖండవల్లి నరసింహశాస్త్రి శ్రీ మద్భాగవతం ప్రథమ స్కంధం ప్రవచించారు. సాయంకాలం శ్రీ చిదానందజీ యువకులకూ, గృహస్థులకూ యోగ సాధనం అవసరమనే విషయమై ప్రసంగించారు. నేటి బాలుడే రేపటి పౌరుడయి నట్లు నేటి బ్రహ్మచారే రేపటి గృహస్థు గనుక, ప్రతివారూ విద్యార్థి దశనుంచే గృహస్థాశ్రమ నిర్వహణకు తగిన గుణాలను పెంపొందించుకోవాలని, బాహ్యాభ్యంతరేంద్రియాలను నియమనంచేసి, సత్యశౌచాదులు అలవరచు కోవాలన్నారు. మూడవనాటి ఉదయం డాక్టర్ మల్లాది గోపాల కృష్ణశర్మ కర్మ యోగ రహస్యం వివరించారు. సాయంకాలం శ్రీ ఖండవల్లి నరసింహశాస్త్రి భాగవతద్వితీయ స్కంధంపై ప్రసంగించారు. రాత్రి శ్రీ చిదానందజీ ప్రతివారు తమ జీవితాన్ని ఆధ్యాత్మికం చేసుకోడం ఎలా అనే విషయంపై ప్రసంగించారు. భార్యాభర్తలు తమ ధర్మం నిర్వహించడంతో బాటు నిరంతరం భగవన్నామ సంకీర్తనం చేస్తూ భగవ దర్పణంగా పనులు చేయాలన్నారు. నాల్గవనాటి ఉదయం డాక్టర్ మల్లాది గోపాల కృష్ణశర్మ కర్మ అకర్మ వికర్మలను వివరించారు. మానవుడు ఏకర్మ చేసినా, ఏ మార్గం అనుసరించినా, భగవదారాధన రూపంగా చేయడం కల్యాణ కరమని ఆయన అన్నారు. సాయంకాలం డాక్టర్ శర్మ భాగవత విశిష్టతను గురించి ప్రసంగించారు. శ్రీమద్భాగవతం భక్తి జ్ఞానాలకు సమాన ప్రాధాన్య మిచ్చి ఆధ్యాత్మిక క్షేత్రంలో మహా విప్లవం తెచ్చిందన్నారు. రాత్రి శ్రీ చిదానందజీ మనో నిగ్రహం, దాని అవసరం, పద్ధతులు – అనే విషయమై ప్రసంగించారు. ఐదవనాడు ఉదయం సహస్రనా మాదులలో పోటీ జరిగింది. మధ్యాహ్నం శ్రీ ఖండవల్లి నరసింహ శాస్త్రి భాగవతం తృతీయ చతుర్థ పంచమ స్కంధాలను గురించి ప్రసం గించారు. సాయం కాలం శ్రీ చిదానందజీ భారతీయ సంస్కృతి లోని నాలుగు నాలుగులను గురించి ప్రసంగించారు. చతురాశ్రమాలు, చతుర్వర్గాలు, చతుర్యోగాలు చతుస్సాధనాలు – ఇవి నాలుగు నాలుగులని, వాటిని అనుసరిస్తే జన్మ సార్థక మవుతుందని ఆయ[న] అన్నారు. ముఖ్య అతిథిగా విచ్చేసిన రాష్ట్ర ప్రధా[న] న్యాయమూర్తి శ్రీ పి. చెన్నకేశవరెడ్డి ప్రసంగిస్తూ నీతి చట్టానికి మూలమని, అవినీతిని అరికట్టడాని[కి] తగిన చర్య తీసుకోవాలని, దుర్మా ర్గు[లు] ఎక్కువయితే, జీవితం దుఃఖమయ మవుతుంద[ని] అన్నారు. ఆరవనాడు ఉదయం డాక్టర్ మల్లా[ది] గోపాలకృష్ణ శర్మ గీతపై ప్రసంగిస్తూ మనో నిగ్రహ[ం] గురించి వివరించారు. ఇంద్రియ నిగ్రహం చేసినవా[డే] స్థిత ప్రజ్ఞుడని వివరించారు. సాయం కాలం [శ్రీ] చిదానందజీ అన్ని మతాలలోను సాధారణ ధర్మాలు ఒకటేనని, దయ, అహింస, భక్తి, ప్రేమ మొ[ద] లయిన ఆత్మ గుణాలను అన్ని మతాలు బోధిస్తాయని అన్నారు. హింస వుంటే మత[ం] చచ్చినట్లేనని ఆయన అన్నారు. ముఖ్య అతిథిగ[ా] వచ్చిన రాష్ట్ర మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ అల్లాడి కుప్పుస్వామి ప్రసం గిస్తూ, ప్రపంచానికి ఒక మతం సాధ్యం కాక పోయినా, మత సామరస్యం సాధ్యమన్నారు. చివరినాటి ఉదయం భాగవత సప్తాహం రుక్మిణీ కల్యాణంతో సమాప్త మయింది. శ్రీ ఖండవల్లి నరసింహశాస్త్రి రుక్మిణీ కల్యాణ ఘట్టం చదివి వివరించారు.భాగవతం పురాణమే కాక మహాకావ్యమని, శాస్త్రమని, వేద వేదాంత యోగాలకు భాష్యమనీ అన్నారు. మధ్యాహ్నం డాక్టర్ మల్లాది గోపాలకృష్ణశర్మ భగవద్గీతా ప్రాశస్త్యం వివరిం చారు. సాయంకాలం శ్రీ చిదానందజీ ప్రస్తుత యుగానికి తగిన ధర్మం, యోగసాధన అనే విషయమై ప్రసంగిస్తూ, ప్రస్తుత యుగధర్మం సత్య త్యాగాలని, యోగసాధనం భక్తియోగం – ముఖ్యంగా భగవన్నామ జపమని అన్నారు. డాక్టర్ మల్లాది గోపాలకృష్ణ శర్మ వందన సమర్పణతో మహాసభ సమాప్తమైంది. ఆరవనాటి రాత్రి సంగీత విద్వాంసులు శ్రీ నూకల చిన సత్యనారాయణ భక్తి గీతాలు గానం చేశారు. శ్రీ చిదానందజీ ఆరవనాటి సాయంకాలం యోగాచార్య శ్రీ సూరి రాఘవ దీక్షితులు రచించిన యోగాసనాల గ్రంథాన్ని ఆవిష్కరించారు. ఈ సభ ఏర్పాట్లను దివ్యంగా చేసిన శ్రీ టి. వేణుగోపాలరెడ్డిని మనసార అభినందిస్తున్నాను.

### ఉపశ్రుతి:

ఏంసార్, యోగవేదాంత మహాసభలు ఏర్పాటు చేసేవారు పానకంలో పుడకల్లాగ రాజకీయ నాయకుల ప్రసంగాలు పెట్టి సభలను ఎందుకు కలుషితం చేస్తారు?– అనడిగారు నన్నొకరు. అలా ఎందుకనుకుంటారు. వారినీ పవిత్రులనుచేయడానికే పిలుస్తారను కోరాదూ?– అన్నారు మా మాటలు వింటున్న ఒకపెద్ద మనిషి.

–తిరుమల రామచంద్ర.

*Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at the, Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor : S. Radhakrishna, Phones : P. B. X. : 61247, 61248 & 75667.*


ప్రేమ్ సబ్బుతో స్నానం
రోజంతా ఉల్లాసం
మీ శరీరమునకు మృదుత్వమునిచ్చి సహజ
సౌందర్యమును పెంపొందించు సబ్బు ప్రేమ్.
దీని స్వచ్ఛమైన నురగ, పరిమళము
మీ మనసును పులకింపజేయును.
Prem
THE REFRESHING SOAP
గులాబి మఱియు ఆకుపచ్చ
రంగులలో లభించును.
జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ
Imageads 2005 Tel




kiron/apco/85/s4